తప్పక చూడండి!

అత్యం సోమేశ్వరరావు సమర్పించు, సూర్యచిత్రా వారి

# పెళ్ళిరోజు

దర్శకత్వం. మానాపురం

నిర్మాతలు. M.S. శ్రీరామ్-K. నాగేశ్వరరావు



# ఉత్తరాలు

### సి ని మా

నేను శ్రీ రామారావుగారిపై వ్యాసం వ్రాసినప్పుడు శ్రీ సత్యంగారు దాన్ని ఖండిస్తూ, నాకు విలేఖరిగా నా బాధ్యతల్ని గుర్తు చేసారు. నాపై ఇంతటి అభిమానాన్ని ప్రదర్శించినందుకు మనసారా అభినందించాను. కానీ శ్రీ సత్యంగారు నా అభినందల్ని తిరస్కరిస్తున్నారే! నేనేం చెయ్యగలవాడను?

—శ్రీనివాస్, మదరాస్.

**ఇంతటితో ఈ విషయంమీద ఉత్తర ప్రత్యుత్తరాల ప్రచురణ నిలిపివేస్తున్నాము.**

**—సం ]**

### అచ్చు తప్పులా?

శ్రీ కృష్ణగారి న్యూఢిల్లీ లేఖలో ప్రతివారం వస్తున్న కొన్ని తెలుగు పదాలు మీ దృష్టికి తీసుకరావలయునవే ఉద్దేశ్యముతో ఈ లేఖ వ్రాస్తున్నాను. వీటిలో కొన్ని అనువాదకుడి తప్పులు కావచ్చు. మరికొన్ని కంపోజరువి. ఆంధ్రభాషకు అచ్చుతప్పులు పుట్టు మచ్చలేమో! అయినా సంపాదకులు శ్రద్ధ తీసుకోవాలి. భాషమీంది మమకారం కొద్దీ వ్రాస్తున్నాను. అన్యథా భావించవద్దని కోరుతూ,

భవదీయుడు

జా. కృష్ణారావు, వల్లభవిద్యా నగర్ (గుజరాత్),

**జవాబు:** ....

డాక్టర్ కృష్ణారావుగారు తీరిక చేసుకొని ఇన్ని సూచనలు చేసినందుకు కృతజ్ఞులం. కాని, మన లిపి పుటుపూర్వాలను ఒక్కసారి డాక్టర్ రావు గారు పరిశీలించాలి.

తెలుగు కన్నడ మలయాళాలలోని ఒత్తుల పద్ధతి ఏ కారణం వల్లనో అసహజంగా ఏర్పడినట్టే ది. 'విస్తృతం' అనే పదమే తీసుకుందాం. నిజానికి, సంస్కృత భాషా మర్యాద ప్రకారం సకారం అర్ధాక్షరం, తకారం మీద వట్రువసుడి నిలవాలి. దేవనాగరి, నందినాగరి, బెంగాలీ, గుజరాతీ, ఒరియాలిపులలో ఈ మర్యాద శాస్త్రీయంగానే నిలిచి వుంది. తెలుగు కన్నడ మలయాళ లిపులలో అర్ధాక్షరం కావలసిన 'స్' పూర్తిగా నిలిచి, పూర్ణాక్షరంగా వుండవలసిన 'త' అడుగున ఒత్తుగా గౌణంగా వుండిపోవడం తటస్థించింది.

ఇప్పటి మన వ్రాత, అచ్చు పద్ధతులలో శతాబ్దాలుగా వస్తున్న ఈ లోపాన్ని సవరించడం సాధ్యం కాదు. కాని, అదృష్టవశాత్తు ఇప్పటి మోనో టైప్ పద్ధతిలో సక్రమంగా, శాస్త్రీయంగా ముద్రించడానికి అవకాశం వుంది. ఆ దృష్టితోనే "విస్త్‌ృతం, పునర్ వ్యవస్థ, శాస్‌త్రి" మొదలయిన పదాలు ముద్రించడం సంభవించింది.

చెయినా, రయితు, మయిదానం, రయిల్వే అయికమత్యము, సెయినికులు, అయిక్యరాజ సమితి అనే పదాల విషయంలో డాక్టర్ రావు గారి వాదం సకారణమే. చెయినా, సెయినికులు అనే పదాల విషయం అటు వుంచి, తక్కిన పదాల మాట చూద్దాం.

ఐత్వం అయికావడం, అవుత్వం అవ్ కావడం సంస్కృత, సంస్కృతేతర భాష లన్నిటిలోను శబ్ద శాస్త్రీయం. నౌ— నావిక ఇత్యాది. తెలుగులో ఔను— అవును, ఐన— అయిన మొదలయిన ద్విరూపాలు శాస్త్ర సమ్మతాలు. అందువల్ల రైతు, మైదానం అనేవి రయితు, మయిదానం అని వ్రాయడం తప్పులేదనే మా నమ్మకం. ఇవి రెండూ పార్సీ పదాలు—రయ్యత్, మయిదాన్.

చెయినా, సెయినికులు తప్పని ఒప్పుకుంటున్నాము. చీనదేశం, చీని చీనాంబరాలు, చీనాపాత్రలు మొదలయిన వ్యవహారం మనకు చాలాకాలంగా వుంది. "చీనాంశుక మివ కేతోః" అని కాళిదాసు ప్రయోగించాడు. ఉత్తర భారత భాషలన్నీ చీన్, చీణ్ అనే వ్యవహరిస్తున్నాయి. కాని, మనం చైనా అని ఆంగ్ల భాషా ప్రయోగం తీసుకున్నాము. చీనా, చీనాదేశం అంటే అందంగానే వుంటుంది. సైనికుడు అనే మాటను సయినికుడు అనడం అంత తప్పుకాక పోవచ్చుగాని, సెయినికుడు కటువుగానే వుంది.

రివిజనిస్టు, జయపాలసింగ్, ఫెర్నాండెస్, మ్యూసియం, చెకొస్లావాకియా, ఇస్రాయిల్— పదాల సంగతి.

విదేశ పదాలను ఆయా భాషలవారు తమ ఉచ్చారణకు అనుగుణంగా మలచుకొని వాడుకోడం ప్రపంచ వ్యాప్త సత్యం. సంస్కృత శబ్దం శాన్స్క్రిట్ ఎందుకయింది? గంగా శబ్దం గేంజెస్ ఎందు కవుతుంది? అన్యభాషా పదాలను మనం మన ఉచ్చారణలో పలకడ మనేది సహస్రాబ్దాలుగా మనకు అలవాటు. సుల్తానును సురత్రాణ అన్నాము. ఖానును ఖానః అన్నాము. ఇబ్రహీమును ఇభరామ అన్నాము. ఇలాగే జామిత్ర, కేంద్ర, అనఫా మొదలయిన జ్యోతిశ్శాస్త్ర పారిభాషికాలు గ్రీక్ భాష నుంచి సంస్కృతంలో చేరి పోయాయని పెద్ద లంటారు. అందువల్ల రివిజనిస్టు, ఫెర్నాండెస్, మూసియంలు తద్భవాలకింద సరైన పదాలే. చెకొస్లావాకియాయే కాని, జెకోస్లోవాకియా కాదు. ఇజ్రాయల్ అంటే రాక్షసుడు, సైతాను. ఇస్రేల్ అంటే దేవ విశ్వాసి. ఇస్రాయిల్ కన్నా ఇస్రేల్ అని వాడడం సబబు. ఇదంతా మనకు ఆంగ్లోచ్చారణ వల్ల వచ్చిన తంటా.

మనం ఇకమీద ఏ విదేశీ పదాన్ని వాడినా, మూల పదోచ్చారణ సమీచీనంగా తెలుసుకొని, సక్రమంగా వాడడం అవసరం. ప్రపంచ మంతా నేడు సన్నిహిత మవుతున్నది. దేశంలో ప్రతి రాష్ట్ర రాజధానిలోను విదేశీయ ప్రతినిధులు ఉండనే వున్నారు. వారిని అడిగి సరైన ఉచ్చారణ తెలుసుకొవడం అంత కష్టమేమీ కాదు.

యంత్ర సౌకర్యాన్ని బట్టి సరైన ఉచ్చారణ కోసం చేసిన ప్రయత్నాన్ని ఇంతగా వివరించాము. డాక్టర్ రావుగారి ఆదరానికి మరొక మారు కృతజ్ఞులం. సం॥

* * *



# పెద్ద పెద్ద ఆశయాలున్నాయి
# ఉత్సాహముంది
# వృద్ధిలోకి వస్తున్నాడు
# అతడి సైకిలు ఫిలిప్స్

ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది ఎంత పెద తొక్కినా తట్టుకొనేటట్లు మంచి బ్రూ టెంపరు స్టీలుతో తయారైంది. దాని అంద చందాలు గంభీరత కూడా మీ సంస్కృతిని బాగా తెలియజేస్తాయి. మీవంటి యువకులకు తయారుచేయబడిన విశిష్టమైన బైసికిలు

ఫిలిప్స్ మీరు వాడదగిన సైకిల్






®
జె. ఎ. ఫిలిప్స్ కంపెనీ లిమిటెడ్ యు.కె వారి రిజిస్టర్ ట్రేడ్ మార్కులు. ఇండియాలో తయారు చేయువారు టి ఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53 ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు-1 ఉపయోగించుటకు రిజిస్టరు కావింపబడినవి. చిన్న మొత్తముల సేకరణలో ఆదా చేయండి.
T.I.C/P/3820a

® ఫిలిప్స్

## ముఖచిత్రం

ఈ వారం పత్రిక (18—10—68) ముఖ చిత్రము జయలలిత చూడ ముచ్చటగా యున్నది. ఎన్నో రోజుల నుంచి ఎదురు చూస్తున్న శ్రీశైల మహాక్షేత్రం గురించి యిన్ని దినాలకు యీ పత్రికలో చూచునప్పటికి మహదానందం కల్గింది. యిక కథలలో ముఖ్యముగా నన్నాకర్షించినది శ్రీ బొర్రా నరహరిరావుగారి 'మమత'. యిందలి పాత్ర పోషణ చాలా బాగుందనుటలో అతిశయోక్తి లేదు. యిక జమ్మి కోనేటిరావుగారి రంగుల రాట్నం శీర్షిక మా వంటి విద్యార్థుల కెంతో ఉపయోగపడు తుంది.

యం. కోటిరెడ్డి, గదగ)

* * *

11—10—68 వ తేదీ వారపత్రిక ముఖ చిత్రము బాగుంది. కాని గోపిసెట్టిగారు తామరాకు నుండి పువ్వు పూసినట్లుగా చిత్రాన్ని గీశారు. కాని తామరాకులో నుండి పువ్వు పుట్టదు. ఇది గోపిసెట్టిగారు గమనించ ప్రార్థన. ఆకు కూడా తామరాకు వలె కన్పించుట లేదు.

అన్నపూర్ణ, పద్మ, రమ ( హైదరాబాద్ )

* * *

11—10—1968 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం చాలా ఆకర్షణీయముగా నున్నది.

47వ పేజీలోని కాటూరి రచించిన కార్టూను చాలా హాస్యాస్పదంగా యున్నది. కాని 'కాటూరి వారి గడియారములో 9కి బదులు 3, మరియు 3 కు బదులు 9 అను అంకెలు వేయబడినవి.. కార్టూను కన్న "గడియారమును చూసి చాలా నవ్వు వచ్చిందంటే నమ్మండి.

మహేష్ గారి "ముగ్గురు మూర్ఖులు" చాలా బాగుగా యున్నది. ఇటువంటివి మీ పత్రికలో ఇంకా చాలా వెలువడ లని ఆశిస్తున్నాను.

రఘు, గిరి (హైదరాబాద్)

* * *

11—10—68 పత్రిక యొందలి ముఖ చిత్రము చాలా బాగుగా యున్నది. ఆ చిత్రమును చూడగానే పత్రిక, రచయితలనెడి సరస్సునుండి వికసించిన సాహిత్యమనెడి కలువలనుంచి, మధువును గ్రహించి పాఠకుల కందజేయునదిగా నాకగుపడినది. చిత్రకారునకు నా అభినందనలు.

పొన్నగంటి సాంబశివరావు— ( మచిలీపట్నం )

* * *

జయలలిత ముఖ చిత్రము (18.10.68) సంచికలో శ్రీ కె. వాణిగారు వ్రాసిన "మనసులో మనసు" నన్ను ఎంతో ఆకర్షించినది. సరోజపాత్రకు జీవము పోసినట్లు వ్రాసినారు. వారికి నా హృదయ పూర్వక అభినందనములు.

కుమారి రత్న, ( గంగావతి )

* * *



## ఉత్తరాలు

### సీరియల్సు

ఈ వారం పత్రికలోని "జీవిత వలయాలు", "సుజాత" ఈ రెండు సీరియల్స్ బాగున్నవి. ఈ రెండు సీరియల్స్ చదివే కొద్దీ చదవాలనిపించు చున్నవి. ఈ రెండు పత్రికకు రెండు ఆణిముత్యాల వంటివి.

ఎల్. గ్లాడ్స్టన్, ఎల్. అస్వాల్డ్ హిక్సన్,
( భీమవరం )

* * *

ఈ వారం ఆంధ్రపత్రిక చదివాను. ఇందులో నాకు ఎక్కువగా నచ్చినవి సీరియల్స్. వాటిలో జీవిత వలయాలు, సుజాత మొదట్లోనే పాఠకుల మనస్సును హత్తుకున్నాయి. ఇంత చక్కని కథ లను అందచేస్తున్న సంపాదకులుకు మా కృతజ్ఞతాభివందనములు పత్రిక ద్వారా అంద చేస్తున్నాము.

చక్రవర్తి ప్రసాద్, ( మహబూబ్‌నగర్ )

* * *

ఈవార పత్రిక (18.10.68)లో సీరియల్స్ రెండును బాగుగా నడుస్తున్నవి. అందులకు నేను రచయిత్రులను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. రమణిగారు వ్రాసిన పెద్దకథ 'ఇలా జరుగుతుం దనుకోలేదు" చాలా బాగుగా నున్నది. కాని చివర "ముగింపు పై వారం" అని పాఠకులను నిరాశ చేశారు.

టి. వీరారెడ్డి, ( ఆకివీడు

### కథలు

18.10.68 తేది గల వారపత్రికలోని "మనసులో మనసు", కథ చాలా అద్భుతంగా వున్నది. ముఖ్యంగా సస్పెన్స్ చెప్పుకో తగ్గ విషయము. రచయిత్రి కె. వాణిగార్కి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపకోరుచున్నాను.

సి. హెచ్. మోహన్‌దాస్, ( కోసిగి

* * *

మీ వారపత్రికలో ప్రచురించిన "మనసులో మనసు" అనే కథ చాలా బాగున్నది. కాని ముగింపు మాత్రము చాల అసహజముగాను, అసందర్భము గాను ఉన్నది.

మీనాక్షి, (అమలాపురము)

* * *

11—10—68 వ తేది ఆంధ్ర సచిత్రవార పత్రిక యందు ప్రచురింపబడిన "మమత" అను కథ చాలా బాగున్నది. "ఒక పువ్వు మూడు ముళ్ళు" కథ కూడ చాలా బాగుంది. వాటిని రచించిన వారికి నా ధన్యవాదాలు.

గద్వాలు శంకరణ్ణ, ( హోస్పేట )

### గమనిక

కొన్ని అనివార్య కారణాలవల్ల ఈవారం 'ట్రిక్ ఫోటోగ్రఫీ' వ్యాసం వెయ్యలేక పోతున్నాము. —సం.




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 1—11—'68
కీలకనామ సం॥ కార్తికమాసం శుద్ధ ద్వాదశి

సంపుటము : 61 సంచిక : 10

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'నేనే మొనగాణ్ణి'లో షీలా



నేను యాత్రలు చేస్తున్నప్పుడు ఎలా పాలించావు?
మీ పాలనకి తీసిపోకుండా
దీపావళిలో కూడా చిరిగిన బట్టలా?
స్టేట్ లాటరీలో డబ్బంతా పోయింది ఏంచెయ్యను?
విదేశాలు పురెక్కించిన స్వతంత్ర కాశ్మీరు
క్రిందకు దిగు పునాది కట్టుదిట్టంగా లేదు
భయపడకు! తాత్కాలికంగా ఆశ్రయమివ్వు
చెకోస్లోవాకియా
OOMMEN

శ్రీకృష్ణ

# శత్రువులను పోషిస్తున్న భారత దేశం

అక్టోబరు 18 తేదీ శుక్రవారం చాలా దుర్దినం. జనవరి 30 శుక్రవారం నాడు మహాత్మాగాంధీ హత్య జరిగింది. సెప్టెంబరు 19న సమ్మె చేసిన ఉద్యోగులు దురదృష్టవంతులని కేంద్రప్రభుత్వం నిర్ణయించిన తేదీ అక్టోబరు 18. అదీ శుక్రవారమే. ఈ శుక్రవారం పేరేలాంటిదో గాని, జరగకూడని దారుణాలన్నీ ఆదే రోజున జరుగుతూ వుంటాయి. కేంద్ర ఉద్యోగులపై ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం— సర్వస్వతంత్ర ప్రపంచంలో— ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టులాంటిది అని కొందరు అంటున్నారు

రాజకీయవేత్తలు పాల్గొనకపోతే— కేంద్ర ప్రభుత్వోద్యోగుల కోరికలు పూర్తిగా తీరక పోయినా, అన్యాయం మాత్రం జరిగి వుండేదికాదు. చవాన్‌గారు ఎంత బాధ్యతయుతమైన పరిపాలకులో ఉద్యోగుల మీద చర్య తీసుకుని నిరూపించుకున్నారు. ఇది చాలమంది రాజకీయవేత్తలకి ఇష్టంలేదు. ఈ నేతలు తమ ఇష్టప్రకారమే ప్రభుత్వం నడవాలనుకునే తరహావారు. లేకపోతే తమ పదవికి, ప్రభుత్వోద్యోగులపై తమ యజమాయిషీకి మోసం జరుగుతుందేమో నన్న భయంకూడా వీరికి లేకపోలేదు.

**సమ్మె వెనక మనుషులు?**

ఉద్యోగులు — ప్రభుత్వం మధ్య రాజీ కుదరక పోడానికి కారణాలు సుస్పష్టం. ప్రధానమంత్రి శ్రీమతి గాంధీగారు పర్యటనల్లో వున్నారు. ఆమెగారు చవాన్‌గారికి దేశాన్ని పట్టంగట్టి వెళ్ళారు. ఇది రహస్యమేమీ కాదు. సమ్మె ఉద్యమానికి వెనక చవాన్‌గారి ప్రత్యర్థి వర్గం వుందని ఒక వూహ. 'మొరార్జీ తరువాత చవాన్' అన్న నినాదం విన్న ఎవరన్నా ఈ వూహని బలపరుస్తారు. ఈ నినాదంతో వ్యక్తిగౌరవాన్ని, మాన మర్యాదల్ని మంట కలుపుతున్నామని భావించే వారెవరూ వుండరు. మొఘలు సామ్రాజ్య పతనానికి గాని, మహారాష్ట్ర పాలన విచ్ఛిన్నం కావడానికి గాని ఇవే సూత్రాలు అవలంబించడం జరిగింది. ఇప్పుడు మన ప్రభుత్వంలో జరుగుతున్నది కూడా ఇంతకు విరుద్ధమైనది ఏమీ కాదు.

మరో చెప్పదగిన కథ వుంది. దుర్గాపూర్ ఉక్కు కర్మాగారంలో 'గూడుపుఠాణీ' బయల్దేరింది. ఇంటి దొంగలెక్కువయ్యారు. తద్వారా మిల్లుకు చాలా నష్టం వాటిల్లింది. అధికారులు ముందే జాగ్రత్త పడివుంటే ఈ నష్టం జరిగి వుండేదికాదు. శ్రీమతి గాంధీగారు కలిగించుకున్నారు. బాగానే వుంది కాని, ఆమె వి. వి. గిరిగారి పద్ధతిలో శిక్షించి నందువల్ల ఏం మేలు లేదు. కేంద్రప్రభుత్వం శ్రీమతి గాంధీగారికోసం వేచి చూసి తీసుకునే చర్యలకి పర్యవసానం ఉదాహరణగా ఇది ఒకటి !

**చట్టమూ — ప్రతిపక్షాలూ**

ప్రతి పక్షాల తెలివితేటలు వర్ణనాతీతం. జనసంఘీయులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, మొదలైన పార్లమెంటుసభ్యులు పదహార్గురు కలిసి యస్. యమ్. బెనర్జీ గారిని ఉపయోగించుకుని రాష్ట్రపతికి ఒక మెమొరాండం సమర్పించారు. అందులో ప్రధానమంత్రి శ్రీమతి గాంధీగారిని, దేశీయాంగమంత్రి చవన్‌గారిని వెంటనే పదవీచ్యుతుల్ని చేయాలని విజ్ఞప్తిచేశారు! ఈ విధంగా జరిగితే భారతదేశంలో న్యాయమూ చట్టమూలాంటి వాటికి స్థాన ముండదని వారి భావం ! ఇందులో సంతకం చేసిన వారిలో ఎంతమందికి అసలు చట్టమంటే తెలుసునో? కనీసం దానిమీద ఎంతమందికి నమ్మకముందో తెలియజెప్పడం అశక్యం. జనసంఘం దృష్టిలో చట్టం విదేశీయులది. మనది కాదు. హైందవ సాంప్రదాయంలోని ధర్మశాస్త్ర సూత్రాలు వేరు. మరి వీటిని ఎంతవరకు హిందీలోకి అనువాదం చెయ్యగల్గుతారో ఆ భగవంతుడికే తెలియాలి.

సరే, కమ్యూనిస్టుల చట్టమంటే ఏమిటో చెకోస్లోవేకియాలో ప్రవేశపెట్టి చూపించారు. సెప్టెంబరు 29వ తేదీన కమ్యూనిస్టుపార్టీ అధికార పక్షం ఒక వ్యాసంలో ఇలా అంది : 'ఉద్యమాన్ని ఎదిరించే ఎవరికైనాసరే మెడమీద తలకాయలుండరాదు' అన్నది దాని సారాంశం ! ఇవే న్యాయసూత్రాలు అయితే మాటలకి అర్థంచెడి అయినా వుండాలి. మనుషులకి కార్యకారణ జ్ఞానమన్నా నశించి వుండాలి !

**ప్రతిపక్షాల ఆదర్శం**

ప్రజాస్వామ్య వాదాన్నుపయోగించుకుని ప్రజాస్వామ్యాన్ని ఎలా తుడిచిపెట్టాలో కమ్యూనిస్టులకి బాగాతెలుసు. ఏ చట్ట ప్రకారం వీరు ఘెరావ్‌లని ప్రవేశపెట్టారో తెలియదు. ఒకతెగ పనివాళ్ళచేత మరోతెగ పనివారికి అన్నాహారాలు అందనివ్వని ఈ సూత్రం ఎంత హర్షనీయమో ఆలోచించ తగ్గది.

జనసంఘం పాలనకింద చట్టమూ—సూత్రాలు అనేవి అసలు ఉండవని కొన్ని ఉదాహరణలు చెబుతూనే వున్నాయి. ఈ పక్షంకూడా ప్రజాస్వామ్యాన్ని మట్టుపెట్టడానికి ప్రజాస్వామ్యాన్నే ఉపయోగించు కుంటున్నది.

సోషలిస్టుల విషయం విచారకరమైనది. 'ఘెరావ్'ల దారినుంచి తప్పించుకుని మరోమార్గం అవలంబించారు. మిగిలింది నిరాహారదీక్ష. ఇక్కడ యస్. యమ్. జోషీగారి సంగతి మరీ ఆశ్చర్యకరంగా వుంటుంది. నిరాహారదీక్ష అనేది చట్టసమ్మతమా? ప్రజాస్వామ్యాన్ని చితకొట్టడానికి ఉపయోగించే ఆయుధం ఇది. వీరికి మరో ఉద్యమంకూడా వుంది. భార్యల్ని, పిల్లల్నికూడా తీసుకువచ్చి ఆందోళన జరిపించడం.

సమ్మెదారుల్ని ప్రోత్సహిస్తూ యస్.యమ్.

జోషిగారూ ఒక ప్రకటన చేశారు. అక్టోబరు 15 న పెద్ద ఊరేగింపు; 16 న మూకుమ్మడి నిరాహారదీక్ష; 17 న ప్రధాన మంత్రిగారిని దర్శించడంవంటి కార్యక్రమాలు అమలు జరపబోతున్నట్టు సెలవిచ్చారు. విరామం దొరికినప్పుడల్లా 'ఇండియా గేట్' దరిదాపుల మూలమూలల ప్రాంతాల్లో సమావేశాలూ సమాలోచనలూ జరుగుతూనే వున్నాయి. ఎటువంటి అంక్షలూ లేకుండా మాకు లొంగిపోతారా లొంగిపొండి, లేదా అనుభవిస్తారు—అని ప్రభుత్వాన్ని బెదిరించడం ఈ సమ్మెలోని రహస్యం.

### సమ్మె వెనుక రహస్యం

'1961 వ సంవత్సరపు అపరాధుల కథ' అని ఒకటి రాసి వుంది. 1968 సంవత్సరం మరో కథకి సామాగ్రి తయారు చేస్తున్నది. ఈ సమ్మె విషయంలో కేంద్ర ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చివుంది. శ్రీమతి గాంధీగారి ఆమోదం లభించడమే తరువాయి. రాజకీయ సాహసికులని ప్రోత్సహిస్తారో, చట్టానికి తలవొగ్గుతారో, ధర్మానికి ఎదురు తిరుగుతారో ఇక ఆమె వంతు. జీవన ప్రమాణానికి సరిపోయిన జీతాలకుగాని, కరువుభత్యాన్ని జీతంతో కలపాలనికాని ఈ సమ్మె ఉద్దేశ్యంకాదు. కేంద్ర ఉద్యోగులకి ఎవరు ఆధిపత్యం వహిస్తున్నారు అనేది తేల్చుకోవడం. రాజకీయ వేత్తలా? లేక చట్టబద్ధమైన ప్రభుత్వమా? అనే ప్రశ్నలకి జవాబుకోసం ఈ సమ్మె. శ్రీమతి గాంధీ కలంతో ఇలా గీతగీస్తేచాలు తన ప్రభుత్వాన్ని అలా కూలదోసుకోగల్గుతారు. ప్రతిపక్షానికి గనక ఆమె విలువనిచ్చివుంటే క్రమశిక్షణా రాహిత్యాన్ని ప్రోత్సహించినట్టే. కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నది ఇందుకే. ఇది నీతిని చంపడమే కాదు, ఉద్యోగుల విధేయతని కూడా రూపుమాపుతుంది. ఇది శ్రీమతి గాంధీ చవాన్ల మధ్య ఉన్న వ్యవహారం గాదు తేలికగా కొట్టిపారెయ్యడానికి. శ్రీమతి గాంధీగారికి, భారతదేశంలో కాంగ్రెసు శత్రువులకి మధ్య నున్న వ్యవహారం!

ఒకసారి డా. గాడ్గిల్‌గారు మాస్కో వెళ్లినప్పుడు అక్కడి ఘనత వహించిన కొందరు 'సమ్మెలు జరుగుతుంటే మీ ప్రభుత్వం ఎలా సహిస్తూ వూరుకుంటుంది?' అని అడిగారట. మన ఆఫీసులన్నింటికీ కేంద్రసచివాలయం ఉక్కు చట్రం లాంటిది. సమ్మెలన్నీ ఇక్కడే ఉద్భవించడం విచిత్రం!

### తనదాకా వస్తేగాని....

ఇంద్రజిత్ గుప్తాగారు 'జీవన ప్రమాణంతో సరితూగిన భత్యాలు' అంటే ఏమిటో వివరించారు. యాభై ఏళ్ల క్రితం లెనిన్‌గారు రష్యాలో ఇలాంటి వాదాన్ని లేవదీశారు. ఇప్పుడు ఆ సంప్రదాయాన్ని శ్రీ గుప్తాగారు; వారి అనుచరులు నిలబెడుతున్నారు. ముఖ్యంగా కేంద్ర ప్రభుత్వోద్యోగులపై వారి దయని హర్షించి తీరాలి! జీవన ప్రమాణంతో తగిన భత్యాలు అంటే ఏమిటో వీరికి తెలియక పోదు. అది జరగనివని అని, ఆర్థిక పరంగా కూడనివని అనీ వారికి తెలుసు. ప్రభుత్వాన్ని ముంచి వేస్తుందని వారికి తెలుసు. కమ్యూనిస్టులుగాని జనసంఘీయులుగాని ప్రభుత్వాన్ని అలంకరిస్తే — ఇన్ని నీతులు చెబుతున్న వీరే ఆ పని చెయ్యలేరని కూడా వారికి తెలుసు!

అతి సాధువైన భారతదేశం తనలో క్రూరమైన శత్రువులున్నారని తెలిసీ భరిస్తున్నది. ఆదరిస్తున్నది. ఈ శత్రువులు తమ తమ పథకాల్లో జయం పొందుతారో, లేక ప్రజాస్వామ్యం వేళ్లు విస్తరించి కట్టుదిట్టమవుతుందో ఈ శుక్రవారంనాడు తెలుస్తుంది! ●



# మనసు

శివల జగన్నాధరావు

నూతిలోంచి చేదతో నీళ్ళు తోడి నెత్తి మీద వొంపుకొనబోతున్న చలపతి 'నాన్నా' అన్నపిలుపు వినిపించి వెనక్కి తిరిగాడు. కూతురు కమల ఉన్నదక్కడ.

'పూజకి అన్నీ సిద్ధంగా పెట్టాను. రండి నాన్నా,' అన్నదా అమ్మాయి.

'ఊఁ,'

కమల విసుక్కుంది. 'ఇలా వచ్చి చెప్పి మూడు సార్లయింది ఇప్పటికి. ఎన్నడూ లేనిది ఈ రోజు మీరింతసేపు స్నానం చెయ్యటం చూచి అమ్మ భయపడుతూంది. హెన్నైనా ఆ చేద అక్కడ పెట్టి స్తారా ?'

అత్యాశ్చర్యకరమైన విషయం వింటు న్నట్టు ముఖం పెట్టాడు చలపతి. తేరుకొని 'వస్తున్నానమ్మా వద వద' అంటూ హడా వుడిగా నూతిగట్టుమీద పెట్టిన తువాలు తీశాడు. హడావుడిగా తియ్యటంలో అది ఆ ప్రక్కనేఉన్న సబ్బుబిళ్ళకి తగిలి క్రిందపడింది. ఆ వల్చటి సబ్బుబిళ్ళవేపు చూస్తూ మరొకసారి ఆశ్చర్య పోయాడు చలపతి.

తను స్నానం చేసేముందునే కాగితం విప్పిన సబ్బు అది!

కృష్ణుడి గురించి ఆలోచిస్తూ దాన్ని ఎంతగా అరగదీశాడో తను!

ఈ రోజు తన మతి పోతూంది, వాడి గొడవలో పడి.

తనేమి అపకారం చేశాడని ఇలా బాధ పెడుతున్నాడు వాడు ?

చలపతి అంతరంగం చికాకు అయిపో యింది. ఏదో ఆవేదన—అసంతృప్తి—మన స్తాపంతో మనసు బరువెక్కింది. గట్టిగా నిట్టూర్చాడు, వెర్రివాడిలా ఆ సబ్బుబిళ్ళ కేసే చూస్తూండి పోయాడు, తదేకంగా. మరొకసారి ప్రశ్నించుకున్నాడు, కృష్ణుడు తనకింత మనస్తాపం కలిగిస్తున్నాడేమని.

తను చిన్నతనంనుంచీ వాడిని నెత్తిమీద పెట్టుకుంటున్నందుకా ఈ శిక్ష ? అదే తను చేసిన తప్పిదమయితే ఇంతకన్న తప్పిదం మరొకటున్నది. అస్తవ్యస్త పరి స్థితిలో ఉన్నవాడి కుటుంబాన్ని ఆదుకొని అభివృద్ధిలోకి తేవటం అది!... చలపతి అంతరంగం ఆవేశంతో ఊగిపోయింది.

ఆ ప్రశ్నను ఈ రోజు—ఈ క్షణం వరకు వేసుకోలేదు చలపతి.

ఆ ఆలోచన ఇప్పటివరకూ కలగలేదు చలపతికి. కాని —

ఈ రోజు ఆ ఆలోచనకు వచ్చినంత ఆవేశం తెచ్చిపెట్టాడు కృష్ణుడు.

గతాన్ని తలపుకి తెచ్చే ప్రశ్నకు నెమరు వేసుకొంటూ ఉండిపోయాడు, చలపతి. ఆ రోజు......

......చిక్కటి చీకటిని చీలుస్తూ ఆకాశంలో మెరుపు మెరిసింది. చీకటిలో గంపెడు సంసారాన్ని నడిపే సామాన్యుడిలా కృంగిపోతూ తపీగా వెళుతూన్న ఒంటెద్దు బండిలోంచి — మెరుపు వెలుగులో — దూరంగా కనిపిస్తున్న చిన్నపెంకుటింటిని చూచాడు చలపతి.

తెరిపి అన్నదివ్వకుండా, మూడు రోజుల్నించి ఆకాశాన్ని మూతవేసిన మబ్బుతెర... జిడజిడ పడుతూన్న వాన...

తోవ వెంబడి రొదపెట్టే కీచురాళ్ళ హోరు.........

తోవంతా బురద...రొచ్చు...వాసన...

వాతవరణంలాగే అస్తవ్యస్తంగా ఉన్న మనసుతో, ముడుచుకు కూర్చున్నాడు, బండిలో చలపతి. బండివెళ్ళి ఆ పెంకుటింటిముందు ఆగింది. ముందుగా తను దిగి వెళ్ళి తలుపు తట్టాడు. కొద్ది సేపట్లో తలుపు తెరిచింది ఒక వృద్ధురాలు. చేతిలో లాంతరువత్తి పెద్దది చేసి, చూపు ఆనడం కోసం కళ్ళకి ఓ చెయ్యి చాటు చేసుకు అడిగింది.

'ఎవరది, బాబూ?'

'నేనేనమ్మా చలపతిని.'

వృద్ధురాలి ముఖం విచ్చుకున్నది. రెప్పలు రెపరెపలాడించి, కొడుకుని క్రిందినుంచి మీదివరకూ ఒకసారి చూచి, ఆత్రుత, ఆరాటంతో ఏదో శంక తరుముకొస్తూంటే, వాటిని అణచడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ,

నువ్వే నా. ఎవరో అనుకున్నాను. వెళ్ళిన వాడివి ఇన్నాళ్ళుండి పోయావేం అక్కడ. లోపలికిరా. ఉత్తరమయినా రాశావు కావు. అక్కడేం జరిగిందోనని కంగారుపడి పోతున్నాను చూచేవా. గుమ్మంలోనే నిలబెట్టి మాట్లాడేస్తున్నాను...ఇలారా. బావకెలా ఉంది? నేను రాలేదని అమ్మడు బెంగపెట్టుకోలేదుగద...' అని గబగబా అడిగింది.

ఉధృతంగా వర్షిస్తున్న ఆ ప్రశ్నల వర్షంలో తలమునకలవుతున్న చలపతి రెండు చేతులతోనూ గుండెను పట్టుకొని, అపరాధిలా నుంచుండి పోయాడు, తలవంచుకొని. ముసలావిడలో అనుమానం చోటు చేసుకుంది. కొడుకుని ప్రక్కకు నెట్టి, వీధిలో ఇంకా ఆగిఉన్న బండికేసి చూచింది, నిశ్చలంగా.

బండిలోంచి సగం సగం చొప్పున దిగుతున్న మనిషిని చూచింది.

చూస్తూనే, గుర్తించింది గాజులులేని ఆ చేతుల్ని, మాంగల్యంలేని ఆ కంఠాన్ని, కుంకుమలేని ఆ నుదుటిని—పచ్చటి నుదుటిని—

గొల్లుమంది, 'అయ్యో, అమ్మడూ!' అంటూ.

'నీ పసుపు కుంకుమల్ని ఎవరెత్తుకు పోయారే, అమ్మడూ!

'నీకు రావల్సిన కష్టం కాదే ఇది......

'ఈ దురవస్థని చూడటానికటే దేవుడు అప్పుడే మీ నాన్న వెనుక నన్నూ తీసుకు పోయాడు కాదు...'

అమ్మ ఏడుపుతో కూతురి కడుపులో శోకం కట్టలు తెంచుకు వెలికి వచ్చింది. ఆడవాళ్ళని ఓదార్చటం చలపతి వశం కాలేదు. వాళ్ళ నెట్లాగో లోపలికి పంపి, బండివాడికి డబ్బులిచ్చి, బండిలో నిశ్చింతగా పడుకున్న నాలుగేళ్ళ కృష్ణుణ్ణి ఎత్తుకుని ఇంట్లోకి నడిచాడు

ఆ రాత్రి పడకలు లేవు పెద్దవాళ్ళకి. అల్లుడు పోయాడన్న దుఃఖంలో మతిపోయిన తల్లి వూరు కాని వూరునుంచి వచ్చినవాళ్ళకి కాఫీ నీళ్లైనా కాచి ఇద్దామన్న ఆలోచన రాక ఉండిపోయింది. చాపమీద నడుం వాల్చిన చలపతి జరిగినదంతా సమీక్షించుకుంటూ ఉండిపోయాడు. బావకి మలేరియా సోకిందని ఉత్తరం రావటం — కట్టుబట్టలతో తను గాభరాగా రైలెక్కటం - వెళ్లిన వారంరోజుల్లో బావ మృత్యువువాత పడటం—ఇంత చిన్న వయసులో చెల్లాయిని వైధవ్యం ఆవరించినందుకు దాని దురదృష్టానికి కించపడుతూ, కర్మకాండ జరిపి, నాలుగేళ్ల కొడుకు తప్ప ఏ ఆధారమూ లేని ఆమెని తనవెంట తీసుకు వచ్చేయటమూ, చెమ్మగిలిన కమళ్ళి వొత్తుకొని, ఆ క్షణం ఆ తల్లీ బిడ్డల బాధ్యత స్వీకరించాడు.

నాలుగేళ్ల కృష్ణుడు ఇరవై నాలుగేళ్ల వాడయ్యాడు.

తన కాళ్ళమీద తను నిలబడ గలిగిన ప్రయోజకుడయ్యాడు.

ఈ ఇరవయ్యేళ్లలో జరిగిన కొన్ని ముఖ్య సంఘటనల్లో తల్లి పోవటం ఒకటి. కృష్ణుడు ఉద్యోగం నిమిత్తం తనకి కొన్ని వందల మైళ్ళదూరం ఎడం అవుతున్నపుడు—ఆరోజు చెల్లాయి వాడిచేత తనకు పాదాభివందనం చేయించి నప్పుడు వాడన్న మాటలు మరిచిపోలేదు.

'నీ పెంపకంలో నాన్నని మరపించావు. నీ అండే లేకపోతే మేము ఎక్కడ ఉండే వాళ్లమో వూహించటానిక్కూడా భయం కలుగుతుంది. ఇన్నేళ్ళు విచ్చలవిడిగా పెరిగిన నేనీ పరిసరాలనూ, మిమ్మల్నీ విడిచి వెళ్లాలంటే మనసేమిటోగా ఉన్నది మామయ్యా. ఏంచెయ్యను. ఈ దగ్గర్లో ఎంత ప్రయత్నించినా మంచి ఉద్యోగం దొరకలేదు'

ఈ మాటలని కళ్ళనీరు పెట్టుకున్నాడు కృష్ణుడు!

ఉద్యోగంకోసం తనని వదిలి వెళ్ళడానికి విలవిలలాడిన కృష్ణుడు —పండగ వచ్చినా, ఇంట్లో ఏ వేడుక జరిగినా అంతదూరం నుంచి ఆఘమేఘాలమీద వచ్చేసే కృష్ణుడు —మొన్న మొన్నటి వరకు తన పంచప్రాణాల్లో ఒకప్రాణంగా మెలిగిన కృష్ణుడు, ఉన్నట్టుండి ఇలా మారిపోయాడంటే ఏమనుకోవాలి తను ?

ఎవరు వాడిని తనకు కాకుండా చేస్తున్నారు?

ఎవరి దుర్బోధల ఫలితంగా వాడిలా మారిపోయాడు?......

'ఏమండీ?'

చలపతి ఉలిక్కిపడి చూచాడు. ఎదురుగా ఉన్న భార్య మసక మసగ్గా కనిపించింది. తను ఇంతసేపూ నూతి దగ్గరే నుంచుండిపోయాడని తెలుసుకుని, తువాలుతో ఒళ్ళు తుడుచుకోబోయి, ఒళ్లెప్పుడో ఆరిపోయిందని తెలుసుకుని గబగబా లోపలికి వెళ్ళాడు. పొత్తిపంచె కట్టుకుని, నుదుట విభూతి పెట్టుకుని దర్భాసనం మీద కూర్చున్నాడు.

నేత్రాలలో తేజస్సును వెదజల్లుతూ, చిరునవ్వు చిందిస్తున్నాడు పటంలో విష్ణు

# మనసు

మూర్తి. చేతులు జోడించిన చలపతి మనసులో కృష్ణుడు మెదిలాడు.

కృష్ణుడు కొలిచినంత చిత్తశుద్ధితో దేవుడిని కొలవరెవరూను. వాడికి ఉన్న ఏకాగ్రత ఇంత వయసు వచ్చిన తనకే లేదు! భక్తీ, జ్ఞానమూ, తెలివీ వాడికి పెట్టని అలంకారాలు! ఒకసారి — అంటే పదేళ్ల వయసులో తన తమ్ముడు సూర్యంతో కలిసి కృష్ణుడు శివకోవెలకి వెళ్లాడు. ఆ రోజు ఏకాదశి. కోవెలలోకి వెళుతూనే కృష్ణుడు, 'నువు తొడుక్కున్నవి ఇస్త్రీ బట్టలా' అని సూర్యం గోలపెడుతున్నప్పటికీ వినిపించుకోక అమాంతం సాష్టాంగపడిపోయి లింగాన్ని కావిలించుకున్నాడు! పత్రులూ, కొబ్బరి నీళ్లతో ఖరాబయిన బట్టల్తో ఇంటికి వచ్చిన వాడిని చూచి నాన్నగారు అడిగితే చెప్పింది ఇదీ! తనేమిటో పరిసరాలేమిటో లక్ష్యపెట్టనీయనిదే నిశ్చలమైన భక్తని చెప్పాడు వాడు!

అంతటి జ్ఞానం ఉన్న వాడు ఛవాళిలా అవివేకంగా ప్రవర్తిస్తున్నాడంటే మితిమీరిన విస్మయంలో తనకి మతిపోక ఏమవుతుంది?

గాజుల చప్పుడు వినిపించి తల తిప్పాడు చలపతి.

'నైవేద్యానికి అరటిపండు తీసుకు వచ్చాను నాన్నా. అదేమిటీ భుజం మీది గుడ్డ కిందపడి వుందీ. పూజింకా అవ్వలేదా. బాగుంది' అంది కమల నవ్వుతూ.

'నైవేద్యం వేళయిందా!' అన్నాడు చలపతి.

'మీరిలా కూర్చుంటే రాత్రి భోజనాల వేళ కూడా అయిపోతుంది. బావ పెళ్లి కాదు గాని మీరు మనలో లేరు. ఏమిటి చేస్తున్నారో మీకే తెలియనంత మరుపులో పెట్టేశాడు బావ...'

'కమలా!' అనరిచాడు చలపతి. అతని కళ్లు ఎర్రబడ్డాయి.

'వాడి వూసు ఎత్తకు నాముందివాళ.'

కమల బెదురుగా చూసి అరటిపండు అక్కడ ఉంచి వెళ్లిపోయింది.

నోట్లో పచ్చి మంచినీళ్లయినా పోసుకోకుండా దేవుడి ముందు కూర్చున్నప్పటికీ ఏకాగ్రత కుదరటం లేదని చలపతి విసుక్కున్నాడు.

ఉద్ధరిణెతో నీళ్లు తీసుకుని ఆచమనం చేశాడు.

'కేశవ — నారాయణ — మాధవ — గోవింద — విష్ణు —'

అయిదవనామం చెబుతూంటే చలపతి మనసు మరోకసారి అదుపు తప్పింది. 'విష్ణుమూర్తి వచ్చినా సరే తననేమీ చెయ్యలేడు. తనలో తప్పుంటే దేవుడికైనా ఎవరికైనా వెరవాలి. కృష్ణుడు ఎంత భక్తుడైనా, వాడి గురించి చెడుగా తలిచినవారికి పాపం అంటేంత మహత్తు వాడిలో ఉన్నా — ఈరోజు వాడిని విమర్శించటానికి తనకు హక్కు ఉంది. మొన్న బజార్లో మిత్రుడు సత్యమూర్తి కనిపించి 'ఏమండోయ్! చెప్పేరు కారు మీ మేనల్లుడి పెళ్లని' అన్నాడు.

'ఏమిటంటున్నారు!?' అన్నాడు తను విస్తుబోయి. మూర్తి ఏదో హాస్యమాడుతున్నాడనిపించింది. కాకపోతే తనకి చెప్పకుండా పెళ్లిచేసుకునే ఆ మేనల్లుడెవడు?'

మూర్తి గుర్రుగా చూస్తూ 'ఎంత గడుసువాళ్లండీ. ఇలా మేనల్లుడి పెళ్లని చెబితే వెంటపడతాముటండీ' అన్నాడు. తనకి చిర్రెత్తుకొచ్చింది.

'మీరేమంటున్నారో నాకు నిజంగా బోధపట్టంలేదు మూర్తిగారూ. పెళ్లికబురు చెప్పారు గనుక ఆ మిగతా భోగట్టాకూడా మీరే చెప్పేయండి వింటాను'

మూర్తి ముఖం ముడుచుకున్నాడు. మీ కృష్ణుడి పెళ్లి విషయం మీ వరకూ రాదని నేనెలా అనుకుంటానండీ. నాకుమాత్రం మా రెండో అబ్బాయి సుగుణాకరంవల్ల తెలిసింది. ఈమధ్య నార్తిండియా టూర్‌కి వెళ్లిన సుగుణాకరానికి కాశీలో మీ కృష్ణారావు కనిపించి ఇలా తను ఫలానా తేదీన మారేజి చేసుకోబోతున్నట్టు చెప్పాట్ట.'

తను విస్మయంలో కొట్టుకులాడుతూ 'ఇంకేం చెప్పాడు?' అనడిగాడు.

మూర్తి గబగబా ముందుకివచ్చి చెవిలో నోరుంచి, స్వరం తగ్గించి గొణిగాడు: 'ఈ విషయం మీ చెల్లెమ్మగారికి తెలుసునో, లేదో కాని ఆ పిల్ల మనశాఖ, మన కులం కాదట. ఇదికూడా మీ కృష్ణుడే చెప్పాడు.'

'మీకు తెలిసినభోగట్టా ఇదేనా?'

'ఇదే.'

తన అరికాళ్లకింద మంటలు పెడుతూన్నట్టవుతూంటే అక్కడ నిల్చోలేకపోయాడు. కూరలు కొనలేదన్న సంగతి ఇంటికివచ్చి పడ్డాక ఖాళీసంచీ చూస్తే తెలిసింది.

అయిపోయింది. కృష్ణుడి తెలివీ, భక్తీ, ఆధిక్యతా అన్ని సుగుణాలూ బూడిదలో పోసిన పన్నీటి చందంగా మారే సమయం వచ్చేసింది. ఎవతో ఆ మాయలమారి. తన కృష్ణుణ్ని వలలో వేసుకుంది. వాడి బుద్ధి పెడతల పట్టించింది. ఇహ వాడెవడికీ పనికిరాడు. యౌవనం మనిషికెంత ఆకర్షణీయమో అంత అపకారంకూడా చేస్తుందేమో అనిపిస్తుంది.

కాకపోతే — కృష్ణుడిలాటి సత్పురుషునిలో



మగుణాలన్నీ ఇవాళ ఏమయినట్టు? కులం గాని కులంలో కలవబోవటం ఒక తప్పు. ఒకపని...అనీ తన జీవితానికి సంబంధించి వది తలబెట్టినపుడు ముందు వెనుకలు ఆలోచించే పెద్దవాళ్ళతో సంప్రదించక పోవటం ఒకతప్పు.

అదే...అదే తన నిప్పుడు బాధిస్తున్నది.

మాట మాత్రంగానైనా అడిగితే, తను ఔనందుడో, కాదందుడో, ఏదీ తెలియ జేయకపోయె! పైగా ఈ వూళ్ళోనే ఉన్న, తనకి బాగా పరిచితుడైన సత్య మూర్తిగా రబ్బాయితో కలిసి చెబుతాడా?!

చలపతి చికాగ్గా పీటమీంచి లేచి పోయాడు. కడుపులో పేగులు అవురావు రంటున్నాయి. గోడ గడియారంలో టైము తొమ్మిది దాటుతూంది! వంటగదిలోకి వెళ్ళగానే భార్య అడిగింది. 'లెమిలేరా ఇప్పటికైనా? కాఫీ వెచ్చబెట్టనా?'

'ఏమి లెమలటమో! ఇవాళ పూజ సాగలేదు, సరస్వతీ. మనసు ఒక్క పిసరు కుదురు లేందే ఎలా సాగుతుంది చెప్పు?.

"ఎలా వుంటుంది కుదురు. పైకి ఇలా ఉన్నానేకాని మీకంటే ఎక్కువగా బాధ పడుతున్నాను నేనే. లక్షపుస్తకాల్లో చదువు తున్నాం. లక్షకబుర్లు వింటున్నాం. ఇలాటి పెళ్ళిళ్ళు కొత్త కాకపోయినా—మన పిల్లడు చేశాడంటే ఏమిటో మనసు కలుక్కు మంటూంది.'

వెచ్చబెట్టిన కాఫీ గ్లాసులో పోసి చలపతి కందించింది ఆవిడ. రెండు గుక్కల్లో గ్లాసెడు కాఫీ తాగేసి అక్కణ్ణుంచి లేచాడు చలపతి. వీధిలో బ్యాండుమేళం వినిపించింది. ఎవరా అనుకొంటుండగానే ఇద్దరు ఆడ వాళ్ళు పట్టుచీరెలు బరబరలాడించు కొంటూ ఇంట్లోకి వచ్చారు. వారి వెనుకనే ఒక ముసలాయన.

భార్యనీ, కూతుర్నీ పిలిచాడు చలపతి.

ఆ సందడి తగ్గి, వాళ్ళు వెళ్ళగానే ముసలాయన తన చేతిలో పెట్టిన శుభలేఖ చదువుతూ అరుగుమీదికి వెళ్ళి కూర్చు న్నాడు.

రామనాథం కొడుక్కి ఎల్లుండి ఉప నయనంరట! కుటుంబమంతా తప్పక భోజ నాలకు రావల్సిందిగా పిలవ వచ్చాడు! రామ నాథం ఎవరు?

తను సర్వీసులో ఉన్నప్పుడు తన సహ ఉద్యోగి.

అతడికీ తనకీ ఉన్న అనుబంధం?,

ఆఫీసులో ఆరుగంటలకాలం.

ఈ స్వల్ప పరిచయాన్ని పురస్కరించు కొని రామనాథం తన కొడుక్కి ఉపనయన మంటూ తమని ఆహ్వానించ వచ్చాడు.

తనరక్తం పంచుకు పుట్టిన చెల్లెలు కొడుకు, మొన్నటివరకూ తన ఆలనాపాలనలో పెరిగినవాడు, ఈ రోజు విచక్షణారహితమైన పనిచేస్తూ, ఆ కబురుకూడా తనకందకుండా జాగ్రత్తపడుతున్నాడు. ఈ మామయ్య గుర్తుకు వచ్చాడుకాడేమో మరి!

రామనాథానికీ, కృష్ణుడికీ ఎంత తేడా!

చలపతి వీధిలోకి తదేకంగా చూస్తూ కూర్చున్నాడు. ఎండ అరుగులో మూడు వంతులమేర ఆక్రమించేసుకొంది. ఎక్కడా చెట్ల ఆకులు కదలటం లేదు. చలపతి

# మనసు

'ఉస్సు' అంటూ చెమట ఒత్తుకొని, నీడలోకి జరిగాడు.

అతని చెవుల్లో ఇందాకటి బాజాలు ఇంకా మోగుతూనే ఉన్నాయి.

కనులముందు పెళ్ళిపందిరి వెలిసింది. పందిట్లో పీటలమీద కృష్ణుడూ, అతని వధువూ. పెళ్ళి కళ కృష్ణుడి ముఖంలో స్పష్టమవుతున్నది. ఎవరెవరితోనో పందిరి నిండిపోయింది. పురోహితుడి కంఠం కంచు గంటలా మ్రోగుతోంది. పట్టుబట్టల రెపరెపల మధ్య, సన్నాయి మేళం మధుర నాదాల నడుమ, అగ్నిహోత్రం పొగలకు ఉక్కిరి బిక్కిరవుతూ, పురోహితుడి హెచ్చరికతో, ఒక ముత్తైదువ అందించిన మాంగల్యాన్ని పట్టుకొని పీటమీంచి లేచాడు కృష్ణుడు.

దృశ్యం చెదిరిపోయింది.

చలపతి మనసు ఆవేదనతో నిండిపోయింది.

తనకు కావాల్సిన, తను చూడదగ్గ దృశ్యం అది! తను ఆశించిన కార్యం అది! అయితే జరుగుతున్నదేమిటి?

వయసు ప్రలోభంలోపడి అయిన వాళ్ళందరితో సంబంధం తెంపు చేసుకొంటూ, బాహాటంగా శాస్త్రోక్తంగా జరుపుకోవాల్సిన వివాహాన్ని రహస్యంగా ముక్తసరిగా జరుపుకొంటున్నాడు.

ఎంత పని చేశావురా, కృష్ణా!

ఈ ముహూర్తం కోసం, నీ శ్రేయస్సు కోసే వాడినిగా నీ తలమీద రెండు అక్షతలు వేసే శుభవేళకోసం నేనెన్నాళ్ళుగా ఉవ్విళ్ళూరుతున్నానో నీకేం తెలుసు? నా ముచ్చటని తీర్చుకోనిచ్చావు కావు. మీ అమ్మ మాత్రం ఇట్లా తలవదా యేం. పాపం, అదెంత బాధపడుతూందో అక్కడ!'

ఇంట్లోంచి భోజనానికి రమ్మని పిలుపు వచ్చింది. ఆ పాటికి ఎండకూడా అరుగంతా ఆక్రమించేసుకొంది. చలపతి తిట్టుకొంటూ లేచి లోపలికి నడిచాడు.

సాయంత్రం తండ్రి వీధిలో పోస్టు జవానుని 'మాకేమైనా ఉత్తరాలున్నాయటోయ్' అని అడగటం విన్న కమల నవ్వుకొంది. తలవంచుకొని ఉత్తచేతులూపుకొంటూ లోనికి వచ్చిన తండ్రిని చూచి ఆ పిల్ల మనసు చివుక్కుమంది. తనకంటె పదేళ్ళు పెద్దవాడైన బావని నిందించాలో తండ్రి స్థితికి జాలిచెందాలో ఆ పిల్లకు తెలియలేదు.

ఆ మర్నాడు మూడోనాడు కూడా చలపతి పోస్టుజవాను కోసం నిరీక్షిస్తూ, ఉత్తరాలడిగి లేవనిపించుకున్నాడు.

'మీకేమైనా పిచ్చా, వెర్రా? కృష్ణుడింకా మనలోనే ఉన్నాడనుకొంటున్నారా, ఉత్తరాలు రాయడానికి. వాడిప్పుడు వలపు మత్తులో ఉన్నాడు. ఆ మత్తు దిగితే కాని అయిన వాళ్ళం ఎవరం జ్ఞప్తికి రాము. ఇహ వాడి ధ్యాస మరిచిపోండి కొంతకాలం పాటు' అంది సరస్వతి.

'ప్రయత్నిస్తాను మరిచిపోవటానికి' గొణుక్కున్నాడు చలపతి.

నాలుగవనాడు మధ్యాహ్నం భోజనాలయ్యాక చలపతి కునుకు తీస్తున్నాడు. సరస్వతి వంటగది శుభ్రం చేసుకు వచ్చి విసనకర్ర తెచ్చుకొని నేలన నడుం వాల్చింది. వీధిలో ఎండ తేరి చూడ శక్యం కాకుండా ఉంది. వేడిగాలి ఉండుండి వస్తూంది. కమల క్లాసు పుస్తకమేదో చదువుకొంటున్నది. వీధి తలుపు చప్పుడయితే లేచి వెళ్ళి తలుపు తీసింది. అంతే. చేతిలో పుస్తకం వో మూలకి గిరవాటు వేసి ఒక్క ఉదుటున తండ్రి గదిలోకి పరుగెత్తింది 'నాన్నా. బావా వాళ్ళూ వచ్చారు. లెండి.'

కమల కేకతో చలపతి దిగ్గున లేచి కూర్చున్నాడు. 'ఏమంటున్నావే. బావ వచ్చాడనా. నాకు తెలుసే. వాడు వస్తాడని' అంటుంటే అతని గొంతు వణికింది. మంచం దిగి పంచె సర్దుకొని త్వరత్వరగా సావిట్లోకి వెళ్ళబోతుంటే మేనల్లుడు వచ్చి అతని చేతులు పట్టుకున్నాడు.

'ఏమిట్రా ఇది. వదులు' అన్నాడు చలపతి ముందుకి చూస్తూ. చెల్లెలు, ఆ వెనకనే అప్సరసలా ఉన్న అమ్మాయొకతె లోనికి వస్తున్నారు!

'మామయ్యకి పాదాభివందనం చెయ్యి మాలతి' అని అమ్మాయిని హెచ్చరించి, 'నీకు తెలియజెయ్యనందుకు క్షమించు మామయ్యా. ఉత్తరం ద్వారా తెలపటం కంటె ఆశీర్వచనాలందుకోటానికి నీవద్దకు రావటమే సముచితంగా ఉంటుందనుకొన్నాను...' అంటూ ఆ అమ్మాయితో

కలిసి మేనమామ పాదాలకు నమస్కరించాడు కృష్ణుడు.

అక్కడే ఉన్న చెల్లెలు అందుకొంది. 'అసలు సంగతది కాదులే. స్వంత నిర్ణయంతో చేసినది నీకు తెలియజెయ్యటానికి సాహసించలేక పోయాడు. అసలు నాకు చెప్పటానికే నాలుగురోజులు కిందుమీదయ్యాడు. ఇటువంటి విషయాల్లో ఏం చెబుతాం. చిన్న పిల్లలేం కారు. వాళ్ల తల్లిదండ్రులే వచ్చి చెబితే కాని నాకీ సంగతి తెలిసింది కాదు.'

'అర్థమయింది. ఇప్పటికిక ఆ ప్రస్తావన తేకు' అన్నట్టు చెల్లెలికి సౌజ్ఞచేసి, మేనల్లుడిని లేవ నెత్తాడు చలపతి. భార్యని పిలిచి 'త్వరగా ఇన్ని అక్షతలు కలిపి తీసుకురా!' అని చెప్పాడు. అక్షతలు ఆ వధూవరులపై చల్లుతూంటే చలపతి మనసు ప్రఫుల్లమయింది.

తరవాత కొడుకు అక్కడ లేకుండా చూచి చలపతితో చెల్లెలిట్లా చెప్పింది. 'ఈ కబురు చెవిన పడగానే నువ్వేమనుకుంటావో నేను వూహించాను. నాకూ ఈ ఈ పెళ్లి ఇష్టం లేదనుకో. ఏం చెయ్యను? రెండ్రోజులు వాడూ నేనూ కీచులాడుకున్నాం. తను మనసు పడిన ఈ పిల్లను కాక మరి ఏ పిల్లనైనా తన జీవితంలోకి తెచ్చుకునే పక్షంలో తన జీవితం దుర్భరమయి పోతుందని, అట్లా తను జీవితాంతం నరకం అనుభవించటం ఇష్టంగా ఉంటే ఈ పెళ్లివద్దని శాసించు—అని తన తుది నిర్ణయం బైటపెట్టాడు. ఎట్లాంటి పరిస్థితిలో నన్నిరికించాడో చూచావా. తల్లి తన కొడుకు జీవితం నరకసదృశంకావాలని ఎప్పుడైనా తలుస్తుందట్రా, అన్నాయ్.' చివరిమాటతో ఆవిడ గొంతు జీరబోయింది.

నిట్టూర్చాడు చలపతి. 'అదేమిటో గాని ఈ మనసన్నదుందే అది చాలా విపరీతంగా ప్రవర్తిస్తుంది ఒక్కోసారి. సర్వేంద్రియాల్నీ తన గుప్పెటలో పెట్టుకొని, మనిషిని కీలుబొమ్మలా ఆడిస్తుంది. నీ సంగతంటావు కాని నాలుగురోజులు నేనెంత క్రిందుమీదయ్యాను ?! కష్టం వచ్చినా తట్టుకోలేము. సుఖంవచ్చినా తట్టుకోలేము. కోరికల్ని మొదలే అరికట్టలేము. కృష్ణుడు చాలామంది కుర్రాళ్లకంటె గుణవంతుడే కాని, వాడూ మనిషే! వాడిని తప్పు పట డానికి లేదు. ఆ నిర్ణయం చేసిన వాడి మనసుదా తప్పు.

'ఒక విధంగా నువు తెలివైన పనే చేశావను కొంటున్నాను. మొండివైఖరి అవలంబించి, కట్టడి చేసి, వాడి జీవితాన్ని అయోమయం చేసి ఆ తరవాత వాడితో పాటు నువ్వూ క్రిందుమీదయ్యేకంటె ఇది చాలా మంచిపని. ఇహ మన మనసు అంటావా కాలంతోబాటు మారక తప్పదు.'

ఆ రాత్రి తమ ఇంటిలో జరుపబోయే విందుకి నలుగుర్నీ పిలవటానికి చలపతి కూతురితో బయలుదేరాడు. ●

(విశాఖ రచయితల సభలో చదివిన కథ)

# ర చ న

## 'మదరాసు తెలుగు రచయితల సమితి'

అక్టోబరు 12వ తేదీన మద్రాసులోని తెలుగు రచయితలు పలువురు బి. యస్. ఆర్. కృష్ణగారి ఇంట్లో సమావేశమై 'రచన' అనేపేరుతో 'మదరాసు తెలుగు రచయితల సమితి'ని ఏర్పాటు చేసుకున్నారు. ఆహ్వానితులకు శ్రీ బి. యస్. ఆర్. కృష్ణ అల్పాహార విందు చేశారు.

సమావేశంలో శ్రీమతులు ద్వివేదుల విశాలాక్షి, రామలక్ష్మి ఆరుద్ర, మాలతీచందూర్, యస్. వి. రమణమ్మ, శ్రీయుతులు విద్వాన్ విశ్వం, పిలకాగణపతి శాస్త్రి, ముళ్ళపూడి వెంకటరమణ, టి. వి. రంగాచార్యులు, బాపు, డి. యస్. రావు, వేదవ్యాస్, అరిగపూడి రమేష్ చౌదరి, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, శార్వరి, ఇచ్ఛాచంద్, పి. గంగాధరరావు, ఎ. రామకృష్ణ, యస్. ఆర్. చందూర్ ప్రభృతులు దాదాపు నలభై మంది రచయితలు పాల్గొన్నారు.

ప్రతినెలా రెండవ ఆదివారం సమితి సమావేశాలు జరుగుతాయి. ఈ సమావేశంలో ఒక ప్రధాన ఉపన్యాసము—దానిమీద చర్చతోపాటు స్వీయకవితా గానం, కథానికా పఠనం ఆదిగాగల అంశాలతో వివిధ కార్యక్రమాలు 'సమితి' ఆధ్వర్యంలో నిర్వహిస్తూ ఉంటారు.

ప్రారంభంలో శ్రీ సి. కనకాంబరరాజు సమావేశ ఉద్దేశాన్ని తెలియపరిచారు. ఈ కొత్త సమితికి సభ్యత్వరుసుము వంటి లాంఛనాలు లేకుండా [illegible] ఇష్టాగోష్ఠి రూపంలో కార్యకలాపాల కొనసాగించాలని, రచయితలేకాక సాహిత్యాభిమానులు కూడా సమావేశాల్లో పాల్గొనవచ్చునని శ్రీ బి. యస్. ఆర్. కృష్ణ వివరించారు.

శ్రీ పిలకా గణపతిశాస్త్రి ప్రతిపాదనపై శ్రీ బి. యస్. ఆర్. కృష్ణ కన్వీనరుగా వుండడానికి అంగీకరించారు.

నగరంలో వున్న రచయితలు, సాహిత్యాభిమానులు వారివారి పూర్తి చిరునామాలు 19, శ్రీనివాసరావు స్ట్రీట్, మద్రాసు—4కి తెలియపరచవలసిందిగా కన్వీనరు శ్రీ బి. యస్. ఆర్. కృష్ణ విజ్ఞప్తి చేస్తున్నారు.

(ఒ. వి.)

## పుస్తక సమీక్షపోటీ

ఆంధ్ర పాఠకులలో పుస్తకాలు చదివే అలవాటు అభివృద్ధి చేయడానికి ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారు కొత్త పథకాన్నొకదాన్ని రూపొందించారు. వారు క్రిందటి సంవత్సరం ప్రారంభించి సెప్టెంబర్ 1 వ తేదీతో పూర్తిచేసిన మొదటి 50 పుస్తకాలలో ఒకదానిని గురించికానీ అంతకి ఎక్కువ పుస్తకాలని గురించిగానీ సంగ్రహంగా, సహృదయంతో, నిష్పక్షిక విమర్శ రాసిన వారికి 18 బహుమతులు యివ్వడానికి నిశ్చయించారు. బహుమతులు పుస్తకాల రూపంలో రు. 10 ల నుంచి రు. 200 ల దాకా ఉంటాయి. బహుమతి పొందిన, సమీక్షలు ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో ప్రకటించే ఏర్పాటుచేశారు. పోటీ గడువు తేదీ అక్టోబర్ 10, 1968. ఇతర వివరాలు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్‌కి రాసి పొంద వచ్చు.

## బక్సారా ఆంధ్ర సంఘము

బక్సారా ఆంధ్ర సంఘము, ప్రతియేడులాగానే యీ సంవత్సరము కూడా శ్రీ గణేశ్ పూజా మహోత్సవాలు మూడు రోజులపాటు జరుపుకుంది. మూడు రోజులపాటు జరిగిన కార్యక్రమాలు, స్థానిక ప్రజల మన్ననలను పొంది, వినోదోత్సాహాలు కలిగించాయి. చివరిరోజున బాండు వాయిద్యాలతో వినాయకుని విగ్రహాన్ని వూరేగించి జలప్రవేశము జరుపబడింది. (ఒ. వి.)

## తెలుగు నాటక సమితి

తెలుగు నాటక సమితి, ఎ. జి. ఆఫీసు, హైదరాబాదు నిర్వహించిన తృతీయ అంతర్విభాగ నాటికల పోటీలు రవీంద్ర భారతిలో జరిగాయి. పోటీలకు శ్రీ అమర్‌నాథ్ ప్రారంభోత్సవం చేశారు. అమాత్యులు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ముఖ్య అతిథిగా విచ్చేశారు. శ్రీ టి. రంగాచారి అధ్యక్షత వహించారు. కార్యక్రమం విజయవంతంగా ముగిసింది.

## వర్ధంతి

సంఘ సంస్కర్త శ్రీ ఆవుల గోపాల కృష్ణమూర్తి ద్వితీయ వర్ధంతి తెనాలి శ్రీ కన్యకా పరమేశ్వరీ కల్యాణ మంటపం హాలులో గుంటూరు జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ మేడూరి నాగేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని ఎ. జి. కె. సూక్తులు గ్రంధావిష్కరణ జరిగింది. సాలిపేటలోని ఎ. జి. కె. నర్సింగ్ హోమ్‌ను డా. సి. క్రిష్ణయ్యగారు ఆవిష్కరించారు. డా. టి. వెంకటేశ్వరరావు ఎ. జి. కె. చిత్రాన్ని ఆవిష్కరించారు. డా. కె. సదాశివరావు అధ్యక్షత వహించారు.

(ఒ. వి.)



విజయనాడలో గాంధీపర్వతముపై మహాత్ముని స్మారక చిహ్నంగా నిర్మించిన స్థూపాన్ని ఇటీవల రాష్ట్రపతి ఆవిష్కరించారు. ఆ సందర్భములో జరిగిన సభా వేదికపై ఉన్న కేంద్ర మంత్రి డా॥ కె. ఎల్. రావు, కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప, రాష్ట్రపతి డా॥ జాకిర్ హుస్సేన్, రాష్ట్ర గవర్నర్ శ్రీ ఖండుభాయ్ దేశాయ్, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగార్లని చిత్రంలో చూడవచ్చు. (ఫొటో: ఎం. ఎ. మోహనరావు)



క్షేమేంద్రుని
బృహత్కథామంజరి కథలు
అనువాదం: తిరుమల రామచంద్ర

విజయయాత్రకు తరలిన సూర్యప్రభ మహారాజుకు సహాయంగా వున్న సునీథుడు మయ దానవుడు చెప్పినరీతిగా మొదట హిమాలయ పార్శ్వ ప్రాంతాలు చేరాడు. అక్కడ అతనికి సుమేరుడు అనే విద్యాధరరాజు మిత్రుడయ్యాడు. ఈశ్వరుని తేజస్సే ఆకారం పొందినట్లున్న సువాసనుడు, అనే తన కుమారుడు కూడా సూర్యప్రభునికి యుద్ధంలో తోడు అయ్యాడు. ఇలా నరులు, ఖేచరులు, ఏనుగులు, గుర్రాలు, రథాలు అసంఖ్యాకంగా చేరగా, సూర్యప్రభ మహారాజు స్కంధావారం ఎనభై యోజనాల మేర విస్తరించింది.

సూర్యప్రభుడు తరలి వెళ్లి, వల్మీక మనే దివ్యదేశం చేరాడు. అక్కడ అతనికి వికారమైన అజగరాకారంలో మరుగైవున్న అంబుల పొది దొరికింది. అది అర్జునుని అక్షయతూణీరం వంటిది. అతనికి అక్కడ అలాటిదే దివ్యమైన ధనుస్సు, దివ్య విమానం, మహాపద్మం, ఏడు ఉజ్జ్వలమయిన ఓషధులు లభించాయి. ఇవి ఒక గుహలో వెలిగిపోతూ వుండగా రాజు తెలుసుకొని సంపాదించాడు. వీటిలో మృత సంజీవని మొదలయిన అపూర్వౌషధులు వున్నాయి.

సూర్యప్రభుడు ఆ దివ్యప్రాంతంలో సైన్యంతో విడిసి వుండగా, శ్రుతశర్మ గూడా యుద్ధానికి సిద్ధంగా వున్నట్లు వేగుల వారివలన తెలిసింది. యుద్ధానికి బయలుదేరాడు. రణ దుందుభులు దిక్కులు పిక్కటిల్లేట్టుగా మ్రోగాయి. వాటికి తోడు సైన్యంలోని ఏనుగుల పిండు మెడలోని ఘంటలు గంభీరంగా నినదించాయి. ఈ రెండు మ్రోతలకు దిక్కు తోచక సైన్యాలు నెమ్మదిగా నడువ సాగినాయి.

అప్పుడు సువాసనుడు విద్యాధరులతో పాటు సూర్యప్రభుని వద్దకు వచ్చాడు. "మహారాజా, ఇది ఘోరమైన దేవాసురుల యుద్ధం. యుద్ధోత్సాహంతో ఉత్తుల్లి పడుతున్న మా వీరులను సిద్ధంగా ఉండనీండి. పూర్వం అమృత సంపాదన లోభంతో దేవాసురులు క్షీరసముద్రాన్ని మథించారు. ఆ మథనంలో లక్ష్మి, చంద్రుడు, కౌస్తుభం లభించాయి. అమృతాన్ని తామే పొందుదామనే లోభం దేవతలకు కలిగింది. అప్పుడు దైత్యులకు వారితో వైరం ఏర్పడింది. దేవతలేమో మాయోపాయాలు తెలిసినవారు. దైత్యులు కూట యుద్ధాలలో ఆరితేరినవారు. అందువలన ఈ యుద్ధంలో మన సైన్యానికి ప్రమాదం ఏర్పడకుండా భద్రత కలిగించు" అని కోరాడు.

సూర్యప్రభుడు సువాసనుని మాటలు విన్నాడు. అతనికి తలవంచి నమస్కరించాడు. త్రికూట పర్వతం ఏడు కోటలలో వున్న శ్రుతశర్మ పట్టణం వైపు బయలుదేరాడు.

శ్రుతశర్మ అదివరకే తన సైన్య సముద్రంతో సిద్ధంగా వున్నాడు. ధనుర్ధారియై, మంత్రులు వెంట రాగా, కోపంతో యుద్ధానికి బయలుదేరాడు.

రెండు సైన్యాలు తలపడ్డాయి. సమరోత్సవం ప్రారంభమయింది. ఇంద్రుడు మొదలు దేవతలందరూ ఈ గగనమార్గంతో వచ్చారు. మయుడు వెంట రాగా, ప్రహ్లాదుడు, బలి మొదలయిన దైత్యవీరులూ వచ్చారు. అందరూ మహాద్భుత అస్త్రశస్త్రాలు ధరించి సూర్యప్రభుని విజయం

# ...బృహత్కథామంజరి

కోరుతూ వచ్చారు.

ఇరు వాగులకూ యుద్ధం జరిగింది. వీరులు బలంగా విసిరే కత్తులు కత్తులా రాపిడి పొంది లేచిన మిణుగురులు, ధనుస్సుల అల్లెత్రాళ్ల క్రేంకారాలు, విసురుగా వెళ్లే బాణాల షూత్కారాలు, ఖడ్గాల రణితాలు, ఆకాశాన్ని నింపి వేశాయి. అర్ధచంద్ర బాణాలకు తెగిపడిన విద్యాధర రాజుల తలలతో రణభూమి, అప్పుడే వికసించిన కమల వనం లాగా కనిపించింది.

శ్రుతశర్మ మంత్రులుకూడా మహాపరాక్రమంతో పోరాడారు. వారు సూర్యప్రభుని సైన్యం పైన అణుమాత్రం ఎడం కూడా కనిపించనంతగా బాణాలు కురిపించారు.

శత్రువులైన దేవతలు చక్ర వ్యూహం పన్నారు. ఆ వ్యూహంలో ఆనాటి మధ్యాహ్నం రథులు చిక్కుకున్నారు. ఆ వ్యూహాన్ని భేదించండని సూర్యప్రభుడు తన వీరకుమారులకు వుత్తరువు చేశాడు. తండ్రి ఉత్తర్వు చేసీ చేయగానే, వీరకుమారులు వచ్చి చక్రవ్యూహం భేదించారు. దానితో, సూర్యప్రభుడు మొదలయిన వీరులంతా శత్రు సైన్యంలో చొచ్చుకొని పోయారు. శత్రు సంహారం ప్రారంభించారు. విద్యాధరేంద్రులు ఎల్లలు మీరి, యుద్ధం చేశారు. కృతాంతునికి పెద్ద పండుగా అన్నట్టు వీరులు నిహతులయ్యారు.

అల్లకల్లోలమయిన ఆ సేనలనే సముద్రాలలో అచలంగా నిలిచిన ఏనుగులు అచలాలుగా (కొండలలాగా), కత్తులుకాలకూటాగ్ని శిఖలలాగాను కనిపించాయి. వీరభటులు ధరించిన తెల్లని శిరోవేష్టనాలు, రాజ చిహ్నలయిన శ్వేతాతపత్రాలు పొంగుతున్న నురుగుల పిండులలాగాను, భటులు పరస్పరం విసురుకుంటున్న ఖడ్గాలు అటు ఇటు తిరుగాడే చేపలు, నక్రాలు లాగాను, పారుతున్న రక్తపు ఏరులు సముద్రంలో కలవడానికి వచ్చిన నదులలాగాను కనిపించాయి.

సాయంకాలమయింది. యుద్ధం ఆగింది. మంత్ర గుటికలు ధరించి యుద్ధం చేస్తున్న విద్యాధరులు దేహమంతా గుచ్చుకున్న బాణాల ములుకులు కొంచెం పడలగా పరస్పరం ఊరడించుకున్నారు.

వీర రసోత్సాహపరాయణుడయిన సూర్యప్రభునికి పెళ్లి దగ్గరపడిన పిల వాడికి లాగ నిద్ర పట్టలేదు. దగ్గరున్న వీతభయుడనే మిత్రునితో, మనోవినోదం కలిగించే కథ ఏదైనా చెప్పమని ఆదరంతో అడిగాడు. వీతభయుడు ఇలా అన్నాడు:—

మహారాజా, వినండి. పూర్వం ఉజ్జయినీ నగరాన్ని మహాసేనుడనే రాజు పాలించేవాడు. ఆయన రాణి పేరు అశోకవతి. ఆమె మహాసుందరి. అతనికి గుణ శర్మ అనే బ్రాహ్మణుడు మంత్రి. అతడు పేరుకు తగినట్లు గుణాలతో శ్రేష్ఠుడు. విద్యలకు, కళలకు కేళీసౌధం లాగ ఉన్నతుడయినట్టివాడు. అతని పైన రాజుకు విశ్వాసం ఎక్కువ. ఒకమారు మహాసేనుడు ఏకాంతంగా రాణి అశోకవతితో సరసాలాడుతున్నాడు. అప్పుడు, నమ్మకం ఎక్కువగా వుండడం వల్ల గుణశర్మను పిలిపించి, "నీవు నృత్యజ్ఞుడివి కాదా! నృత్తం చేసి చూపించు" అని ఆదరంతో కోరాడు.

"ప్రభో, మీరు కోరడం బాగానే వుంది. కాని, నేను, సిగ్గులేని నట్టువకానిలాగ మహారాణి ముందు ఎలా నృత్యం చేయను? నేను సర్వకళలు తెలిసినవాడిని. వాటి వినోదం చూపిస్తాను,చూడండి. నృత్యమనేది లలితమైన కళ. అది మహిళలకే శోభ కలిగిస్తుంది" అని గుణశర్మ వినయంతో మనవి చేశాడు.

కాని, రాజు ఆతని మాటలు వినిపించుకోలేదు. పదే పదే నిర్బంధం చేశాడు. గుణశర్మ ఇక గత్యంతరం లేక నృత్తాన్ని, సకలకళలను చూపాడు. కైశికీ కోమలమైన లాస్యాన్ని, వీరోదారమయిన తాండవాన్ని ప్రదర్శించాడు. సర్వరాగానుసారి అయిన గీతం ఆలపించాడు. మృదుమూర్ఛనలతో వీణను వాయించి చూపాడు.

మన్మథసుందరుడైన ఆ మంత్రి పుంగవుని కళాప్రదర్శనం చూచి రాణి అశోకవతి మనస్సు చలించింది. ఆమె మనస్సు కామవశమయింది. రాజు మంత్రి కళాచాతుర్యం చూచే అభిలాషారసంలో మునిగి వుండడం గ్రహించింది, మహారాణి. అందులోను రాజు స్త్రీచ్ఛగల ప్రణయి. ఆ సమయంలో ఆయన మనసును మభ్యపెట్టే విలాసాలతో ఆయన తన మాట వినేట్టు చేసి, ఇలా కోరింది:— "మహారాజా, స్వరశ్రుతి విచక్షణుడైన ఇతడు నాకు మంజుభాషిణి అయిన వీణ నేర్పేట్టు చేయండి."

మహారాజు రాణి మాట కాదనలేకపోయాడు. గుణశర్మను చాలసేపు బతిమాలాడు. గుణశర్మ "రేపు ఉదయం నుంచి వీణ నేర్పుతాను లెండి" అని తన యింటికి వెళ్లిపోయాడు. రాజపత్ని స్నిగ్ధదృష్టి అతనికి అనుమానం కలిగించింది.

మరుసటి ఉదయం గుణశర్మ వీణ నేర్పడానికి రాజాంతఃపురానికి వచ్చాడు. అశోకవతి అతని ముందు కూర్చొని తన ఒడిలో వీణ పెట్టుకొన్నది. కామ పరవశురాలు. తన కనుసన్నలతోను, కనుబొమల లాస్యాలతోను మనస్సులోని మాట తెలియజేసింది. విదగ్ధులు (నిపుణులు) మన్మథ వికారం తెలిపే గోటికొన సైగలు కూడ చేసింది.

గుణశర్మ ఇదంతా చూచాడు. ఆమెతో "దేవీ, నీ అవినీతిని అరికట్టు. నాకు నీవు ప్రభు భార్యవు. నీచమైన బుద్ధి తలపెట్టవద్దు." అని అన్నాడు.

అశోకవతికి అతని మాటలు నచ్చలేదు. పాలిండ్లు అదురుతూవుండగా, లేచి వచ్చే సంరంభంలో కట్టుకున్న పట్టు పుట్టం జారిపోగా, "నన్ను అనుభవించు" అంటు అతని పైకి వచ్చింది.

గుణశర్మ చెవులు మూసుకొని, అంతటి అందగత్తెనూ నిరక్ష్యం చేసి వెళ్లిపోయాడు. అశోకవతి విరహంతో వేగిపోయింది.

(ఇంకా ఉంది)




ఇది నిజంగా జరిగిన కథ. రచయిత ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి సుపరిచితులయిన 'యు' — ఒక రిటైరయిన పోలీసు అధికారి. కథలోని పేర్లు మాత్రం మారుపేర్లు.

—సం॥

ఇది సుమారు నలభయిఏళ్ల కిందటి మాట. అది రామనాడు జిల్లాలో ఒక మారుమూలగ్రామం. ఆ గ్రామంలో జయలక్ష్మి అనే అమ్మాయి ఉండేది. జయలక్ష్మికి తన విధవతల్లి తప్ప వేరెవరూ లేరు. ఈ తల్లే పొలాలలో కూలిపనిచేసి ఇద్దరికీ చాలీచాలని సంపాదనకి ఆధారంగా ఉండేది.

జయలక్ష్మి అందగత్తె. కాని, ఆమె బుద్ధి కాస్త మందంగా ఉండేదని అందరూ అనుకునేవారు. దీనికి తోడు వట్టి గయ్యాళి రకం. అసలే చదువు రాకపోవటం, పేదరికంవల్ల ఆమెకి త్వరగా పెళ్లి కుదరలేదు...

ఇలా ఉండగా ఒకనాడు ఆమెకొక సంబంధం వచ్చింది. మధుర జిల్లాలో చిన్నప్పుడే తలిదండ్రులని పోగొట్టుకున్న ఒక యువకుడు ఆమెని చూడటానికి వచ్చాడు. అతని పేరు మురుగన్. మురుగన్ కాస్త కలవాడు. జయలక్ష్మి అందాన్ని చూసి ముగ్ధుడయ్యాడు. కొందరు వద్దని సలహా ఇచ్చినా ఆమెనే పెళ్లిచేసుకొనటానికి నిశ్చయించుకున్నాడు.

పెళ్లి అయిపోయింది. జయలక్ష్మి భర్తతో పక్కజిల్లాకి వెళ్లిపోయింది, ఆమె రాకతో మురుగన్ మనశ్శాంతి కాస్తా పోయింది! జయలక్ష్మి మాట దురుసుతనం అటువంటిది...

* * *

కొన్ని సంవత్సరాలు గడిచాయి. మధుర, రామనాడు జిల్లాలలో అనావృష్టిబాధ విపరీతం అయిపోయింది. మురుగన్ పొలాలు ఎండిపోయాయి. అతను బాగా నష్టపోయాడు. ఈ నష్టంతోబాటు పెళ్లాము సాధింపు కూడా అధికం అయింది. ఇక ఆమెతో వేగలేక అత్తగారితోసహా పుట్టిన ఊరికి పంపించివేసి తను బర్మాకి వెళ్లిపోయాడు. ఆ రోజులలో అది ఎందరోచేసే పనే ...

మురుగన్ గ్రామంలో అతన్ని పోలిన మనిషి మరొకడు ఉండేవాడు. అతని పేరు ముత్తయ్యన్. ముత్తయ్యన్ చిన్నప్పటినుంచి చెడుదారి తొక్కిన వ్యక్తి. చిన్నచిన్న దొంగతనాలను ప్రారంభించి పెద్ద గజదొంగగా మారిపోయాడు. తరుచు కారాగృహానికి వెళ్లి వస్తూవుండేవాడు. కాని, ముత్తయ్యన్ జాగ్రత్తమనిషి. తను దొంగిలించిన సామాను చాలా తీసుకువెళ్లి జయలక్ష్మి భర్త మురుగన్ పాడుబడిన ఇంట్లో పాతిపెట్టేవాడు!

ఒకనాడు ముత్తయ్యన్‌కి తన దొంగబతుకుని అపుదామనిపించింది. 'ఎంతకాలమని పోలీసులని తప్పించుకుని తిరగటం!' అనుకున్నాడు.

ఒక పథకం తయారుచేశాడు.

జయలక్ష్మి ఊరికి వెళ్ళాడు. తనే

బర్మా నుంచి తిరిగి వచ్చిన మురుగన్‌ని అన్నాడు. బర్మాలో ఎంతో సంపాదించాననే ప్రచారం చేశాడు! జయలక్ష్మి తెలివి తక్కువది. ఈ దొంగ మురుగన్ ప్రచారాన్ని నమ్మింది. ఆమె తల్లి ముదుసలి కాబట్టి చూపు సరిగ్గా లేక నిజం కాబోలు ననుకుంది. తక్కినవారు మురుగన్‌ని బాగా ఎరగరు కాబట్టి పూర్తిగా నమ్మేశారు! ముత్తయ్యన్ లేక మురుగన్ ఆ గ్రామం లోనే స్థిరపడి పోతున్నానన్నాడు. కొంత భూమి, ఒక ఇల్లు కొన్నాడు...

అయితే అతనికి జయలక్ష్మి స్వభావం ఎటువంటిదో తెలిసి వచ్చింది. ఆమె గయ్యాళితనాన్ని తట్టుకోలేక పోయాడు. చివరికి ఎదురుతిరిగి ఆమెని కొట్టటం మొదలు పెట్టాడు. దానితో జయలక్ష్మికి ఒక అనుమానం కలిగింది. తన భర్త మురుగన్ ఇంత కఠినుడని ఆమె నమ్మలేక పోయింది. తన అనుమానాన్ని కాస్త బయట పెట్టింది. ఊర్లో పుకార్లకి అంతులేదు...

ఇలా ఉండగా ఆ ఊరికి ఒక ముసలి వాడువచ్చాడు. చింపిరిజుట్టుతో, పేలిక లయిన గుడ్డలతో వాచినకాళ్లతో ఎంతో బలహీనంగావున్నాడు. అతన్ని చూడగానే జయలక్ష్మి మనస్సులో ఏదో మెదిలింది. ఆ ముసలివాడిని తన ఇంటికి పిలిచి అన్నం పెట్టింది. అతనితో ఎంతోసేపు మాట్లాడింది...

అతనెవరోకాదు. జయలక్ష్మి మొదటి మొగుడు మురుగన్!

మురుగన్ బర్మాకివెళ్ళి వ్యాపారం పెట్టాడు. త్వరలోనే మంచి ఆస్తి సంపాదించాడు. ఒక బర్మా వనితని పెళ్ళిచేసుకున్నాడు. అక్కడే స్థిరపడిపోవటానికి నిశ్చయించుకున్నాడు. కాని, రెండవ ప్రపంచయుద్ధం మొదలయి జపాన్ బర్మామీదకి దాడితీసింది. మురుగన్ తన ఆస్తినంతా పోగొట్టుకుని భారతదేశానికి తిరిగి వెళ్ళిపోవటానికి ఉద్యుక్తుడయ్యాడు.

అతనివెంట రావటానికి మురుగన్‌బర్మా భార్య అంగీకరించలేదు. సరేననుకుని అతను ఒంటరిగా స్వదేశానికి నడక ప్రారంభించాడు. వెయ్యిమైళ్ళ కాలినడక తర్వాత చిక్కిశల్యమయి అస్సామ్ చేరుకున్నాడు. కాందిశీకుడు కాబట్టి భారత ప్రభుత్వం అతనికి సహాయంచేసింది. అనామకుడుగానే స్వగ్రామం చేరుకున్నాడు. అక్కడినుంచి భార్య ఊరికివెళ్ళాడు. పరిస్థితిని అర్థం చేసుకున్నాడు.

జయలక్ష్మి తల్లి ఊరివారిని కొందరిని సహాయంచెయ్యమని కోరింది. వారు పోలీసులకి రిపోర్టు ఇచ్చారు.

ఒక పెద్ద దొంగపట్టుబడిపోయాడు. ఈ అనుభవం తర్వాత జయలక్ష్మికూడా భర్తవద్ద కొంత నెమ్మదిపడటం అలవాటు చేసుకుంది !

# వారఫలం

## 1-11-1968 శుక్రవారంమొదలు 17-11-1968 గురువారం వరకు

**మేషం** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో మెప్పుకూరాని కార్యభారాన్ని వహిస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. పోటీవారితో గౌరవం బాగాఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. అధికవ్యయం రుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణించగలదు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం**: వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయి. తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

**సింహం**: ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతిపని మలువుగా నెరవేరుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య**: వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**తుల**: వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారితో మాటపట్టింపులు తగవు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం**. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**ధనుస్సు**: వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మకరం**: భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం**: మీ ఆత్మవిశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు మలువుగా నెరవేరుతాయి. కోర్టువ్యవహారాల్లో అనుకూలత లభిసుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం**: ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

—మహేష్




□ "మనలోతే ఎందుకుండాలి ఆవిడగారు? ప్రతీదీ ఎత్తిపొడుస్తూ, పిల్లల్ని చెప్పిన మాట వినకుండా చేస్తూ," 'చిలికి చిలికి గాలి వానగా ఎన్నాళ్ళనుంచో లోపల్లోపల ఉడుకు తున్నది కాస్త అవకాశం చూసుకుని బయటపడింది. మాటా మాటా పెరిగింది. 'నిన్ను పెళ్ళాడానా? ఆవిడనా?' అంటూ నిలదీసింది ఇల్లాలు...అది ప్రశ్నా? దానికో జవాబూనా? అతగాణ్ణి పెళ్ళాడినప్పుడే అతని కుటుంబాన్ని తనదిగా చేసుకున్నట్టే కదా? దాన్నించి తప్పించుకుపోడం అన్నది కుదర నిదే !

అతనికో వ్యక్తిత్వం ప్రసాదించి, పెద్ద వాణ్ణిచేసిన ఇంటిపట్ల గౌరవాభిమానాలు, బంధాలు ఉన్నట్టయితే—వారు నచ్చని కార ణంగా అతన్ని యీ సుగుణాలనుంచి తప్పిం చాలని చూడడం వేరస్థ మనస్తత్వమే అవుతుంది. ఎందుకంటే తనదీ అంటూ ఒక కుటుంబం పెరిగాక మగవాడు అయిన భర్త వాటిపట్ల గౌరవాభిమానాలూ బంధాలు పెంచుకోకపోతే ఆడదైన ఏభార్యా సహించ లేదు కదా ?'

ఎవరి తల్లితండ్రులయినా సరే వారు పెద్దవారయిపోతున్నకొద్దీ చేతనయినంతగా ఆదుకోవలసిన బాధ్యత పిల్లలకి వుంటుంది. ఇది భార్యాభర్తలమధ్య ఏకీభావం వున్న ప్పుడే కుదురుతుంది. నూతన దంపతులతో పాటు పెద్దవాళ్ళంతా దిగబడాలనీ, భర్త ఎక్కడ ఉద్యోగం చేస్తున్నా భార్య అత్త వారితోనే ఉండాలనికాదు నేను అనడం. (పెళ్ళి చేసేటప్పుడే అలాంటి కండిషన్లు పెడుతున్న పెద్దలున్నారు!) పెళ్ళి చేసి కొడుకుని ఓ శత్రువుని చేసుకున్నాం అను కునేలా వారిని ఇబ్బంది పెట్టకూడదనే నేను అనడం ... తల్లిదండ్రులను ఆదుకోవడం అంటే అటు ఆడబిడ్డల కుటుంబాలన్ని టికీ బాధ్యత వహించడం అన్నట్టుగా అర్థంతీసి సంపాదించిన ప్రతి కాసికి కర్చు చూపగల కొన్ని కుటుంబా లుంటాయి. అటువంటి కుటుంబాలలో ఒకతె అయిపోయి కొత్తకోడలు రాణించడం అనేది కుదరని పనే. ఎందుకంటే ఆ యింట్లో అటు భర్తకీ ఇటు ఆమెకీ కూడా విలువ ఉండదు—అందరికీ అన్నీ సద్ది పెట్టడం మినహా. ఇలాగే, కోడలు మీద భర్తకంటే

డాక్టర్ కబుర్లు

## నొప్పిలేని గుండె పోటు!

ఇది సాధ్యమా ?

అంటే, నొప్పి ఉన్నట్లు అని పించకపోయినా గుండెపోటు రావచ్చు. అటువంటప్పుడు గుండె పోటుని సూచించే ఇతర లక్షణాలు ఉంటాయి. మొదట హఠాత్తు బలహీనత ఏర్పడుతుంది. తర్వాత చెమట పోస్తుంది; 'అజీర్ణం', ఆయాసం కూడా రావచ్చు.

చాలామంది, ఇది మామూలు అజీర్ణం అనుకుని ఏదో మాత్ర, మందు పుచ్చుకుని వూరు కుంటారు. కాని, డాక్టరు పరీక్ష మంచిది.

'నొప్పి' అంటే ఏమిటి? ఎన్నో అర్థాలు చెప్పవచ్చు. సాధారణంగా గుండెపోటు, అంటే రొమ్ములో నొప్పిద్వారా తెలుస్తుంది. కొందరికి వింత అనుభూతులు వేరే కలుగ



వచ్చు. ఏది ఎలా ఉన్న రొమ్ము ప్రాంతంలో ఏ ఇబ్బంది ఉన్నా డాక్టరుని చూడకపోతే ప్రాణా పాయమే కలుగవచ్చు.

హెచ్. ఎల్. హార్శన్‌సాన్
(కాపీరయిటు)

## ఎవర్ని పెళ్లాడాను?

మామగారే అజమాయిషీ చేసే కుటుంబాలు కూడా ఉంటాయి. అలాంటి చోట్ల భర్తగారు తప్పించుగు తిరిగే చిట్కా కని పెట్టి భార్య గోడు పట్టించుకోడు. భార్య మటుకు ఏ ముఖంతో చెప్తుంది?...ఇలాంటి చోటులలోనే తలెత్తుతుంది — నిన్నా? నీ కుటుంబాన్నా పెళ్లాడా నన్న ప్రశ్న.

పెళ్లి చేసుకున్న ప్రతి అమ్మాయీ రెండు సంగతులు మరిచి పోకూడదు. ఒకటి — ఆమెగారో అనాధని పెళ్లాడలేదు. రెండు, కొత్తగా భర్త అయినంత మాత్రాన అతగాడు కొడుకు కాకుండా పోడు...భర్తగారి కుటుంబం అనేది ఉందన్న విషయం పట్టించుకోకుండా ఉండాలని తలపోయడం — నెమ్మదిగా తన స్వంత కుటుంబానికే ఎసరుపెట్టుకోవడం లాంటిది.

నిజమే. పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి బలి పశువులా మేపి కట్నానికి అమ్ముకున్నాక ఆ అబ్బాయిమీద న్యాయంగా కొనుక్కున్న భార్యకే ఎక్కువ హక్కు ఉండాలి. కాని మనిషికీ మనిషికీ మధ్య సాన్నిహిత్యం పెంపొందాలంటే ఈ ధోరణి దోహదం చేయదు. కష్టపడి, దిక్కుమొక్కూ లేనివాడిగా పెరిగి స్వంతంగా లేచి నిలబడి కాళ్లూనిన కొడుకులకే 'మేమున్నామంటూ' పెద్దలు తయారు అవుతూ ఉంటారు. ఇక డిగ్రీలు యిప్పించి పెట్టుబడిగా మదుపు పెట్టిన తల్లితండ్రులు కోడలు వచ్చాక కొత్తరకం ఆధిపత్యం కోసం ఎదురు చూడ్డంలో వింతేముంది?

భార్యా భర్తల మధ్య తమ తమ పెద్దల పట్ల ఒకరకం ఏకీభావం ఉండాలి. విశ్రాంతిగా దూరంగా తమ సంసారాలని పిల్లలు గడపాలని చూడడంలో అత్యాసలేదు. అంతమాత్రంచేతనే పెద్దలు కోడలు వచ్చి తమకొంప ముంచిందని వాపోవడం కూడా కద్దు. చిన్నదైనా కోడలు కనుక భర్తతో పదికాలాలపాటు గడపాలని కలలు కంటున్నది కనుక పెద్దల విషయంలో ఒక నిర్ణీత

మైన పద్ధతి అలవరచుకోవాలి. ఈరోజుల్లో ఆత్మీయతకోసం పాకులాడే పెద్దలకంటే డబ్బుకోసం పాకులాడేవాళ్లే ఎక్కువ కనుక భర్తగారి సంపాదనలో మనశ్శాంతికి మదుపుగా పెద్దవారికోసం కొంత వెచ్చించక తప్పదని గ్రహించితే ఆ కోడలు కోటలో పాగా వేసినట్టే. చేస్తున్న సహాయానికి తృప్తిపడ్డం అనేది అరుదే అయినా పెద్దలు కూడా తమ పెద్దరికం నిలుపుకుందుకు ప్రయత్నించాలి. డబ్బుకితోడు చాకిరీ, చాకిరీకితోడు దెప్పులు—ఇవన్నీ—చాలా పాతవీ, చాలా కొత్తవీ అయిన సమస్యలే.

ఇటువంటి సరికొత్త పాత సమస్యను నెత్తిన వేసుకుంటుంది పెళ్లి చేసుకున్న అమ్మాయి. ఆధునిక యువతి కనుక ఆధునిక భావాలను వంట పట్టించుకున్నది కనుక భర్తతో వేరింటి కాపురంలో ఉన్న స్వేచ్ఛ అత్తమామలతో ఉంటే ఉండదని గ్రహిస్తుంది. పాతకాలపు కోడళ్లు పేచీలు పడి ఏడ్చి మొత్తుకుని విడివడిపోతే కొత్తవాళ్లు ఉద్యోగరీత్యా, సౌకర్యం రీత్యా విడివడిపోతున్నారు. ఇది సహజ పరిణామం. పిల్లల పెంపకంలో, వారు పెరిగి పెద్దవారయ్యాక పెట్టుబడిగా తయారయ్యే—దృష్టిలో—వస్తున్న మార్పు ఫలితంగానే వేరింటి కాపురాలు అభిలషణీయంగా తయారవుతున్నాయి. దగ్గరసా ఉండి క్షణక్షణం ఒకరి కీడొకరు కోరుకుంటూ బ్రతికేకంటే దూరంగా ఉండి అడపా తడపా ఆప్యాయంగా మాట్లాడుకోవడం మేలు. అప్పుడే కోడం(?)టికం అన్న పదాలకీ, అత్తలేని కోడలు అన్నదానికీ అర్థాలు మారతాయి. అభిమానం ఆదరణ కొరవడినచోట, మానసికమైన అనుబంధాల బలం పెరగనిచోట్ల—కలిసి ఉంటే కలదు సుఖం అనుకోవడం—ఎండమావి నిజం కావడం కోసం ఎదురు చూడ్డమే అవుతుంది. ●




అదీ ఆ జంతువుపేరు. దీనికి సరియైన అర్థం "నిశాకాంతి" ఇదొక వింత, సముద్ర సూక్ష్మజీవి. అంగుళంలో 25 వ వంతు ఉంటుంది గోళాకారంలో ఉన్న దీనికి ఒకతట్టునుండి పెద్ద తోకలాగా ఒక "టెంటకిలు" ఉంటుంది. మొదట్లో ఈ టెంటకిలే అసలైన జీవి, వెనక ఉండే భాగం తిత్తి అని పొరపాటున అనుకొన్నారు.

స్టీమర్లలో పోయేవారికి ఒక్కొక్కసారి మైళ్లకొద్దీ సముద్రం అంతా టొమాటో రసంలాగే కనబడుతుంది. సముద్రం అంతా అక్కడ నాక్టిల్యూకా ఉండడమే దీనికి కారణం. ఒక చిన్నబకెట్టులో సుమారు ఒకకోటి నాక్టిల్యూకా లుంటాయి!

నాక్టిల్యూకా అందం రాత్రిపూట చూడాలి. దీని కారణంగా సముద్రం అంతా మంటలురేగిందా అని అనిపిస్తుంది. ముఖ్యంగా స్టీమరు దాటిన మార్గం అలా నీటిలో స్పష్టంగా కనబడుతుంది. అక్కడి నీటికదలిక వల్ల నాక్టిల్యూకా ఇంకా ప్రజ్వలమయి ఆ మార్గం మెరిసి పోతుంది. ఒక గ్లాసునిండా నీటిని తీసికొని, 10 అంగుళాల దూరంలో పుస్తకాన్ని చదవగల్గుతాము. ఇంతకూ ఈ కాంతి వేడి కాంతికాదు. చల్లనికాంతి మాత్రమే. మానవుడు సాధ్యం చెయ్యలేని కార్యం ఇది చేసింది. కాంతికావాలంటే వేడిలేందేపుట్టదు కదా మనకి. అయినా నాక్టిల్యూకా ఇది సాధ్యం చేసింది. అలాగే కొన్ని ఇతర జంతువులుకూడాచేసాయి—బ్రెరి(?), మిణుగురు పురుగు, సముద్రగర్భంలోని కొన్ని చేపలు మొదలైనవి.

—జమ్మి కోనేటిరావు

**సీరియల్**




### జరిగిన కథ

సుజాత పుట్టగానే సూర్యం భార్య అన్నారు పెద్దవాళ్ళు. సుజాతకి సూర్యంపై అపేక్షలేదు. సూర్యానికి చదువు అబ్బకపోవడమూ, అతని ప్రవర్తనా సుజాత తల్లిదండ్రుల మనస్సును కూడా మార్చివేసింది. సుజాత అన్నపూర్ణా ఇంజినీరింగు వర్క్సులో టైపిస్టుగా చేరింది. ఆ కంపెనీ యజమాని నీలకంఠం అతని కొడుకు శ్రీధర్. శ్రీధర్‌కి సుజాతపై అమితమైన ప్రేమ. సుజాత శ్రీధర్‌ల వివాహానికి మొదట్లో నీలకంఠం అంగీకరించక పోయినా తర్వాత సంతోషంగా అంతా జరిపించేస్తాడు. రాజారావు శ్రీధర్ మిత్రుడు. అతన్ని చూసినప్పుడు సుజాత చాలా భయపడింది. ఒకప్పుడు రాజారావు వల్ల సుజాతకి చాలా అన్యాయం జరిగింది. ఆ సమయంలో వచ్చి కాపాడుకుంది కూడా.

---

## 12

కొంతసేపటి తరువాత ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రంగనాథంగారు జాలిగా దిగులుగా అన్న మాటలు వినవచ్చాయి—'పోనీ, ఓ పని చేస్తేనో — తెల్లవారగానే వెళ్ళి ఆ రాజారావుతో మాట్లాడతాను — పరిస్థితులన్నీ అతనికి చెప్తాను-భార్యాబిడ్డలు వుంటే వున్నారు...'

'అతను ఇష్టపడతాడటండీ.' బేలగా అడిగింది మీనాక్షమ్మ. ఎలాగో అలా అతను అంగీకరిస్తే ఇంక తమ అభ్యంతరం ఏమీ వుండదనిపించింది వాళ్ళకి.

'ఒప్పించాలి మరి—చట్టాలూ సాంప్రదాయాలూ ఇక్కడ పనిచెయ్యవు—ముందు అమ్మాయి జీవితం ముఖ్యం — ఆ తరువాత ఎలాగయినా జరగనీ...'

'లాభంలేదు — ఆయనిప్పుడీవూళ్ళో లేరు' అంది సుజాత. అతనిపేరు తలుచుకుంటేనే కంపరం పెడుతున్నా నిజంగా అతను కనిపించి తండ్రిమాట ప్రకారం తన మెడలో తాళి కట్టడానికి అంగీకరిస్తే తనూ అందుకు సిద్ధపడాలనే అనిపించింది.

'శలవంకి వూరికి వెళ్ళాడా ?'

'ఉహూ— కాదు-మరెక్కడో ఉద్యోగం వచ్చిందని ఇక్కడ రిజైన్ చేశారుట' కొంగులో ముఖం దాచుకుని చెప్పింది.

'ఉద్యోగమూ కాదు—వల్లకాడూ కాదు —ఇలాంటి దేదో వస్తుందని భయపడి పారిపోయి వుంటాడు.' పళ్ళు పటపట నూరుకున్నారు రంగనాథంగారు.

నిజమే అనిపించింది అందరికీ— 'అలాంటి వ్యక్తికోసం ఎక్కడని వెతకటం —ఎలానో ఎ్ర డసు కనుక్కుని వెళ్ళినా అతను అంగీకరిస్తాడని నమ్మకం ఏమిటి —కాలయాపన తప్ప మరో ప్రయోజనం వుండదు.' అనుకున్నారు.

'ఇంక ఒక్కటేమార్గం—అది ఇక్కడ సాధ్యంకాదు — ఏ డాక్టరు నడిగి మందు తెచ్చుకున్నా వూళ్ళో అల్లరిపడిపోతాం— అదివరకు అనుకున్నాం కదూ యాత్రలకి వెళ్ళాలని—ఆ వంకనే బయలుదేరుదాం...' అంది మీనాక్షమ్మ బాధతోనూ సిగ్గుతోనూ కుంగిపోతూ.

అంతకన్న మరో ఉపాయమూ తోచలేదు రంగనాథంగారికి. 'నాలుగు రోజుల్లో పేపర్లుదిద్ది వాళ్ళమొహాన్న పడేస్తాను— పూర్ణయ్యగారినో వెయ్యిరూపాయలు అప్పు ఇమ్మంటాను.' అన్నారు.

అలా వాళ్ళు ఇంకా ఎంతసేపు కూర్చునేవారో కాని పనిమనిషి వీధి తలుపు తట్టడం వినిపించి ముగ్గురూ ఉలిక్కిపడ్డారు.

గబగబా కాసిని నీళ్ళు మొహంమీద చల్లుకొని కొంగుతో తుడుచుకుంటూ వెళ్ళింది మీనాక్షమ్మ—కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది. వాళ్ళు ఏడుస్తున్నట్లు మరో మనిషికి తెలియకుండా జాగ్రత్త పడుతూ మామూలుగా పనులలో జొరబడిపోయిందావిడ.

జ్వరం వచ్చిందని ముసుగుపెట్టుకుని పడుకున్నారు రంగనాథంగారు. తలనొప్పిగా వుందని కళ్ళు మూసుకు పడుకుంది సుజాత. కాని ఎల్లకాలం అలాగే పడుకుంటే కుదరదుగా — ముందు కర్తవ్యం తరుముకు వస్తోంది. అందుకే మర్నాటి నుంచీ పేపర్లు ముందు పెట్టుకుని దిద్దటానికి వుపక్రమించారు — పైకి అలా మనిషిలా వున్నా ఆయన మానసికంగా పూర్తిగా చితికిపోయారు—కన్న బిడ్డమీది మమకారం చంపుకోలేక అలా సానుభూతి చూపించగలుగుతున్నారే కాని తలచుకుంటున్న కొలదీ ఆయనకి భవిష్యత్తు అంతా అగమ్యగోచరంగా వుండేది. తాము అనుకున్నది నెరవేరుతుందా—సుజాతకి మామూలుగా పెళ్ళి చెయ్యగలుగుతామా—ఏ వడిదుడుకులు లేకుండా దాని జీవితం సుఖంగా గడుస్తుందా—అహోరాత్రాలు ఇవే ఆలోచనలు—ఒక్కొక్కసారి ఆ బాధని అలా లోలోపలే భరించటం సాధ్యం కాక భార్యని పిలిచి అదంతా వెళ్ళబోసుకునేవారు— కూతురు వింటే మరీ కృంగిపోతుందని నోరు నొక్కుకుంటూ ఒకరినొకరు ఓదార్చుకునేవారు — అయినా అదంతా

సుజాత గ్రహించుకోగలిగేది—'అలా వాళ్ళని ఏడ్పించి బ్రతక్కపోతేనేం అనిపించేది చాలా సార్లు—కాని తాను అలాంటి పని చేసిన నాడు వాళ్ళ బ్రతుకు లెలా వుంటాయో వూహించుకోగలదు—తనకి సుఖం ఎలాగా లేదు—వాళ్ళని సుఖపెట్టగలిగే శక్తి అంతకన్నా లేదు – కనీసం వాళ్ళు దుఃఖము అవమానాలూ భరించలేక ఆత్మహత్యలకి పాల్పడే స్థితి కల్పించకుండా వుండగలిగితే చాలు.' విరక్తిగా బాధగా నవ్వుకునేది.

వేళకి ఎంగిలిపడటమే తప్ప కడుపు నిండా తిండి, కంటినిండా నిద్ర అనేది ఆ వ్యక్తులు మరిచేపోయారు - ఆడవాళ్ళలా నాలుగు గోడల మధ్యా కూర్చుని కుమి పోవడం భరించలేక అలా కాస్సేపు పిచ్చివాడిలా తిరిగి వచ్చేవారు రంగనాథంగారు

ఓ సాయంకాలం ఆయన అలాగే తల వంచుకుని నడుస్తున్నారు—మనస్సు తన ధోరణిలో తను ఆలోచిస్తూండటం వల్ల వెనుకనుంచి వస్తున్న అరుపులు వినిపించుకోలేదు — రంకెలు వేసుకుంటూ పరుగ పరుగున వచ్చిన ఆంబోతు ఒక్కసారి కుమ్మేసి ఆయన్ని అంత దూరం పడేసి తన దారిన తను చక్కాపోయింది — నలుగురూ వచ్చి చూసి ఆయన్ని ఆస్పత్రిలో చేర్పించారు మరో ఇద్దరు ఆ వార్త ఇంటికి చేరవేశారు.

తల్లీకూతుళ్ళు ఏడుస్తూ ఆస్పత్రికి వెళ్ళేసరికి రంగనాథంగారు కొనవూపిరితో వున్నారు — వీళ్ళని చూడగానే ఆయనకి దుఃఖం ఉబికి వచ్చింది. 'అమ్మాయి జాగ్రత్త—దాన్ని కంటికి రెప్పలాచూసుకో' అన్నారు గుంభనగా — ఆయాస పడుతూ ఆయన చెప్పిన ఆఖరిమాటలు అవే — అంతే—అంతా అయిపోయింది.

మనిషి ఎన్నోరకాలుగా ఆలోచిస్తాడు—ఏమేమో చెయ్యాలనుకుంటాడు — తను అనుకున్నవి అనుకున్న విధంగా నెరవేరినప్పుడు అదంతా తన ప్రయోజకత్వమే అని భుజం చరుచుకుంటాడు — కాని, ఒక్కోసారి అతని ఆలోచనలు సాగనివ్వకుండా చెయ్యటమే తనకి సరదా అయినట్లు మానవ జీవితాలని ఆటబొమ్మలుగా జేసి ఆడుకుంటూంటుంది విధి — అలా పరిస్థితులు ఎదురుతిరిగి చెయ్యిజారిపోయి నప్పుడు మాత్రం అంతా దైవ నిర్ణయం ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది అంటూ వేదాంతం వల్లెవేయటం సహజంగా జరిగిపోతూంటుంది — అయినా ఆశనీ పట్టుదలనీ వదులుకోలేదు— ఏ మాత్రం అవకాశం మినుకు మినుకుమంటూ కనిపించినా తాత్కాలికంగా తల ఎత్తిన వేదాంతాన్ని ప్రక్కకినెట్టి మళ్ళీ తన ప్రయత్నంలో పడిపోతాడు — అందులోనూ ఆ సమయంలో అనుభవిస్తున్న బాధని మించిపోయిన భయంకరమైన పరిస్థితి ముంచుకు రాబోతోంది అన్నప్పుడు; దుఃఖాన్ని ప్రక్కకినెట్టి కర్తవ్యం ఆలోచించటం కంటె మరోమార్గం మాత్రం ఏముంటుంది ?

అందుకే,

'నువ్వు నాదగ్గిరికివచ్చి కొన్నాళ్ళుండాలమ్మా—ఎప్పుడువస్తావు' అన్న అన్నగారి మాటలకి—

'ఆవిడ్ని అడిగితే ఏంచెప్తారు—మూడో నెలలో మీరువచ్చి తీసుకువద్దురుగాని—



అందాకా నాకు ఇక్కడే వుండాలనేవుంది. కాని మీకు ఇబ్బంది అయిపోతుంది రాముని కారదని వుంచుదాం. మరీ బిక్కు బిక్కు మనకుండా కాస్త సందడిగా వుంటుంది. వీళ్ళకి.' అన్నవదినగారి మాటలకి మీనాక్షమ్మ ఒక్కటే సమాధానం చెప్పింది.

'నామనస్సేమీ బాగుండలేదు. కొన్నాళ్ళు తీర్థయాత్రలు చేసివస్తాం' అని.

'ఒక్క దానివీనా — మొగసహాయం లేకుండానా?' తెల్లబోయారు అన్నగారు.

'ఫరవాలేదు అమ్మాయి వుందిగా, ఈరోజుల్లో ప్రయాణాలు కష్టం ఏమిటి?

'పోనీ రెండునెలలు శలవపెట్టి నేనూ వస్తాను.'

'అక్కర్లే ఎందుకూ—మళ్ళీ శలవకోసం ప్రయత్నించటం అదీ— ఈ ప్రయాణం ఇదివరకు అనుకున్నదే—డబ్బు అదికూడ సమకూర్చి పెట్టారు—మీ బావదగ్గర చదువుకున్నవాళ్ళు దేశంఅంతటావున్నారు—కొంతమంది ఎడ్రసులు సంపాదించి వుత్తరాలుకూడ వ్రాశారు—రేపో మాపో ప్రయాణం అనుకుంటూండగా ఇలా జరిగింది.' దుఃఖంతో గొంతుపూడిపోతున్నా, అన్నగారి బాధ వదిలించుకోటానికి అన్ని మాటలు చెప్పాల్సివచ్చింది.

'బియ్యే చదివిన కూతురు తోడుందిగా ఇంక భయం ఎందుకు.' శాంతమ్మ భర్త చాటుగా అనుకోటం ఆ తల్లీ కూతుళ్ళ చెవిని పడకపోలేదు. 'ఎందుకో వాళ్ళకి

# సుజాత

మనమీద అంత అక్కసు' అనుకున్నారు.

అంతా ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

పూర్ణయ్యగారి దగ్గర నుంచి తెచ్చిన డబ్బులో కొంత అప్పటికే ఖర్చయిపోవటం వల్ల మరో వెయ్యి కూడ తీసుకుని బయలుదేరారు ఓ రోజున—

వాళ్ళు చేసిన ఒకటి రెండు ప్రయత్నాలూ ఫలించలేదు—స్వంత వూరికీ మనుష్యులకీ చాలా దూరంగా ఒక వూళ్ళో ప్రసవించింది సుజాత.

తుమ్మెద రెక్కలాంటి నల్లటి వుంగరాల జుట్టూ, చిక్కుడుగింజల్లాంటి కళ్ళూ బుల్లినోరూ దంతపు బొమ్మలా వున్న ఆ పసిపాపని చూసిన సుజాత మనస్సు తనకి తెలియకుండానే పరవశించింది ఒక్క క్షణం—అంతలోనే ఎక్కడలేని కసి అసహ్యం పుట్టుకు వచ్చాయి—అలా రాగ ద్వేషాల మధ్య కొట్టుకులాడిపోయే తన మనస్సులో పాపకి ఎలాంటి స్థానం వుందో ఆమెకే అర్థం అయేది కాదు.

వారం రోజులు గడిచి పోయాయి.

'నాలుగైదు రోజుల్లో ఈ వూరు విడిచి వెళ్ళిపోదాం సుజా—తిరగరాని దేశాలన్నీ తిరిగి ఆడరాని అబద్ధాలు ఆడి ఎలాగో ఇన్నాళ్ళూ గడుపుకు వచ్చాం—ఇంక ఈ పాపన్నికూడ వదుల్చుకునే మార్గం ఆలోచించాలి ...' బాధ, సిగ్గు, అవమానం అన్నీ కలిసి ఒక దీర్ఘమైన నిట్టూర్పు రూపంలో ఆవిడ గుండెలు చీల్చుకువచ్చాయి.

సుజాత అయోమయంగా తల్లివంక చూసింది.

'ఏ చెట్టుక్రిందో ఎక్కడో ఎవరూ చూడకుండా పడుకోబెట్టొద్దాం...' ఆవిడ కంఠం వణికింది. 'ఏ పుణ్యాత్ముడైనా, ఏ దయగల తల్లిఅయినా పాపని చూసి పెంచుకునేలా చెయ్యమని ఆ భగవంతుడికి ఓ నమస్కారం చెయ్యటంకన్న మనం చేయగలిగిం దేమీలేదు...' కొంగు నోటిలో కుక్కుకుని ఏడుపు ఆపుకుంటూ మౌనంగా కూతురితల నిమురుతూ వుండిపోయింది.

'అమ్మా' ప్రాణావులా కూర్చుండిపోయిన సుజాత అప్పటికి గొంతు పెగుల్చుకుంది. 'కన్నబిడ్డని ఏ చెట్టుక్రిందో పుట్టక్రిందో వదిలేయటం ధర్మమా అమ్మా'

'ధర్మం, అధర్మం, మంచి చెడూ అనేవి మనుష్యుల పరిస్థితులని బట్టి నిర్ణయించుకోవాలి—అలనాడు కుంతి,మేనకా ఏంచేశారు ?—అన్నీ నీకూ తెలుసు— ఈ మన ప్రయాణాలలో తెలిసినవాళ్ళెవరైనా కనిపిస్తారేమోనని ప్రాణం గజగజలాడిపోయేది—ఎలాంటి ప్రమాదం లేకుండా గండం గడిచింది—ఈ ప్రాంతాల్లో మనం అందరికీ కొత్తే—మనం ఈవూరు వదిలిన మరు నిముషంలో మనల్నిగురించి మరిచిపోతారు—అయినా ఇక్కడయితే ఎవరికైనా అనుమానం రావచ్చు—మరోదగ్గర...'

'మవ్వికచెప్పకమ్మా నేను వినలేను.'

'వినకపోతే ఎలా—అసలు ఈ పాపని అంతంచేస్తే పీడవదిలిపోతుంది అన్న ఆలోచనకూడ వచ్చింది. నా పాపిష్టి వూహకి ఒళ్ళే జలదరించింది. మనగౌరవం కాపాడుకోటంకోసం చూస్తూ చూస్తూ శిశుహత్యకి పాల్పడలేకపోయాను...'

'అమ్మా'—తల ఎత్తి విస్మయంగా వింటూండిపోయిన సుజాత ఇంకేమీ మాట్లాడలేక పోయింది. ఆ క్షణంలో తల్లివల్ల ఆబిడ్డకేదయినా ఆపద సంభవిస్తుందేమో నన్నట్టు ఆమెచేతుల కందనీయకుండా ఇంకా దగ్గరగా గుండెల



దుముకుంది అప్రయత్నంగానే.

'అంతటి దారుణమైనపని చెయ్యక్కర్లేకుండా మనం మర్యాదగా బయటపడేమార్గం నేను చెప్పింది ఒక్కటే—అడిగిన వాళ్లందరికీ సమాధానం చెప్పటానికీ, మన పాపాన్ని ప్రక్షాళనం చేసుకోటానికీ కొన్ని పుణ్యక్షేత్రాలు కూడ దర్శిద్దాం...'

సుజాత కళ్లవెంట తెగిన ముత్యాల చేరులా అశ్రువులు జారి పడుతున్నాయి. 'పోనీ నేనీపాపని పెంచుకుంటేనో' అంది అమాయికంగా చూస్తూ.

'ఏమిటి? దీన్ని పెంచుకుంటావా, నలుగురూ నవ్విపోరూ—ఇంక పెళ్లి పేరంటం...'

'అమ్మా! అదిమాత్రం నావల్లకాదు—నా ఇష్టా ఇష్టాలతో ప్రమేయంలేకుండానే నాజీవితం మలినం అయిపోయింది—వివాహం చేసుకునే యోగ్యతని నే నానాడే కోల్పోయాను—ఈ పాప సమస్య తల ఎత్తక ముందే నే నా నిర్ణయానికి వచ్చేశాను—అందుకే మనస్సు కుదురు లేకపోయినా, చదువు మీద ఏకాగ్రత కుదరకపోయినా, అంత పట్టుదలగా చదివి పరీక్షలకి వెళ్లా. ఎలాగో ఆ డిగ్రీ చేతికి వచ్చేస్తే ఇంక నా బ్రతుకు నేను బ్రతకగల ననిపించింది కాని అలా గుట్టుగా బ్రతికే అవకాశం కూడ లేకుండా పోయింది—పాప పుట్టుక నాకు సంతోషాన్ని ఇవ్వకపోయినా, అందరి తల్లులలాగే నవమాసాలూ మోశాను, ప్రసవ వేదన అనుభవించి కన్నాను...'

'అందుకని దీన్ని పెంచుతానంటావు—పాప తండ్రి ఎవరు అని అడిగినవాళ్లకి ఏమని సమాధానం చెప్తావు...'

'పాప ఎక్కడో దొరికిందని చెప్తాను' ఆ సమస్యని సులభంగా పరిష్కరించేయగల మన్నట్లు చెప్పింది సుజాత.

'నువ్వుచెప్తే నమ్మే దెవరు? ఈ పాప నీ బిడ్డే అని వూహించుకోటానికి నలుగురూ నాలుగురకాల కథలు కల్పించటానికి ఎంతోకాలం పట్టదు — నీమీద ఎవ్వరికీ ఎలాంటి గౌరవం వుండదు. అవకాశం వస్తే నిన్ను అవమానించాలని చూస్తారు—ఆ జీవితం ఎంత దుర్భరమో నువ్వు ఇప్పుడు వూహించుకో లేవు—ఈ సంఘం నీకు ఎలాంటి రక్షణా ఇవ్వదు. సానుభూతి అంతకన్నా చూపించదు—వీలయితే ఇంకా ముళ్ల కంచెలలోకి విసిరేయాలనే చూస్తుంది...' ఒకేధోరణిగా తల్లిచెప్తున్న మాటలు వింటున్న కొలదీ సుజాతకి భవిష్యత్తు మరీ భయంకరంగా అనిపించ సాగింది. చివరికి మెల్లగా అంది. 'నీ ఇష్టమే కానీ అమ్మా — కాని ఇక్కడా అక్కడా ఎందుకు ఏ కుక్కలయినా పీకి చంపేస్తాయేమో— ఏ అనాధ శరణాలయం లోనే వదిలి పెడితే, బ్రతికి వుంటుంది అనే ఆశయినా వుంటుంది — దీనికి నువ్వేమీ అడ్డు చెప్పకు.' కన్నీళ్లతో ప్రాధేయపడుతున్న కూతురు మాటలకి మీనాక్షమ్మ ఏమీ అనలేక పోయింది.

ఓ సారెప్పుడో చూసిన శిశు శరణాలయం దృష్టిలో పెట్టుకునే సుజాత ఆ మాట అనగలిగింది—

# సుజాత

స్కూల్లో చదువుకునే రోజుల్లో వో ఏడు క్రిస్‌మస్ శలవల్లో కొంత మంది పిల్లలూ టీచర్లూ కలిసి టూర్ ప్రోగ్రాం వేసుకున్నారు — హైదరాబాదు, అటునుంచి ఎల్లోరా అజంతా అన్నీ చూసి రావాలని—అప్పటికి అచ్చమ్మగారు బ్రతికే వుంది—వయసొచ్చిన ఆడపిల్లని అలా ఇక్కడికీ అక్కడికీ పంపించటం ఏమిటని ఆవిడ కేకలు కూడా వేసింది—'ఆడ పిల్లల స్కూలే కనక మొగపిల్లలు అల్లరి చెయ్యటం ఆ గొడవ లేవీ వుండవుకాని, అయినా ఏమిటో అంతదూరం' అంటూ నసిగేసింది మీనాక్షమ్మ.

'మరేం ఫరవాలేదు—ఈ అమ్మాయిల అరికాల్లో ముల్లు గుచ్చుకోకుండా క్షేమంగా తిరిగి మనకి అప్పగించటానికి ముగ్గురో నలుగురో పంతులమ్మలు కూడ వుంటారు — చాలా సరదాగా వుంటుంది—ఇలాంటి విజ్ఞాన యాత్రలే విద్యార్థుల మానసిక వికాసానికి దోహదం చేస్తాయి—మనం అన్నింటికీ భయపడితే ఎలా.' అంటూ నచ్చచెప్పాడు రంగనాథంగారు.

సులోచనా టీచర్‌వాళ్ల అత్తయ్య కూతురు హనుమాయమ్మగారు హైదరాబాదులో ఓ శిశు శరణాలయం సూపరింటెండెంటు. ఆవిడ్ని చూడటానికి వెళ్తూ సులోచనా టీచర్ సుజాతనికూడ తీసుకు వెళ్లింది—హనుమాయమ్మగారు వుండేది కూడ హోమ్‌లోనే — ఆవిడ సులోచనా టీచర్‌ని చూసి చాలా సంతోషించింది—సుజాతతోకూడ ఎంతో చనువుగా మాట్లాడింది— కాఫీ ఫలహారాలు అంటూ చాలా అట్టహాసం చేసింది—ఆ తరువాత వీళ్లకి హోమ్ అంతా తిప్పి చూపించిందావిడ—అదంతా జరిగి అయిదు సంవత్సరాలు కావస్తున్నా ఆ హోమ్‌ని గుర్తుపట్టగలనని పించింది సుజాతకి. రాత్రి బయలుదేరి చీకటి తెల్లవారకుండా రైలుదిగిన వాళ్లు సామాను వెయిటింగ్ రూమ్‌లో పడేశారు... పాపకి పుట్టినప్పటినుంచీ పోతపాలే అలవాటు చెయ్యటంవల్ల పాలుకలిపి కడుపు నిండా పట్టింది సుజాత—స్టేషను బయటకువచ్చి టాక్సీ తీసుకున్నారు— హోమ్ పేరు చెప్పకుండా దానిదగ్గరలోవుండే మరో గుర్తు చెప్పింది సుజాత. అక్కడ టాక్సీ దిగి వాడికి డబ్బుఇచ్చి పంపేసి తలమీదుగా కొంగు కప్పుకుని గబగబవెళ్లి పాపని శరణాలయం గేటుముందు పడుకోబెట్టి మళ్లీ స్టేషనుకి వచ్చేశారు—కొన్ని కొన్ని భయంకరమైన పరిస్థితులు ఎదురయినప్పుడు తెగువ మొండితనం దానంతటదే వస్తుంది తాత్కాలికంగానైనా.

మీనాక్షమ్మ హృదయం ఎంత వ్యథితంగా వుందో సుజాత హృదయం అంత అల్లకల్లోలంగా వుంది— 'ఏమిటది— ఆ పాప అంటే తనకి ఇంత మమతా మమకారం వున్నాయా—దాన్ని విడిచి పెట్టటం తనకింత బాధగా వుంటుందనే వూహయినా తనకి అప్పుడు రాలేదు...'

మౌనంగా ఎటో చూస్తూ కూర్చున్న కూతురిని ఉద్దేశించి అంది మీనాక్షమ్మ 'ఇప్పుడింక ఎక్కడికి వెళ్దాం...'

'నేను ఎక్కడికీ రాలేనమ్మా — ఏ పుణ్యక్షేత్రాలూ దర్శించుకోవాలని లేదు— ఇక్కడే ఏదయినా ఉద్యోగం చూసుకుంటాను — కావలిస్తే నువ్వు మన వూరు వెళ్లిపో...'

కూతురు ధోరణికి ఆవిడ కొంత విస్తుపోయినా అప్పటి ఆమె మనస్థితిని అర్థం చేసుకుని వూరుకుంది—

కాస్సేపటి తరువాత 'ఇల్లేదయినా దొరుకుతుందేమో చూస్తాను,' అంటూ బయలుదేర బోయిన కూతుర్ని చూస్తే ఆవిడకి నిజంగానే భయం వేసింది. 'స్వంత ఇల్లు, వూరు వదులుకుని అక్కడ వుండటం ఏమిటి—పద ఇంటికే వెళ్లిపోదాం చిన్నగా. నీకు జబ్బు చేసిందనీ నీరసంగా వున్నావనీ నేను అందరికీ చెప్తాను— ఆ ఉద్యోగం ఏదో కొన్నాళ్లు అక్కడే చేద్దువుగాని' అంటూ నచ్చచెప్పబోయింది.

'వద్దమ్మా— అక్కడ మన వాళ్లంతా నా పెళ్లిని గురించి ఒకటే గొడవ చేస్తారు— నేను వాళ్ల మధ్య బ్రతకలేను.' అని వెళ్లిపోబోతున్న కూతుర్ని ఆవిడా అనుసరించింది విధిలేక. మధ్యాహ్నానికి వో యింట్లో చిన్న భాగం కుదుర్చుకున్నారు అంత అనుకూలంగా లేకపోయినా.

కూడ తెచ్చుకున్న సామాను, బజారు నుంచి కొనితెచ్చుకున్న వస్తువులూ అన్నీ

పర్చుకుంటోంది మీనాక్షమ్మ.
కిటికీ దగ్గర నిలబడి వీధిలోకి చూస్తున్న సుజాత ఆలోచనలు మరెక్కడో తిరుగుతున్నాయి.
'తరువాత వాళ్ళు ఆ పాపని చూసి వుంటారా, ఎలా వుందో' అని మనసు ఆరాటపడిపోసాగింది. ఒక్కసారి వెళ్ళి చూసి వస్తేనో అన్న కోరికని అరికట్టుకోటం సాధ్యం కాలేదు.
'ఇప్పుడే వస్తాను' అంటూ చెప్పులేసుకుని వీధిలోకి వెళ్ళింది.
స్కూలునించి వచ్చిన పిల్లలతో ఖబుర్లు చెప్తూ, అంతకన్న చిన్నపిల్లల మాటలు వింటూ, మరీ పసివాళ్ళ బోసి నవ్వులకి మురిసిపోయి జాలిగా వాళ్ళ బుగ్గలు నిమురుతూ వాళ్ళందరి మధ్యా వుంది హనుమాయమ్మగారు ఆయాలతో పాటు.
నమస్కారం పెడుతూ లోపలికి రాబోతున్న సుజాతని అవతల ఆఫీసు రూంలో కూర్చోమని చెప్పింది హనుమాయమ్మగారు. కాని ఆవిడ మాటలు పూర్తి కాకుండానే—
'నేనండీ సుజాతని, అప్పుడు సులోచనా టీచర్‌తో వచ్చాను—మర్చిపోయారా' అంటూ కాస్త చొరవగా లోపలికే వెళ్ళింది.
గుర్తు తెచ్చుకోటానికి ప్రయత్నిస్తున్న దానిలా ఒక్కక్షణం రెప్ప వాల్చకుండా చూసి—
'ఓ నువ్వా అమ్మా — ఏమంటుంది మా సులోచన' అంటూ అభిమానంగా ఖబుర్లలో దిగింది ఆవిడ.
'నేను కాలేజీలో చేరాక ఆవిడ్ని కలుసుకోటం అంతగా పడలేదండీ — ఎప్పుడో ఏడాదిక్రితం చూశాను — ఈ మధ్య మా నాన్నగారు పోయారు—'
'అయ్యో పాపం — ఎన్నాళ్ళయింది.' అంటూ సానుభూతి చూపించింది హనుమాయమ్మ.
'ఇంకా ఏడాది కాలేదు—అమ్మ ఎప్పుడూ అదే తలుచుకుని ఏడుస్తూంటే నాలుగు పుణ్యక్షేత్రాలు దర్శించుకుందాం రమ్మని తీసుకొచ్చాను—నా కిక్కడేదయినా వుద్యోగం చూపించ గలరేమోనని వచ్చాను.' తను వచ్చిన కారణం ఏదైనా చెప్పాలనిపించటమే కాకుండా, ఆవిడ సహాయంవల్ల ఉద్యోగం దొరుకుతుందేమోనన్న ఆశ కూడ కలిగింది.
'ప్రస్తుతం మా శాఖలో ఏమీలేవు — ఏదైనా అవకాశంవుంటే చెప్తాలే' అని కొన్ని ఎడ్రసులు ఇచ్చింది ప్రయత్నం చేసుకోమని.
మాట్లాడుతూ ఆవిడవెంట హాలంతా తిరుగుతున్న సుజాత ఓ వుయ్యాల తొట్టి దగ్గర చటుక్కున ఆగిపోయింది.
'ఇవాళ ప్రొద్దుటే గేటుదగ్గర దొరికింది' అంది హనుమాయమ్మ.
'చేతికి ఈ తాడేమిటి' అంది సుజాత అమాయకత నటిస్తూ.
'ఆ అభాగ్యురాలు పిల్లని వదిలేస్తూ కూడ మమకారం చంపుకోలేక రక్ష కట్టిందనుకుంటాను — ఏదయితేనేం, దానంతట అది చీకిపోయేదాకా తియ్యొద్దను కున్నాం. అందావిడ
'అది రక్షకాదు—అది గుర్తుగాపెట్టుకుని తరువాత ఆపిల్లని చూడాలి అనే కోరిక ఆ సమయంలో అంతగా లేకపోయినా ఎందుకో సుజాతకి అలా చెయ్యాలనిపించిందని హనుమాయమ్మగారికి చెప్పేవారెవరూ లేరు.
'ఇది లేకపోయినా పాపని గుర్తుపట్టటం ఇక్కడ ఏమంత కష్టం అయేదికాదు.' అనుకుంది సుజాత తనివితీరా పాపని చూసుకుంటూ.
'చక్కగావుంది కదూ' అంది తను చాలాసేపు మౌనంగావుంటే బాగుండదనిపించి.
'ఎలావుంటేనేం—తల్లి తండ్రుల ఒడిలో పెరిగే అదృష్టం ఈపాపకి, దీన్ని పెంచుకునే అదృష్టం వాళ్ళకి లేకపోయాక' విరక్తిగా నిట్టూర్చిందావిడ. సుజాత తలవంచుకుని పాపబుగ్గలు నిమురుతూ వుండిపోయింది.
'ఎక్కడికి వెళ్ళావమ్మా' అని అడిగింది ఇంటికివచ్చిన కూతుర్ని మీనాక్షమ్మ.
'ఇదివరకు వచ్చినప్పుడు ఒకావిడ పరిచయం అయిందిలే — ఉద్యోగం ఎక్కడయినా దొరుకుతుందేమో అడుగుదామని వెళ్ళాను. ఏవో కొన్ని ఎడ్రసులు ఇచ్చింది.' అంది.
ఆ తరువాత అప్పుడప్పుడు వెళ్ళి హనుమాయమ్మగారితో మాట్లాడి పాపని చూసి వస్తూండేది—వాళ్ళు పాపకి జ్యోతి అని పేరుపెట్టారు.
'నేనింక పెళ్ళి ఎలాగా చేసుకోను—అలాంటప్పుడీ పాపని వదులుకోటం ఎందుకు—కొన్నాళ్ళు పోయాక నేనే తెచ్చి పెంచుకుంటాను — వాళ్ళు అడిగినంత డబ్బు ఇస్తాను—నా సంపాదనలో కొంచెం కొంచెం జాగ్రత్తగా కూడబెడతాను. అవసరం అయితే ఆ వూళ్ళో ఇల్లు అమ్మి పారేసి పూర్ణయ్యగారి అప్పు తీర్చేసి మిగిలింది కూడ పాప కోసం బ్యాంకిలో వేస్తాను...' అని ఆలోచిస్తూండేది సుజాత.
కాని మీనాక్షమ్మగారికి విషయాలేవీ తెలియదు పాప వెడదవదిలిపోయినందు కావిడ స్థిమిత పడింది — అందరూ అమ్మాయి పెళ్ళెప్పుడు అని అడుగుతూంటే మీ ఎరుకలో ఎవ్వైనా సంబంధం వుంటే చెప్పండి అని వాళ్ళతో చెప్పేది. తల్లి తన దగ్గర ఆ ప్రస్తావన తీసుకొచ్చినప్పుడల్లా సుజాత చిరాకు పడిపోవటం. మరోసారి చెప్తే కళ్ళ నీళ్ళు పెట్టుకోటం పరిపాటయిపోయింది—పెళ్ళయి, నీ సంసారం అంటూ ఏర్పడితే గతం దానంతట అదే మరుపుకు వస్తుంది అని నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తూండేది ఆవిడ—అసలు ఎప్పటికయినా కూతురు మనస్సు తిప్పుకుంటుందా, భర్త పిల్లలూ అంటూ సంతోషంగా బ్రతకగలుగుతుందా అని లోలోపల కుమిలి పోతూండేది — ఆ దిగులుతోనే ఆవిడ ఆరోగ్యం పాడయిపోయింది— హటాత్తుగా పరిస్థితి విషమించటం, ఆస్పత్రిలో ఆమె మనస్సులో బాధ వెళ్ళబోసుకోవటం, సుజాత అంటే అభిమానం పెంచుకున్న శ్రీధర్ తన మనస్సు విప్పి చెప్పటమే కాకుండా, దుఃఖంతో విలవిల్లాడి పోతున్న ఆమె చేతిని అతను ఆదరంగా తన చేతిలోకి తీసుకోటంతో తన కళ్ళ ఎదుటే కూతురి వివాహం జరిగిపోయింది అన్నంత ప్రశాంతంగా కళ్ళు మూసిందావిడ.
కాని సుజాత మనస్సు ఎటూ తేల్చుకోలేని సంకట పరిస్థితిలో కొట్టుకులాడిపోయింది.
'నా శరీరం అపవిత్రమయి పోయింది—ఇంకొకరిని మోసం చేసే సాహసం నేను చెయ్యలేను.' అని ఎన్నోసార్లు దృఢంగా అనుకుని, ఓ నిర్ణయానికి వచ్చినా, శ్రీధర్ వ్యక్తిత్వం, అనురాగం, ఆపేక్ష క్షణంసేపు ఆమె హృదయం ఆమెకే తెలియని విధంగా స్పందించి ఒక దివ్యానుభూతితో పరవశించిపోయేలా చేసేవి.

(ఇంకా ఉంది)




# మతసామరస్యం

బులుసు వేంకటరమణయ్య

మానవ ప్రకృతిని మూడు విధాలుగా వేరు చెయ్యవచ్చు. కొందరి దృష్టిలో భగవంతుడు లేడు. కొందరు బయటికి దేవుడులేడని చెప్తూ వున్నా వాళ్ల మనస్సుల్లో దేవుడు ఉన్నాడేమో అనే సందేహమూ, లేడని బయటికి చెప్పినందువల్ల భీతాహమూ వారి మనస్సును పీడిస్తూ ఉంటాయి. కొందరికి దేవుని అస్తిత్వంలో పూర్తి నమ్మకం వుంటుంది.

మత విషయంలోనూ యిదే తీరు!

కొందరు మతాన్ని పాటించరు. కొందరు తాము మతాన్ని పాటించమని చెప్తుంటూ, లోలోపల అయినా మత ధర్మాలను పాటిస్తూనే వుంటారు. కొందరికి మతంపైని పూర్తి నమ్మకం వుంటుంది.

ప్రపంచంలో ఎన్నో మతాలు వున్నవి. మతాలపైని నమ్మకం వున్నవాళ్లూ, లేనివాళ్లూ అన్ని దేశాలలోనూ వున్నారు. మతంపై విశ్వాసం ఉన్నవాళ్లకు దేవుడిమీద కాని, లేదా ముక్తిపైనిగాని విశ్వాసం వుండి తీరుతుంది. హైందవులకు వలెనే మహమ్మదీయులకూ, క్రైస్తవులకూ కూడా దేవునిపై విశ్వాసం వున్నది. ఆ దేవుని అనుగ్రహం వల్ల మోక్ష ప్రాప్తి కలుగుతుందని వారి అభిప్రాయం. దేవుణ్ని అంగీకరించని జైన, బౌద్ధాది మతాంతరులు నిర్వాణాన్ని విశ్వసిస్తారు. ఎవరు ఏ పేరు పెట్టుకున్నా గమ్యం ఒక్కటే!

అందరూ భగవంతుని దగ్గర నుండి వచ్చినవారే అనిన్నీ, లౌకిక సంబంధాలతో కొట్టుమిట్టాడుతూ, యీ లోకంలో ఎన్నో కష్టసుఖాలు అనుభవించినా చివరకు భగవంతుడిలో చేరవలసే వుంటుందనిన్నీ అందరి యొక్క అభిప్రాయం.

వివరించి చెప్పాలంటే — సృష్టియావత్తూ ఆవరించివున్నవాడు భగవంతుడు పరమాత్మ-ఆ భగవంతుని విలాసమైన సృష్టి చరాచరాత్మకములైన అనంతకోటి జీవరాసులతో కూడివుంటుంది. ఈజీవరాసుల్లో వుండే జీవాత్మ పరమాత్మనుండి వచ్చి వేరుగా ఏర్పడినదేగదా! ఆ జీవాలు జన్మాంతర వాసనలవల్ల అనేక కష సుఖాలను అనుభవిస్తూ, చివరకు జన్మరాహిత్యం పొంది పరమాత్మలో లీనమయ్యేస్థితే ముక్తి.

జీవాత్మకూ, పరమాత్మకూ వుండే సంబంధంలో అభిప్రాయభేదాలు కానవస్తున్నవి. కొందరు జీవాత్మ పరమాత్మ యొక్క రూపభేదమని అంటారు. కొందరు పరమాత్మయొక్క అంశ అని అంటారు. ఈ రెండిటికీ బింబ ప్రతిబింబ భావసంబంధమని కొందరి అభిప్రాయం. ఆయా జిజ్ఞాసువుల సాధనలలోని వైవిధ్యంవల్ల ఇలాటి భేదాలు ఏర్పడ్డాయిగాని ఫలితాంశం ఒక్కటే!

జీవుడు ముక్తిని పొందడానికి సాధన అవసరం. ఆ సాధనమార్గాలను నిరూపించడానికే మతం ఏర్పడింది. ఆ మతం ఏ దేశానికి చెందినా, ఏ పద్ధతిని అనుసరించినా భగవంతుని చేరడమే పరమార్థం.

మతాలన్నీ సదుపదేశాలే చేస్తాయి. చెడ్డను ప్రోత్సహించవు. మతాలపేరు చెప్పుకొని, పరస్పరం అనవసరంగా ద్వేషాలు పెంచుకొని కలహించడం ఏ మతకర్తకూ సమ్మతం కాదు. ఒకే లక్ష్యంగల మతాలన్నీ సమైక్యాన్ని సాధించి, లేనిపోని ద్వేషాలు పెట్టుకోక ప్రజాభ్యున్నతికి పాటుపడడం శ్రేయస్కరం!



# ఫోస్ఫోమిన్ శక్తిని పెంపొం దించును, ఆకలిని అధికముచేయును, సహనశక్తిని హెచ్చించు-ను శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువచేయును




అవును —,
కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్ గ్లిసరోఫోస్ఫేటులుగల ఆపవచ్చుని పండ్ల రుచిగల టానిక్.

SQUIBB® TTT® ® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్. ఇన్కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు

SARABHAI CHEMICALS

shilpi sc 49/67



# వార్

ఎమ్ ఆర్ ప్రసాద్

ఆవిడ చాలా కలుపుగోరు మనిషి.

ఇట్టే మాటలు కలిపెయ్య గలదు.

మధ్యాహ్నం రెండింటివేళ అణగిపోతున్న పెళ్లి హడావిడిని గుర్తుచేస్తూ, సుడిగాలిలా దూసుకు వచ్చింది విడిది ఇంట్లోకి.

"మరదిగారూ, ఇవాళ వెళ్లిపోతున్నాం. స్టేషన్ దాకా డ్రాప్‌చెయ్యాలి మీ కారులో" అంది.

సాలోచనంగా మాలతి వేపు చూసాను.

అచింతా తన ప్రయోజకత్వమేనన్నట్లు దరహాస చంద్రికలను విరజిమ్ముతుంది భార్యామణి! నిజానికి నాకు కాస్త చిరాకు వేసింది. క్రొత్తగా కారుకొన్న విషయం బంధువులందరిలోనూ చాటింపు వెయ్యాలన్న మాలతి ఉబలాటం నచ్చలేదు. అసలు పెళ్లికి కారులో ఎందుకు వెళ్లాలి, అంటే మాలతి మూతి మూడుచుట్లు త్రిప్పి, "ఆహాఁ మా తమ్ముడిని, పెళ్లికూతుర్నీ అందులో కూర్చోబెట్టి ఏం ఊరేగించరు లెండి. దూరాభారం అని. కారుకొన్నది ఎందుకూ, మీరు ఆఫీసుకీ, క్లబ్‌కి వెళ్లటానికేనా?" అంటూ దెప్పి పొడిచింది.

"ఏమండోయ్ మరదిగారూ?" మరోమారు హెచ్చరించిందావిడ.

"అలాగేనండీ—తప్పకుండా" అన్నాను.

ఒక్క చిరునవ్వు విసరి మళ్లీ సుడిగాలిలా వెళ్లిపోయింది. ఆ సుడిగాలి వెంట రేగిన కాగితంముక్కలా "అక్కయ్యగారూ.... మరే....." అని దీర్ఘం తీస్తూ మాలతికూడ బయటికి ఉడాయించేసింది.

నవ్వుకుంటూ మంచం మీద వాలిపోయాను. ఆడవాళ్లెంత తొందరగా వరసలు కట్టెయ్యగలరు! మా ఆవిడ తమ్ముడి పెళ్లికి ఓరోజు ముందుగా ఈ ఊరికివచ్చాం. పురాతనపు కోటగోడలు. రహస్య ద్వారం, ఖిల్లా, కొండమీది నరసింహస్వామి దేవాలయం ఇత్యాదులు ఒక్కరోజేలోనే 'ఆవిడ' సహాయంతో దర్శించివేసింది మాలతి. అప్పటి నుండి ఈ వరుసలూ, అనుబంధాలూను. ఈ 'అక్కయ్య' గారి చలవేమిటోగాని, బాబిగాడు మటుకు నా భుజస్కంధాల పైనుంచి దిగటం లేదు. పెళ్లికొడుకు అక్క దర్జా వదలి మాలతి మాత్రం, విడిది ఇంట్లోని నన్నూ, బాబిగాడిని ఖాతరు చేయక ఆడపెళ్లివారిలో చేరిపోయింది. ప్రతిపనిలోనూ అక్కయ్య, మాలతులదే పైచేయి. పెళ్లి హడావిడిని మరింతచేసి వదిలారు. ఆఖరుకు పెళ్లి కొడుకు తాళి కడుతున్న సమయంలో పెళ్లికూతురు పూలజడని అక్కయ్యగారు అలవోకగా ఎత్తిపట్టుకుంటే, మాలతి కెమరా క్లిక్కుమనిపించింది. అటుతరువాత ఆ నవదంపతుల మోహానవున్న సంతృప్తికంటే మించిన తియ్యటి భావనల నొలకబోస్తూ ఒకళ్లకేసి ఒకళ్లు చూసి నవ్వుకున్నారు.

మాలతి మొహంలో అప్పటికాంతి మా పెళ్లి జరిగిన క్రొత్తల్లోని రోజులని గుర్తు చేశాయి. తియ్యటి అనుభూతులను నెమరువేస్తూ నవారు మంచంపై సుఖంగా మేనువాల్చినన్ను ఆ అనుభతుల తాలూకు ఆకృతియైన బాబిగాడు ఒక్క ఊపు ఊపి కదిలాడు.

"నాన్నోయ్—కత్తులు" అంటూ.

"కత్తులేమిట్రా?" అన్నాను.

"మరేం సినిమాలో మనం చూడలా?— యుద్ధం చేసే కత్తులు నాన్నా—పెద్దవి! కర్రల్లోవున్నాయి.."

ఫారెస్టు రేంజర్‌గారి ఇంటిని మాకు విడిది ఇల్లుగా ఇవ్వటం ఎంత ప్రమోదమూ అర్థమైంది. నారాయణమూర్తిగారు చేతికర్రల్లోని కత్తులను ఉదయం పిల్లలముందు ప్రదర్శించిన పైనం ఇది. సామాన్లకొట్లో పడేశారు వాటిని తరువాత. వీళ్లకు అందుబాటులో లేకుండా వుంచాల్సింది.

"నేనూ, సూరి పెరట్లోకి వెళ్లి యుద్ధం చేశాం నాన్నా. 'కచ్' మని మునగచెట్లో దిగబడింది. ఆ మాపాలాయన వచ్చి లాగేసుకున్నాడు....."

మిసాలాయన అంటే నారాయణమూర్తిగారు. సూరి అంటే 'అక్కయ్య'గారి కుమారుడు.

"దెబ్బలేం తగల్లేదుకదా?" విశితంగా పరికించాను బాబిని. ఆరేండ్ల వెధవని ఇంత గొప్పగా పెంచుకువస్తున్న మాలతికి మనసులోనే జోహారు ర్పిస్తూ.

"తల అడ్డంగా తిప్పాడు "ఉహూ..... సూరి బాగా యుద్ధం చేస్తాడునాన్నా. ఆ మిసాలాయన వచ్చి లాగేసుకోకపోతే సూరిని వోడగొట్టేద్దును. వాకలాంటి కత్తికొని యివ్వవూ?" అన్నాడు.

"కత్తులెందుకురా చిట్టితండ్రీ, పిస్టల్లేకొందూ గానిలే....." కన్నుకొట్టి నోరుజారాను.

ఇహ మొదలెట్టాడు మావాడు "పిస్టలంటే ఏమిటి? దీపావళి పిస్టలేనా?— చెక్కతుపాకీ వద్దు —కత్తులే—కావాలి" అంటూ.

వీడిగోలని నిభాయించుకోటం కష్టం. మాలతి వుంటే బాగుండేది. ఈవిడేమో అక్కయ్యగారివెంట వయనమైపోయె!— ఐస్క్రీం అనజూపితే 'కత్తులు' మరచిపోతానని సులువైన పరిష్కారాన్ని బాబిగాడే బోధించాడు. విడిదింట్లో కూర్చుని ఐస్క్రీం ఎవరికి అర్డరిచ్చేది? డ్రైవర్ వీరాస్వామిని తోడుయిచ్చి హోటలుకు పంపాను.

అరగంట తరువాత తిరిగివచ్చిన వీరాస్వామి మాలతి కోసం విడిదిల్లు గాలించేస్తూ "అమ్మగారూ..... అమ్మగారూ"అంటూ పొలికేకలు పెడుతున్నాడు. ఆ కేకలు ఆడపెళ్లివారి ఇంటిదాకా వినబడ్డయా అన్నట్టు తిరిగి వచ్చింది మాలతి.

వీరాస్వామికేసి భ్రూకుటి ముడివేసి చూసింది.

"ఇయేళ రోడ్లో కారు ఎల్లలేదండి"అన్నాడు వీరాస్వామి.

"ఎందుకూ?" అంది మాలతి.

"పోస్టాఫీసుకాడ యాపమాను రోడ్డుకడ్డంగా పడివుందండి. దాన్ని తీటానికి రాత్రిగ్గానీ కాదట. ఉన్నది ఒకటే రోడ్డు. మరోరాస్తాలేదండి అమ్మగారూ" అన్నాడు.

"అవుతే ఇవాళ మీ అక్కయ్యగారు వెళ్లలేదన్న మాట" అన్నాను.

నేనూహించినట్టు ఆవిషయం మాలతిని బాధించలేదు. పైపెచ్చు "పోనిద్దురూ ఇవాల్టికిఆవిడ ఇక్కడే వుండి పోతుంది. రేపు వెడతారు—చక్కటి కాలక్షేపం" అంటూ మురిసి పోయింది. అటు తరువాత పనికట్టుక బయలుదేరింది అక్కయ్యగారికీ వార్త చేరవెయ్యటానికి. అలా వెళ్లినామె రాత్రి భోజనాల తరువాతగాని తిరిగి కనబడలేదు.

"డాబామీద ఎడమవేపు భాగం ఖాళీచేసివుంచండి" అంటూ ఆర్డరొకటి విసిరేసింది.

"ఎందుకూ?" అన్నాను.

"రాత్రికి అక్కయ్యగారు వాళ్లు పడుకోటానికి ఇక్కడికే వస్తున్నారు"

నాకు నచ్చలేదా విషయం.

"అక్కడేమైంది? నువ్వు కావాలంటే అక్కడికే వెళ్లి పడుకోరాదూ? మీ ఆడమళయాళ మంతా ఇక్కడ చేరారంటే మేం నిభాయించుకోలేం" అన్నాను.

"ఫరవాలేదులెండి. అందరూ ఎవరున్నారు? అక్కయ్య, శ్యామల, నారాయణ మూర్తిగారి చిన్న చెల్లెలూనూ. అక్కడ అసలే హడావిడిగా వుంది. అందులోనూ కార్యం అదీ తలపెట్టుకున్నారా— పడుకోటానికి స్థలం వున్నా గోలెక్కువ. ఇవాల్టి కెలాగోలాగు సర్దుకోండి. నారాయణమూర్తిగారి చెవిలో కూడ ఓముక్క వెయ్యండి........" అంటూ మాయమైంది.

ఆడవాళ్లతో నెగ్గుక రావటం కష్టం. రాత్రి డాబాపై కుడివైపున పెద్ద జంపఖానాని పరచి రెండు తలగడలు విసరి వేశారు మాకు. ఎడమవేపు నాలుగు పక్కలు వేసుకుని, వాటిపై మల్లెపువ్వు లాంటి తెల్లటి దుప్పట్లు పరచుకుని తాంబూలం సేవిస్తూ కబుర్లు మొదలెట్టారు. పెళ్లిలో ఆడబడుచు కట్టిన కంజీవరం చీర బార్డర్ మొదలు రాజకీయాలదాకా, ఏక ధాటిగా ఊకదంపుడు మొదలైంది.

సూరి, బాబి అప్పుడే నిద్దర్లో పడ్డారు. నిద్రలో సైతం చిలిపిగా నవ్వుకుంటున్నాడు బాబి. నారాయణమూర్తిగారు పిట్టగోడకు చేరగిలబడి చుట్ట ముట్టించారు.

రాత్రి పదకొండు గంటలవుతూంది. తెల్లని వెన్నెల. డాబాకు అంటుకవున్న వేపచెట్టు పిల్లగాలులకు తల ఊపుతూంది. గాలి ధాటెక్కువైనపుడల్లా తెల్లని వేపపూత జంపఖానాపై రాలుతూంది. దిండుపై తలవాల్చి, వెల్లికిలా పడుకుని మబ్బుల చాటున దోబూచులాడుతున్న చందమామను చూస్తూండి పోయాను నేను.

అక్కయ్యగారి మృదుమధుర కంఠం ఈలగా కర్ణాలకు సోకుతూంది. మాలతి, ఆవిడ ప్రతి మాటకు అల్లనల్లన నవ్వుతూంది.

చుట్ట కాలుస్తున్న నారాయణమూర్తిగారు చుట్ట విసరేశారు. హటాత్తుగా వాళ్లవేపు తిరిగి అక్కయ్య గారిని ఉద్దేశిస్తూ "మీ సూరి, వీళ్ల బాబీ ఇవాళ కత్తియుద్ధం చేశారండోయ్" అన్నారు.

ఆడవాళ్ల దృష్టి అంతా ఇటు తిరిగింది. కబుర్లన్నీ సూరి, బాబీల కత్తియుద్ధం మీదికి మళ్లింప బడ్డాయి. వివరాలు చెప్పమని నారాయణ మూర్తిగారికి ఆదేశం అందింది. బాబి నాకు చెప్పిన విషయానికి ఆయన వాక్చమత్కృతి కలిపి హాస్యంగా సవివరంగా ఇతివృత్తాన్ని అందించారు నారాయణమూర్తి.

అక్కయ్యగారు ఫక్కున నవ్వేశారు. "కుర్రాళ్లలో వున్న గొప్పతనం అదేనండోయ్. జీవితాన్ని అనుభవించటం వాళ్లకు బాగా తెలుసు. పెద్దయ్యాక మనం ఇలా 'సినికల్'గా తయారవుతాం. ఆ ఉత్సాహం, ఊపు, ఆనందం కోరుకున్నా రావు. ఒహవేళ వచ్చినా, సంఘటనలోని మధురిమ గోచరించదు మనకు. అంతా పేలవంగా, రసహీనంగా కనబడుతుంది" అందామె.

మాఆవిడ వెంటనే వత్తాసు పాడేసింది "అవునండోయ్ అక్కయ్యగారూ—చిన్నతనం ఎంత బాగుంటుంది! పెద్దయ్యేకొద్దీ ఎంచేతో హుషారు చచ్చిపోతూంది. పెళ్లయ్యాక మరీ డల్గావుందనుకోండి" —నామీదో విసురు! నవ్వుకున్నాను.

అక్కయ్యగారు మందస్మితం చేశారు. "మీరలా అనరాదు. హుషారు వేరు—ఉత్సాహం వేరు. హుషారుగా లేకుంటే ఆ తప్పు మనదే. ఉత్సాహమన్నది మటుకు మనస్సుకు సంబంధించినది. కుర్రవాళ్లు నిష్కల్మష హృదయులు కాబట్టి వాళ్లెప్పుడూ ఉత్సాహంగా వుంటారు" అంది.

మాలతి మాట్లాడలేదు.

ఆవిడే అంది మళ్లీ "ఒక రకంగా ఆలోచిస్తే చిన్నతనం అన్నది మానవ జీవితానికోవరం. కొందరి పట్ల అది శాపంగా కూడా పరిగణిస్తుంది ఒక్కోసారి. పసిహృదయాలపై పడ్డ అనుభూతుల తాలూకు ముద్రలు ఎన్నటికీ చెరిగిపోవు. వాటికనుబంధంగా సుఖదుఃఖాలు మటుకు జీవితమంతా వెంటాడుతూనే వుంటాయి"అని.

"మీరంటున్నది నాకు అర్థం కావటం లేదు" అంది మాలతి.

చిన్నగా నవ్వింది ఆవిడ "వివరంగా చెప్పమంటారా? కథ అనుకోరుకదా?"

"లేదు—లేదు. చెప్పండి" అంది మాలతి.

నారాయణ మూర్తిగారు మళ్లీ చుట్ట ముట్టించారు. బాబి ఇటు పొరలి పడుకున్నాడు. నవ్వని గాలికి మరింత వేపపూత రాలిపడింది. మబ్బుల చాటునుండి వెలికి వచ్చాడు చంద్రుడు. తెల్లని వెన్నెల్లో అక్కయ్యగారు దేవకన్యలా గోచరించారు నాకు.

* * *

జీవితాలకు, నవలలకు ఒక మహత్తరమైన భేదం వుంది. మొదలు, తుది వుంటుంది నవలకు. పుట్టుక, చావు తీస్తే జీవితాలు ఎప్పుడు ఎక్కడ మొదలెడతాయో, ఏ రకంగా ముగుస్తాయో తెలీదు. అసలు మొదలు, ముగింపు వుండవు ఒక్కోసారి. కేవలం ఘటనాత్మకంగా మిగిలిపోతుంది. సంబంధం లేని సన్నివేశాల సినిమారీలులా గోచరిస్తుంది మరోసారి. అవుతే వీటివల్ల కలిగే అనుభూతులు మటుకు చిత్రమైనవి.

అందుకే నాకు రామంతో ఎప్పుడు పరిచయం అయిందో గుర్తులేదు. కానీ, పరిచయం ప్రగాఢమైన స్నేహంగా పరిఢవిల్లటం మటుకు గుర్తుంది. నాకప్పుడు తొమ్మిదేళ్లు వుంటాయేమో. రామం నాకంటే రెండేళ్లు చిన్నవాడు. మా ఎదురింటి వారి అబ్బాయి అతను.

నాకు అన్నదమ్ములు లేరు. తోటి స్నేహితురాళ్ల ఇళ్లలో వారి తమ్ముళ్లను చూస్తూంటే అర్థంకాని వెలితి వేసేది. ఆ చిన్న అబ్బాయిల నవ్వులు, చిలిపి చూపులు, తగవులు, ముద్దు మాటలు నన్నెంతో కలవర పెట్టి నాకూ వో తమ్ముడుంటే బాగుండు నన్న భావనని మరింత అధికం చేశాయి. ఆ తమ్ముడు నాకు రామంలో కనుపించాడు. నేనూ చిన్నదాన్నే. స్వార్థ రహితమైన మా స్నేహలత చిగురులు తొడిగి పుష్పించటానికి ఆట్టేకాలం పట్టలేదు. రామం చాలా తమాషా అయిన కుర్రవాడు. వయసుకి మించిన తెలివి తేటలుండేవి. "మా అబ్బాయి పెద్దవుతే కలెక్టరవుతాడు" అంటూ వాళ్ల అమ్మ పొంగిపోయేది. ఒక్కడే అయిన వంశాకురాన్ని చూసి మురిసిపోయేవారు వాళ్ల నాన్నగారు.

నేను వీధి చివర ఎలిమెంటరీ స్కూల్లో అయిదో తరగతి చదువుతుండేదాన్ని. రామం మూడో తరగతి. ఇద్దరం కలిసి బడికి వెళ్లేవాళ్లం. రామానికి మూడు చక్రాల సైకిలొకటి వుండేది. నేను వెనక వేపు నుంచుంటే చకచకా తొక్కుకు పోయేవాడు బడికి.

అన్నం, నిద్ర తప్పితే అన్నీ రామం ఇంట్లోనే జరిగి పోయేవి నాకు. వాళ్ల అమ్మ నాన్నగారికి సైతం ఎనలేని ప్రేమ ఏర్పడ్డది నాపై. రామానికి ఆట వస్తువులు తెచ్చినపుడు, బట్టలు కుట్టించినపుడు నాకు కూడా ఏవో తెచ్చి పెట్టేవారు. అంతలేసి అనుబంధాలు ఏర్పడటానికి కారణం కూడ అవగాహన కాని వయసది.

లక్కపిడత ఆటలు, బొమ్మల పెళ్లిళ్లు అంటే సరిపోయేది కాదు రామానికి. "ఛీ! ఆడపిల్లల ఆటలు" అనేవాడు ఏడేళ్ల మగధీరుడు. నేను ఉడుక్కుని ఇంటికి వెళ్లిపోతే బాధనొందేవాడు. వాళ్ల అమ్మగారు వచ్చి బ్రతిమాలి తీసుకవెళ్లేది నన్ను.

"తమ్ముడు కదమ్మా— ఏదో అన్నాడే అనుకో. అలా కోపగించుకుంటే ఎలా?" అనేది అత్తయ్య. తరువాత ఇద్దర్నీ బంక్తిలో కూర్చోబెట్టి పెరుగన్నం ముద్దలు చేసి పెట్టేది ఆవిడ. అందులో నంజుకోటానికి వేసిన చింతకాయ పచ్చడి అంత హాయిగా వుండేవి రామం చూపులు.

"నా పెద్దకూతురై పోయిందండోయ్— మా ఇంట్లో వుంచేసుకోమా?" అని అత్తయ్య అంటే అమ్మ నవ్వేసి "ఇప్పుడు మటుకు క్షణం మా ఇంట్లో వుంటేగా?" అనేది. నా పుట్టిన రోజు పండుగ కూడ ఒకటి వాళ్ల ఇంట్లోనే జరిగి పోయింది.

రామంలో చక్కని నిర్మాణాత్మకమైన కళ వుండేది. అది గుర్తించిన వాళ్ల నాన్నగారు అందుకు తగిన పరికరాలని సమకూర్చేవారు. రంగు రంగుల పెన్సిల్‌తో గజా పలకపై రకరకాల బొమ్మలు చిత్రించేవాడు రామం. చాల రోజుల దాక రామం చిత్రించిన బాతు బొమ్మ ఒకటి నా దగ్గిర వుండేది.

ఒకసారి పెరట్లో క్రికెట్ ఆడుతున్నాం. రామం విసిరిన బంతి నుదురుకు వచ్చి తగిలింది. కళ్లు తిరిగి పడిపోయాను. తరువాత వారం రోజులు ఏక ధాటిగా జ్వరం! ఆ వారం రోజులూ రామం బడి మానేశాడు. నా మంచం దగ్గిరే కూర్చుని వుండే వాడు. అతని కళ్లలో కాంతి మాయమైంది. పది రోజులు ఉపవాసాలు చేసిన వాడిలా మొహం పాలిపోయి వుంది.

"నా మీద కోపం వచ్చిందా?" అనేవాడు పశ్చాత్తాప కంఠంతో.

లేదని అతన్ని నమ్మించటానికి ఎన్ని ప్రయత్నాలు చేశానో చెప్పలేను. మా అమ్మకూడ రామాని నాపైగల ప్రేమకి ఆశ్చర్యపోయేది. అత్తయ్య సైతం రామంతోపాటే నాకు సపరిచర్యలు చేయటంతో జ్వరం ఎలా వచ్చిందో అలాగే పోయింది. ఆటు తరువాతరోజు రామంవాళ్ల పెరట్లో సగం విరిగి పోయిన క్రికెట్ బ్యాట్‌ని చూశాను. బంతి పొట్ట చీలిపోగా అందులోని దారం బయటికి తొంగి చూస్తోంది. అప్పటి నుండి క్రికెట్ జోలికి పోలేదు రామం. ఈ సంఘటనతో రామంపై ప్రేమే కాకుండా, గౌరవ భావం అంకురించింది నాలో.

జీవన స్రవంతి సాగే పథం విచిత్రమైనది. మంచి, చెడు మలుపుల్లో సుఖదుఃఖాల ఎత్తుపల్లాల్లో లయలు వేస్తూ ముందు కురుకుతుంది. పచ్చిక బయళ్లలో హొయలు సల్పుతూ గలగలా పారు తుంది. మరు భూముల్లో చొచ్చుక పోతుంది మరో




సారి. సరిగ్గా అలాగే జరిగింది రామం జీవితంలో. ఏడేళ్ల అబ్బాయికి టి. బి. రావటం ఇవాళ్టికి సైతం విచిత్రంగా తోస్తుంది నాకు. అప్పట్లో నా కా జబ్బు పేరూ తెలీదు. అంటువ్యాధి అని రామం ఇంటికి నేను వెళ్లకుండా నాన్నగారు కట్టడి చేయటం మటుకు గుర్తుంది.

బొంగరంలా గిరగిరా తిరుగుతూ, నన్ను తన చుట్టూ త్రిప్పుకునే రామం నీరశించి పోయాడు. మునిసిపల్ పార్కులోని గులాబీలను నా కోసం చేజిక్కించుకుని, వెంటాడుతున్న తోటమాలిని నిముషంలో దాటుక వచ్చినప్పటిలాగ, అతని ఎడద ఆయాసంతో ఊగిసలాడేది. చిలిపిగంతులు ఆగి పోయాయి. మంచం— తప్పితే వసారాల్లో వేసిన పడక కుర్చీలో కూర్చుని వుండేవాడు..

ఆ ఊళ్లో, పెద్ద ఆస్పత్రులు లేవనుకుంటాను. లేక జబ్బు ప్రాథమిక దశలోనే వుందేమో—మొత్తానికి రామాన్ని ఏ ఆస్పత్రిలోనూ చేర్పించలేదు అతని తలిదండ్రులు. రోజూ డాక్టరు మటుకు ఉదయం ఎనిమిదింటికి వచ్చి ఇంజెక్షన్ యిచ్చి వెడుతూండే వాడు. సిరెంజిలోని మందును చూడటానికి డాక్టర్ వెలుగులో చేతిని పైకివెత్తితే సూదిమొన తళతళలాడుతున్న కత్తిని గుర్తు చేసేది. ఏమాత్రం కండలేని రామం చేతులు, తొడలు నిర్దాక్షిణ్యంగా ఆ సూదిపోట్లకు గురి అవుతూంటే అతని కళ్లలో తిరిగిన నీరు విలవిల్లాడించేది నన్ను. రాను రాను డాక్టరంటే అపరిమితమైన భయం పట్టుకుంది రామానికి. బిత్తర చూపులతో లోనికి పారిపో ప్రయత్నించేవాడు. వాళ్ల అమ్మ, నాన్న ఎంత బుజ్జగించినా అతనిలో ఆ భయం పోలేదు. ఆఖరుకు నాచే చెప్పించారు. తెలిసీ తెలియని జ్ఞానంతో రామానికి బోధించాను నేను, మందు పుచ్చుకోటం అతని మంచికేనని.

"నెప్పి వేస్తుంది రాజ్యం" అనేవాడు.

"కొంచెం నెప్పేగా. అదీ ఎన్నిరోజులు. మందు తీసుకుంటే నీకు వేగంగా నయం అవుతుంది. తరువాత మనం ఎంచక్కా ఆడుకోవచ్చు" అనే దాన్ని.

రామం కళ్ళలో కొద్దిగా ఆశ తొంగిచూసేది. పాలిపోయిన అతని పెదాలపై చిరునవ్వు విచ్చుకునేది. తనకు ఒంట్లో బాగయ్యాక ఏంచేయాలో చెప్పేవాడు. అంతచిన్న వయస్సులోనే చక్కని భావనాశక్తి వుండేది రామానికి. కబుర్లు చెబుతున్నపుడు అతనికళ్లు ఒలకబోసే కాంతులు ఎప్పుడూ నన్ను వెంటాడుతూనే వుండేవి. కాని నేను వెళ్లిపోగానే మళ్లీ అతనిలో ఉదాసీనత కనబడేదట.

"అమ్మాయ్, రాజ్యలక్ష్మి సీతమ్మొడిని నువ్వే కాపాడుకోవాలి" అంటూ అత్తయ్య కళ్లనీరెట్టుకునేది.

రామం నన్ను వదలి వుండటానికి సమ్మతించే వాడుకాదు. నేను కాసేపు కనుమరుగవుతే కలత నొందేవాడు. "అప్పుడే బడికి వెళ్లాలా రాజ్యం" అనే వాడు—దీనంగా. ఆవాక్యంలో నేను తనని వదలి బడికి వెళ్లిపోతున్నాననే భావం, తను బడికి రాలేక పోతున్నాడన్న భావన కలగాపులగంగా కనుపించి నన్ను బాధించేది. నన్ను తన దగ్గర వుంచుకోవా

అనే తాపత్రయంతో రామం తన అహాన్ని చంపుకో సాగాడు. "ఆడపిల్లల ఆటలు" అని ఏవగించుకునే వాడు "గచ్చనకాయలు ఆడదామా?—బొమ్మల పెళ్ళిళ్ళు చేద్దామా?" అనేవాడు. నేను వరండాలో బొమ్మల పెళ్ళిళ్ళు జరిపిస్తే పడకకుర్చీలో పడుకుని మౌనంగా తిలకించేవాడు.

నావల్ల రామానికి మానసికశాంతి లభిస్తోందని అత్తయ్య త్వరలో గ్రహించింది. రోగికి మానసిక శాంతి అత్యవసరంకదూ? అందుకని ఆమెనన్ను క్రితంకంటే ఎక్కువ ప్రేమతో చూడసాగింది. అందులో కాస్త స్వార్థం వుందేమో, కాని, నాకు మటుకు అత్తయ్య ప్రేమలో కపటం కనిపించలేదు.

రామం బలవంతాన ఒకరోజురాత్రి వాళ్ళఇంట్లోనే పడుకున్నాను. పదిన్నర ప్రాంతాల్లో అమ్మవచ్చి కేకేసుక వెళ్ళింది. హాల్లో నాన్నగారు పచారు చేస్తున్నారు. నామనసెందుకో భీతినొందింది. నేరస్తురాలిలా నుంచున్నాను నాన్నముందు.

"ఫో— నీగదిలోకి వెళ్ళి పడుకో. మరోసారి అటు వెళ్ళావంటే కాళ్ళు విరగగొడతాను" అన్నారు నాన్నగారు.

తరువాత అమ్మని కేకలేశారు.

"వెళ్ళికాసేపే అయిందండీ....." అంది అమ్మ.

"అయిదు నిముషాలు చాలవూ అంటువ్యాధి రావటానికి! ఇకముందు నుండేనా జాగ్రత్తగావుండు" అన్నారు నాన్న.

అమ్మ ఏదో చెబితే తీవ్రంగా విమర్శించారు. నాన్నగారికంతకోపం రావటం నేనేనాడూ చూడలేదు. గదిలోకి వెళ్ళి మంచంమీద పడి నిశ్శబ్దంగా రోదించసాగాను. అమ్మ నామనసు కొద్దిగా గ్రహించినట్లుంది. దగ్గరగాకూర్చుని నా కన్నీరు తుడిచి సముదాయించ సాగింది.

"చూడు రాజ్యం, రామానికి జబ్బువస్తే నువ్వు బాధపడుతున్నావుకదూ? అలాగే నీకూ జబ్బు వస్తే మేమెంత బాధపడతాం చెప్పు? నువ్వెళ్ళి ఎప్పుడూ రామం దగ్గర కూర్చుంటే నీకూ ఆ జబ్బు రాదూ?" అంది.

నాకావిషయం రుచించలేదు. రామం దగ్గిర కూర్చున్నంత మాత్రాన నాకెందుకు జబ్బువస్తుందో అవగాహన అవలేదు. నాన్నకోమారు జ్వరంవస్తే అమ్మ ఎప్పుడూ నాన్న దగ్గరే కూర్చునేదే—మరి అమ్మకి జ్వరం రాలేదుగా? ఇలాంటి సందేహాలు ముప్పిరిగొన్నాయి. అమ్మమాటలు, నాన్న చేతలు రామానికీ నాకూ వున్న అనుబంధాన్ని అప్పుడే త్రెంపివేసిన ట్లనిపించాయి. ఇకనుండి రామాన్ని చూడటానికి వెళ్ళరాదన్న విషయం అతిగా కలచివేసింది నన్ను. రాత్రంతా రోదిస్తూండి పోయాను.

రోజులు భారంగా గడవసాగాయి. బడినుండి తిరిగి వచ్చాక నేను రామం ఇంటివేపు వెళ్ళకుండా అమ్మ కంట కనిపెట్టుకుని వుండేది. వీధివేపు అడుగు వేశానంటే "ఎక్కడికే?" అనేది. బిక్కచచ్చి వసార్లో కూలబడేదాన్ని. ఎదురింటి వరండాలో పడకకుర్చీలో కూర్చుని వున్న రామం దీనమైన చూపులు నన్ను ఆకట్టి వేసేవి. కాని, నిస్సహాయ స్థితిలో వుండిపోయాను నేను. మరోసారి వసార్లోంచి కాలు కదిపినందుకు చెళ్ళున చెంపదెబ్బ ప్రసాదించారు నాన్నగారు. పరిస్థితులు భౌతికంగా నన్ను రామం దరిజేరక బంధించినా మనసు మటుకు అతని చుట్టూ పరిభ్రమిస్తూండేది. నాకు జ్వరం వచ్చినపుడు బడికి సైతం వెళ్ళకుండా నామంచం దగ్గిరే కూర్చుని వున్న రామం ముకుళిత వదనం పదేపదే స్మృతిపథంలో మెదలేది. అటువంటి అమృతమూర్తితో అయిదు నిముషాలు మాట్లాడి మనసులోని బాధను సైతం వెళ్ళ గ్రక్కుకోలేని దౌర్భాగ్య పరిస్థితి నాది!

ఓరోజు ఉదయం అత్తయ్య మాయింటికి వచ్చింది. అమ్మలో ఒక రకమైన తత్తరపాటు కనపించింది నాకారోజు. అత్తయ్య కంఠంలోని ఆర్ద్రత నాహృదయాంతరంగంలోసుళ్ళు రేపింది. రోజూ రాత్రి రామం నాపేరు నిద్రలో కలవరిస్తున్నాడట. "రాజ్యం మన ఇంటికి ఎందుకు రావటం లేదు." అనడుగుతున్నాడట. "అమ్మా రాజ్యానికెందుకో నామీద కోపం వచ్చిందే" అనేవాడుట. పరిస్థితి ఇలాగే వుంటే, ఎన్నిమందుల పుచ్చుకున్నా లాభం లేదని, రామం మానసికంగా కృశించి పోతున్నాడని అత్తయ్య కళ్ళనీరెట్టుకుంది. రోజూ ఒక్కసారి వచ్చి మాట్లాడించి వెళ్ళటానికి అనుమతి ఇవ్వమని అమ్మని బ్రతిమాలింది. అమ్మమాత్రం ఖరాఖండిగా వీల్లేదంది. ఏరకమైన సహాయం కావాలన్నా చేస్తాం, ఇది మాత్రం వీల్లేదంది. వాళ్ళకి రామం ఎంతముఖ్యమో, నేను తమకి అంతే నన్నది. కళ్ళనీళ్ళతోనే అత్తయ్య వెళ్ళిపోయింది.

అమ్మమీద కోపం వచ్చింది నాకారోజు. మధ్యాహ్నం బడికి వెళ్ళకుండా దుఃఖిస్తూండి పోయాను. సాయంకాలం చెరువు కట్ట ఆంజనేయ స్వాముల వారి గుడికి వెళ్ళాను నిర్జీవంగా వున్న ఆలయ ప్రాంగణం విషాదంగా అగుపడింది నాకు. విగ్రహానికెదురుగా నుంచొని కళ్ళు మూసుకుని దండం పెట్టాను. రామానికి నయం అవుతే కొబ్బరికాయ కొడతానని మొక్కుకున్నాను.

"రోజూవస్తున్నావేమిటమ్మాయ్" అని పలరించాడు పూజారి.

విషయం చెప్పాను.

విచిత్రంగా వీక్షించాడు నన్ను కాసేపు. తరువాత కుంకుమ పొట్లంకట్టి యిచ్చి, కాసింత ప్రసా

యం చేతులో వుంచాడు.

"ఈ ప్రసాదం తింటే రామానికి నయమవు తుందాండి?" అన్నాను.

"ఓ! తప్పకుండా" అన్నాడు.

పరుగు పరుగున ఇంటికి చేరుకున్నాను. ఆరాత్రి అందరికి కన్ను కప్పి రామాన్ని చేరుకున్నాను. నన్ను చూడగానే రామంలో కలిగిన సంతోషం వర్ణనాతీతం. కాని, మరుక్షణంలో అతనిముఖం చిన్న బోయింది.

"నువ్వు నాదగ్గరకు రాకు రాజ్యం" అన్నాడు.

దెబ్బ తిన్నట్లు చూశాను.

"నీక్కూడా జబ్బు వచ్చేస్తుంది రాజ్యం. నాలా నువ్వు పీలబడిపోతావు. వెళ్లిపోరాజ్యం"—అతని పెదాలు వణుకుతున్నాయి. కనుకొలుకుల్లో నీరు తొణికిస లాడింది.

"ఎవరు చెప్పారు?" అన్నాను.

"అమ్మ"

"అంతా అబద్ధం. నాకేమీ జబ్బురాదు" అన్నాను

రామంలో ఎలాంటి మార్పు లేదు. "అమ్మ అబద్ధం చెప్పదు. నువ్వు వెళ్లిపో రాజ్యం" అన్నాడు.

అతని మాటలు కర్కశంగా ధ్వనించాయి. అవుతే మాటల వెనకవున్న నిగూఢమైన బాధ, అంతకంటే నాపైగల అపారమైన ప్రేమ నన్ను బంధించి వేసింది.

"వెళ్లిపో రాజ్యం—వెళ్లిపో" గట్టిగా అరచి తల ప్రక్కకు త్రిప్పేసుకున్నాడు రామం.

అలోగా అత్తయ్య అటుగా వచ్చింది. భార మిలలాంటి ఆవిడకళ్లు పరిస్థితిలోని అసహాయ తను, దీనత్వాన్ని ఎత్తి చూపుతున్నాయి. రామం కంటే పీలబడిపోయిఫుందామె. నన్ను చూడగానే 'ఎందుకమ్మా ఇక్కడికి వచ్చావు" అంది. విష యం చెప్పి ప్రసాదాన్ని అందించాను.

# ధార

"నాతల్లే" అంటూ అక్కున జేర్చుకుందామె. ఆణిముత్యాల్లాంటి నీటిబిందువులు నా శిరస్సుపై జలజలా రాలాయి. అత్తయ్య కౌగిట్లో అంతు లేని శాంతి లభించినట్లయింది. అలాగే ఎంతసేపు ఉండిపోయానో చెప్పనేలేను.

నాశిరస్సు నిమురుతూ, అప్యాయంగా అంది అత్తయ్య "నువ్వు ఇంటికి వెళ్లిపోమ్మా రాజ్య లక్ష్మి. రామానికి త్వరలో నయమై పోగలదు. డాక్టరు గారు చెప్పారు. అటు తరువాత మీరి ద్దరూ కలిసి ఆడుకోవచ్చు" అని.

నానోట మాటలు పెగల్లేదు. అత్తయ్య వేపో సారి, రామం వేపోసారి పిచ్చిచూపులు చూసి వెను దిరిగి వచ్చాను. ఆరాత్రి నాకు విచిత్రమైన కల వచ్చింది. ప్రసాదం తిన్నరామం కులాసా అయి నట్లు, మేమిద్దరం కలసి ఆడుకున్నట్లు! కాని కలలు జీవితాలు కాలేవుగా!

నేను దగ్గర లేని లోటును విస్మరించేందుకు, రామం మనసు మరో వేపు మళ్లించేందుకు అత్తయ్య, మామయ్య చేసిన ప్రయత్నాలు నాకు అప్పట్లో సరిగ్గా అర్థం కాలేదుగాని, ఈనాడు కళ్లకు కట్టినట్లు తోస్తున్నాయి. రామానికి మామయ్య ఎక్కడి నుండో ఓచిన్నకుక్కపిల్లను తీసుకువచ్చి యిచ్చారు. తెల్లనిదేహం, చెవులదగ్గర నుండి జారుతున్న పట్టు లాంటి జూలులో ముద్దుగా వుండేదది. మెడదగ్గర మటుకు నల్లని మచ్చ ఒకటి వుండేది. చిన్న కాళ్లతో అది రామం చుట్టూ చెంగుచెంగున ఎగురుతూంటే భలే ముచ్చట వేసేది. కొద్ది రోజుల్లోనే ఆ కుక్క పిల్ల అంటే అపారమైన ప్రేమ ఏర్పడ్డది రామానికి. అవుతే అయిదో రోజునుండి దాన్ని దూరంగా వుంచ సాగాడు. దగ్గరగా వస్తేతరిమి కొట్టేవాడు. దాని మెడకో గొలుసువేసి వరండా లోని చివరి స్తంభానికి కట్టివేసి పడకకుర్చీలో కూర్చుని వుండే వాడు. రహస్యంగా మరోసారు కలుసుకున్నపుడు కారణం అడిగితే "దానికీ జబ్బు వస్తే ఎలా రాజ్యం" అన్న రామం సమాధానం అంతులేని వేదనని రగిల్చిందినాలో.

రామానికి ప్రొద్దుపోవటానికి మామయ్య తెచ్చియిచ్చిన మరో సాధనం బైనాకులర్స్. దానితో కొద్ది దూరంలో కొండపై అప్పుడే నిర్మింపబడుతున్న కట్టడాన్ని తిలకిస్తూండే వాడు రామం. దాదాపు వంద అడుగుల పైబడి వున్న ఆకట్టడపు స్తంభాలు తెల్లని పెయింట్‌తో ఎండలో నిగనిగలాడేవి. దానిపై అధిరో హించి కట్టడాన్ని పూర్తి చేస్తున్న మనుష్యులు చీమల్లా గోచరించేవారు. దాన్ని చేరుకోటానికికొండ పైకి వేసిన తెల్లని సిమెంటు రోడ్డు పాములా మెలికలు తిరుగుతూ చిత్రంగా చూపట్టేది. ఆకట్టడం పైనుండి త్రాటినందుకుని వేగంగా పనివారు క్రిందకు జారుతూంటే రామం ఆసక్తిగా చూసేవాడు. అంతటితో ఆగలేదు అతను. అలసటను, నీరసాన్ని లెక్కజేయక ఆకట్టడపు మాడల్‌ను తయారు చేయటం మొదలెట్టాడు. పెన్‌నైఫ్‌ని తీసుకుని వెదురు బద్దలను సన్నగా చీలుస్తూంటే రామం నుదుట చెమట బిందువులు ముత్యాల్లా ఆవరించుకునేవి. వాళ్ల నౌకరొకతను అప్పుడప్పుడు ఈ పనిలో సాయపడుతూండేవాడు. దారం, జిగురు, రంగు కాగితాలు, కత్తెర దగ్గర వుంచుకుని దీక్షగా పరిశ్రమిస్తున్నరామం, ఆకట్టడాన్ని నిర్మిస్తున్న వారికంటే గొప్పగా కనబడేవాడు నాకు. రోజూ ఎదురుగా వున్న ఆకట్టడం ఎంతసాగితే, అంత వరకు సాగేది రామం నిర్మాణం. సాయంకాలం కూలీలు దిగిపోగానే, రామం కూడ తన పని ఆపేసి కుక్కపిల్లను కట్టిన స్తంభంప్రక్కనే దాన్ని వుంచి తదేకంగా రెండిటివంక చూస్తుండే వాడు.

రామం కడుతున్న కట్టడం దాదాపు నాలుగు అడు గులు ఎత్తు వుండేది. దాని పెరుగుదలతో పాటు రామంతో నాఎడబాటు పెరగ సాగింది. నిస్సహాయ స్థితిలో అతనివేపు చూస్తున్న నన్ను చూసి ఒక్క చిరునవ్వు నవ్వేవాడు రామం. ఆ చిరునవ్వే ఎంతో బలం యిచ్చేదినాకు. రోజూ దేవుడి గుడికి వెళ్లటం మటుకు మానలేదు నేను.

ఒకరోజు సాయంకాలం ఎంత ప్రయత్నించినా గుడికి వెళ్లలేక పోయాను. కొండమీది కట్టడం దాదాపు పూర్తయినట్లుంది. పైభాగాన చిన్నని రెండు వలయాలు నిర్మింపబడ్డాయి. వాటిని తనూ నిర్మించటానికి విఫలప్రయత్నం చేస్తు న్నాడు రామం. కాని, ఎందుకో కుదరటం లేదు. సన్నని వెదురు బద్దని, గుండ్రంగా వంపితే పుటుక్కున విరిగి పోయింది.!

రాత్రి హోరుమని వర్షంవచ్చింది. కళ్లు మిరు మిట్లు గొలిపే మెరపులు, చెవులు చిల్లులు పడేలా ఉరుములతోనూ. దూరాన ఎక్కడో

ఏమండోయ్! పేకాడుకుందాం - వస్తారా!!



పిడుగు పడ్డ శబ్దం అయింది. నాకెందుకో భయం వేసింది. వసార నేను కిటికీ రెక్క తెరచి, రామం ఇంటివేపు చూశాను. చీకటిగా వుంది. పెంకుల మీద వానధారపడి రొద సల్పుతూంది. వీధిలో నీళ్లు ఎత్తుగా ప్రవహిస్తూ తూములోకి దూసుకుపోతున్నాయి. అంత వర్షంలోనూ రామం వాళ్ల వరండాలో కట్టివేయబడి వుంది కుక్కపిల్ల. హోరులోనూ దానికంఠం దీనంగా వినబడు తూంది. ఆకాశంలో హఠాత్తుగా ఒక చీలిక ఏర్పడింది. తళుక్కున మెరసిన మెరుపు వెలుగులో రామం కట్టిన కట్టడం నేలపై ఒరిగి పోయివుంది.

కిటికీలోంచి సన్నని జల్లు మొహాన పడింది. వణుకుతున్న చేతులతో రెక్కబిగించి వచ్చి మంచం మీద కూర్చున్నాను. ఈదురుగాలి, చలి, మెరుపులు, ఉరుములు చిత్రమైన వాతావరణాన్ని కల్పించి భీతిని నెలకొల్పుతున్నాయి. తెల్లవార కట్టగాని నిద్ర పట్టలేదు నాకు.

ఉదయం ఎనిమిదింటికి కాబోలు మెలకువ వచ్చింది. బద్ధకంగా కళ్లు తెరచాను. చాల రోజుల క్రితం మాయింట్లో రామం వదిలేసి వెళ్లిన గాలిపటం కన్పించింది గూట్లో. ఇంటి కప్పులోని గాజుటద్దంగుండా దానిపై పడుతున్న ఎండ ఎర్రని రంగును నలుమూలలా విరజిమ్ము తూంది. గూట్లోనుండి బయటపడిన దాని పొడుగాటి పచ్చని తోక, తెల్లని గోడపై నిర్జీవంగా నాట్యం చేస్తూంది. గాజు పొడిని పులుముకుని వున్న లావుపాటి దారపుకండె పరాజితుడిలాగ నేలపై పడి దొర్లుతూంది. ఆకండె తీసి గూట్లో పడేసి, వీధిలోకి అడుగుపెట్టాను.

ఎదురుగా రామం ఇంటికి వేసినతాళం వెక్కిరిస్తూ కనబడింది!

రామం కట్టిన కట్టడం వీధిలోకి పడిపోయి, నామ రూపాలు లేకుండా పోయివుంది.

ఒక్కక్షణం సంభ్రమం, దిగులు, దుఃఖం ముప్పిరి గొన్నాయి నన్ను. ఉద్వేగంతో మనసు ఎగసి పడింది. భయంతో వెర్రికేక వేసి పడిపోయాను. మళ్లీ కళ్లు తెరిచే సరికి అమ్మ ఒడిలో వున్నాను. నాన్నగారు కంగారు పడుతున్నారు. తెలివి రాగానే రామాన్ని గురించి ప్రశ్నించాను. అమ్మ చెప్పిన విషయ సారాంశం ఏమిటంటే రామాన్ని ఉదయం ఆరింటి బండికి మదనపల్లె తీసుక వెళ్లారని.

"ఎందుకూ?" అన్నాను.

"అక్కడ పెద్ద ఆస్పత్రి వుంది. తొందరలో రామం కులాసాగా తిరిగి వస్తాడు. నువ్వు దిగులు పడకు. ఉదయం రిక్షా ఎక్కుతున్నపుడు నీకు తన కుక్కపిల్లని ఇచ్చివెళ్లాడురామం" అంది అమ్మ.

రామం ఊరికి వెడుతున్నపుడు నాకెందుకు మెలకువరాలేదో అని నన్ను నేను దూషించుకున్నాను. వెడుతున్నపుడు నాతో మాటవరుసకు ఒకముక్క కూడ చెప్పకుండా వెళ్లిపోయిన రామంపై కొంచెం కోపం వచ్చింది. అవుతే అమ్మ అన్నట్లు పెద్ద ఆస్పత్రిలో అతను త్వరలో కోలుకుని ఇంటికి వచ్చేస్తాడన్న విషయం మటుకు తెరిపి ఇచ్చింది.

# చా ర

కుక్కపిల్లకోసం ఇల్లంతా వెదికాను. కనుపించ లేదు. కాసేపటి తరువాత ఎదురింటి వరండాలో చూశాను దాన్ని. రామం పడకకుర్చీ వేసుకుని కూర్చునే ప్రదేశాన్ని నాలుకతో రాస్తూ, వింతగా తోక నాడిస్తూంది. వెళ్లి ఇంట్లోకి తీసుకవచ్చాను కాని మధ్యాహ్నానికంతా తప్పించుకుని, ఎదురింటి వరెండాలోకి వెళ్లిపోయింది. పళ్లెంలో పాలుపోసి అక్కడికే తీసుకవెళ్లి దానిముందు వుంచాను. వాసన సైతం చూడలేదది.

రెండో రోజూ అంతే. మరికొన్ని రోజులు గడిచే సరికి కుక్కపిల్ల నీరసించిపోసాగింది. తళ తళలాడే దాని కళ్లెందుకో నిర్జీవంగా అగుపడేవి. మెడచుట్టూ సట్టులా మెరసే తెల్లని జుత్తు రాలిపోయింది. బొమికలు వెళ్లకొచ్చాయి. కాస్తయినా తిండి పదార్థాలని ముట్టుకునేదికాదు. ఎప్పుడూ స్తంభం చుట్టూ తిరుగుతూ ఆప్రదేశాన్ని నాలుకతో రాస్తూ కుయ్ కుయ్‌మని అరుస్తూండేది. అటు తరువాత ఒకరోజు అది కనుపించలేదు. నౌకరుతో ఊరంతా వెతికించింది అమ్మ. నాకు తెలిసిన పరిసరాలన్నీ నేనూ గాలించాను. అయినా లాభం లేక పోయింది. కుక్కపిల్ల మళ్లీ కనబడలేదు.

కుక్కపిల్ల మాయమై పోయాక ఆ ఇంటిలోను, పరిసరాల్లోను ఏర్పడ్డ శూన్యత గుండెను దిగులుతో నింపేది. నాపరితాపాన్ని, వాత్సల్యంతో అణగార్చి వెయ్యటానికి రామంలేడు. నాలో నిస్సహా నీడలా ఆవరించుకో సాగింది. మనసు మునుపటి ప్రశాంత తను గోల్పోయి శిథిలమై పోయింది. చైతన్యం ఇంకి పోయింది. భావనలు హారతి కర్పూరంలా హరించి పోసాగాయి. బెంగతో నాపెదవులెప్పుడూ 'రామం—రామం'అంటూ పలవరిస్తూనే వుండేవి.

క్షణం కళ్లుమూస్తే రామం మూర్తి కనుపించేది. వీధి వసార్లో, పెరట్లోని మసక నీడల్లో రామం తిరుగుతున్నట్లే వుండేది. నీరు నిండిన కాలువగట్టు పైన, చల్లని ఇసుక తిన్నెలపైన రామంతో కలిసి ఆడుకున్నట్లే వుండేది. రామం కోసం దిగులు, బాధ. రోజులు గడచేకొద్దీ పెరుగుతున్న మమకారంతో మెలికలు త్రిప్పుతున్న దుఃఖం! కాని, కారుమెయిళ్లు క్రమ్మిన నల్లని ఆకాశంలో మూలగా మినుకుమనే నక్షత్రంలాగు, అనంతమైన విశ్వంలో అణువులాగురామం తిరిగి వస్తాడన్న భావన మటుకు నన్నంటుకుని ధైర్యం యిచ్చేది.

తరువాత నెల రోజుల్లో మాకా వూరు నుండి ట్రాన్స్‌ఫరైంది. ఆ ప్రాంతాల నుండి దూరంగా సుదూరంగా వెళ్లిపోయాం మేము. ఏళ్లు గడచి పోయాయి. జ్ఞాపకాలు మటుకు మరుగున పడ లేదు. రామం నా కళ్లలోనే మెదలుతూండేవాడు. దీప్తివంతమైన మోహం, చిలిపిగా నవ్వే కళ్లు, అలవోకగా నుదురు మీద రేగు తున్నముంగురులలో నా వంక ఆప్యాయంగా తిలకించే ముఖారవిందం నేనేనాడూ మర్చిపోలేను. దివ్య సౌందర్య మూర్తి రామాన్ని, వ్యాధితో చిక్కిపోయిన రామాన్ని పోల్చి చూసుకోని క్షణం వుండదు. ఒక రకంగా నాకు ఏకాంతం లేదు. రామం మూర్తి నిశ్చలంగా నా హృదయంపై చిత్రింపబడి వుంది. విషాదమైన హస్తంతో పురివేయబడ్డ రెండు పసిదారాలు విడిపోవటం సులభం కాదు. ఎన్నో అనుభవాల మధ్య నలిగి పోతున్నా, మా స్నేహం స్ఫురణకు రాని సమయం వుండదు. గడచిపోతున్న కాలం నాలో చెరపివేయని గాయమది.

*        *        *

అక్కయ్యగారు చెప్పటం ఆపేశారు. నిర్భేద్యమైన నిశ్శబ్దం ఆవరించుక పోయింది డాబాపై. చంద్రుడు మేఘాల చాటుకు తప్పుకున్నాడు. మెల్లగా వీస్తున్న గాలి స్తంభించి పోయింది. వేప చెట్టు ఆకుల్లో కదలిక లేదు. వేపపూత రాలటం సైతం ఆగిపోయింది.

నారాయణమూర్తి ఇంకా పిట్టగోడకు జేరగిలబడి వున్నారు. ఆయన నోటిలోని చుట్ట కొడిగట్టి ఆరిపోయివుంది. మధ్య మధ్యలో ప్రశ్నలు అడుగుతూ సందేహ నివారణ గావించుకున్న మాలతి కూడ మౌనంగా వుంది.

బాబిగాడు నిద్దర్లో నవ్వులనింకా ఒలకబోస్తున్నాడు.

అక్కయ్యగారు అన్నారు "మిమ్మల్నందరినీ విషాదంలో ముంచేశానా ఏమిటి?" అని.

ఎవ్వరూ మాట్లాడ లేదు.

మళ్లీ ఆవిడే అన్నారు "చాలా ప్రొద్దుపోయింది. ఇక పడుకుందాం" అని.

ఈ మాటూ సమాధానాలు లేవు. మాలతి మటుకు లేచి మర చెంబులోని మంచినీరు గ్లాసులో పోసుకుని త్రాగి, తిరిగి ప్రక్కమీద వాలింది. చుట్ట విసిరి పారేసి వెల్లకిలా పడుకుని ఆకాశంలోకి చూస్తున్నారు నారాయణ మూర్తి. బాబిగాడికి దగ్గరగా జరిగి కళ్ళు మూశాను నేను.

ప్రశాంతంగా తెల్లవారింది. లేచి చూసేసరికి డాబా మీద నుండి అందరూ దిగిపోయి వున్నారు.

అక్కయ్య గారు వెళ్ళిపోవటానికి సంసిద్ధులయివున్నారు. సూట్ కేసులను కారు డిక్కీలో పడవేయించింది మాలతి. డ్రయివింగ్ సీటులో వీరాస్వామి దర్జాగా కూర్చుని వున్నాడు. ఆ క్షణ

కుడివైపు సూరి కూర్చుని వీరాస్వామి నేదో ప్రశ్నిస్తున్నాడు. కాఫీ సేవిస్తూ కిటికీలోంచి మాలతి చేస్తున్న హడావిడిని చూస్తూండి పోయాను నేను.

అక్కయ్యగారు గదిలోకి వచ్చారు.

"వెడుతున్నా మండోయ్ మరదిగారూ" అందామె

"మంచిది" అంటూ చిన్నగా నవ్వాను.

ఆవిడ వెనుదిరిగింది.

గ్లాసులోని కాఫీ ఒక గుక్కలో ఖాళీ చేసి "ఒక్క మాట" అన్నాను. ఏమిటన్నట్లు చూసిందామె.

"నిన్న రాత్రి మీరో కథ చెప్పారు గుర్తుందా? అందులో ఒక సందేహం వస్తూంది నాకు" న్నాను

నవ్విందామె "మీకా విషయం ఇంకా గుర్తుందన్నమాట. నేను చెప్పింది కథ కాదు. మాటల సందర్భం వచ్చి నా చిన్నతనంలోని సంఘటన చెప్పాను. ఇంతకీ ఏమిటి మీ సందేహం?" ంది.

చేతిలోని గ్లాసును బల్ల మీద వుంచుతూ "మీకా చిన్నతనంలోని రామం మళ్ళీ జీవితంలో తారసపడితే ఎలా వుంటుంది?" న్నాను.

మళ్ళీ మందస్మితం సల్పిందావిడ "మీరు చాలా తమాషాగా ఆలోచిస్తారండోయ్ మరిది గారూ. నిజ జీవితంలో మీరు చెప్పినట్లు జరగదు. ఒక వేళ అలా సంభవించినా, నాటకీయంగాను, అసహజంగానూ వుంటుంది. అలా జరగటం ఆనందదాయకమే అయినా ఆమోదకరం కాదు" అంది.

"ఎందుకని?"

"మీరు ఈ ప్రశ్న అడగకుండా వుండాల్సింది. నేను సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేనేమో. అవుతే ఒకటి మటుకు నిజం. చిన్నతనంలో పసి హృదయంపై అమాయకంగా పడ్డ అనుభూతి అది. సంఘటన జరిగాక రామం ఏమయ్యాడో— బాగుపడ్డాడో, లేక చనిపోయాడో అన్న సంశయమే ఈ అనుభూతిని నాలో ఇంకా మిగిల్చి వుంది. రామం నిజ జీవితంలో మళ్ళీ తారసపడ్డాడే అనుకోండి. అపరిమితమైన ఆనందం కల్గవచ్చునేమో. కాని అది క్షణికం మాత్రమే. తరువాత ఐనా నేను, రామం కలసి జీవించలేము. అతని జీవితం అతనిది, నా జీవితం నాదీనూ. అవుతే ఈ అనుభూతి సైతం మాయమవుతుందప్పుడు. నా అనురక్తి చిన్ని రామానికే. అనురాగం అమాయక మూర్తియైన ఆ పసివానికే. ఈ తపన ఒక విలక్షణమైన ఆనందానికి అనురూపం మటుకే. బ్రతికి వుంటే రామం ఎదిగి వుంటాడేమో కాని నా మనసులో మటుకు అతని ఆకృతికి ఒకే పరిధి వుంది. అది చిన్నతనం. పరిధి చెదరిపోతే ఆకృతి చెదరిపోతుంది. చిన్నారి రామంమూర్తి నా మనసులో నిలవదు ఇక. హృదయ కుహరపు ఒడ్డుపై జ్ఞాపకాల కెరటం వదలిపోయిన చార ఈ అనుభూతి మరదిగారూ. మరో కెరటం వస్తే తుడిచి వేయబడకుండా వుంటుందంటారా?"

నవ్వాను నేను!

మాలతి హడావిడిగా గదిలోకి వచ్చింది "ఇంకా ఇక్కడే వున్నారా అక్కయ్యగారూ, ట్రెయినుకి టైం అవుతూంది" అంది.

"వస్తానండీ" అంటూ సెలవు పుచ్చుకుని అక్కయ్యగారు మాలతితో పాటు వెలుపలికి వెళ్ళిపోయారు. కిటికీ దగ్గరకు వెళ్ళి నుంచున్నాను నేను. మరో నిముషంలో కారు బయలుదేరింది. దృష్టిపథం నుండి వేగంగా దాటుక పోతున్న కారుని చూస్తూ కిటికీ చువ్వలను గట్టిగా పట్టుకుని "లేదు రాజ్యం అక్కయ్యా— లేదు. నీ మనసులోని అనుభూతిని చెరిపివెయ్యదలచుకో లేదు ఈ రామకృష్ణ" అంటూ ఘోషిస్తూండి పోయాను నేను. ●




**జ రి గి న క థ**

సావిత్రమ్మ ఒక మధ్యతరగతి ఇల్లాలు. ఆమె భర్త రామనరసయ్య. పెద్దకొడుకు గోపీ వారాలు చేసుకుని హైస్కూల్లో 'యస్సెస్సెల్సీ' చదువుకుంటూ వుంటాడు. విధిలేక చిన్నవాడు మురళిని వరసింహానికి పెంపకం ఇస్తుంది. గోపీ తెలివి తేటల్ని గ్రహించి అతనికి తన ఇంటిలోనే వసతి ఏర్పాటు చేస్తాడు ప్రొఫెసరు. అతని కుమార్తె అనిత. అనిత ప్రవర్తన గోపీకి నచ్చదు. అనిత గోపీల సంబంధం గురించి ఆకాశరామన్న ఉత్తరం ప్రొఫెసరు పేరన వస్తుంది. ఫలితంగా గోపీ ఆచోటు విడిచి పెట్టేస్తాడు. శ్రేయోభిలాషులు అతన్ని పై చదువుకోసం విదేశాలకి పంపాలనుకున్నారు.

## 5

లైబ్రరీలో పుస్తకాలు వాపసు యిస్తూ కొత్తగా వచ్చిన పుస్తకాలను చూస్తున్నాడు గోపీ.

'నమస్కారమండీ'

తల ఎత్తి బల్లమీద దగ్గరగా నిలబడి ఉన్న అనితను చూసి ఆశ్చర్యపడ్డాడు.

'ఈ రెండు మూడు నెలల నుంచీ మిమ్మల్ని కలుసుకుని క్షమాపణ చెప్పుకోవాలనుకుంటున్నాను. కాని తగిన అవకాశం దొరకలేదు' పైటకొంగు కొనలు నలుపుతూ నేల చూపులు చూసింది.

గోపీకి చెప్పలేనంత అసహ్యం వేసింది. కనుబొమ్మలు ముడిచి ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు.

కన్నార్పకుండా అతడివే చూస్తూ గడపలో నిలబడ్డది అనిత. లోపలినుంచి వస్తున్న అతడికి అడ్డంపోయి 'మీతో మాట్లాడవలసిన పని ఉన్నది. ఐదు నిమిషాల టైము యిస్తారా?' తల దించుకుంది.

'నాకు చాలా అర్జంటు పని ఉంది' అతడు గబగబా గుమ్మము దాటుకుంటూ వెళ్లిపోయాడు. అతడు వెళ్లిన దిక్కే చూస్తూ కళ్లల్లో నీళ్లు కళ్లలోనే ఇంకింప చేసుకుంటూ వెనక్కు తిరిగింది అనిత.

గోపీ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వరండా దాటి పోయాడు. అతడి కొరకే ఎదురు చూస్తున్నట్టుగా ప్రొఫెసరు రఘురామయ్య గేటు దగ్గర నిలబడ్డాడు.

ఆ మరునాడే గోపీ బొంబాయి ప్రయాణం. ప్రిన్సిపల్ ప్రొఫెసరూ ఇద్దరూ కలిసి యూనివర్సిటీ స్థాయిలో విరాళాలు ప్రోగుచేసి అతడికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశారు.

స్టేషనులో గోపీని సాగనంపటానికి అతడి స్నేహితులు గుమిగూడారు. ప్రిన్సిపల్, రఘురామయ్య గోపీకి చెరొక ప్రక్క నిలబడ్డారు. వారిద్దరికీ తన కృతజ్ఞతలు ఎలా తెలపాలో తెలియటంలేదని గోపీ వినమ్రుడై నిలబడ్డాడు. నల్లసూట్‌లో హుందాగా ఉన్న అతడిని చూసి వాళ్లిద్దరూ మురిసిపోతున్నారు.

'రాస్కెల్. ఎక్కడికి పోతున్నావు? నా కళ్లుగప్పి ఊరు దాటుదామనుకుంటున్నావా.' కోటుపట్టుకుని గుంజుతూ గోపీని తన వైపుకు తిప్పుకున్నాడు ప్రొఫెసరు నిరంజనం.

ప్రిన్సిపల్, రఘురామయ్య నిర్ఘాంతపోయారు విస్మయంతో చూస్తూ వెనకడుగు వేశారు. గోపీ తెల్లబోయి చూస్తున్నాడు. నోటినుంచి మాట పెకిలి రాలేదు. గొంతుతడి ఆరిపోయింది.

'కను మరుగైతే నీవు చేసిన తప్పు కనుమరుగైపోతుందనా నీ ఉద్దేశ్యం? నీ వెక్కడికిపోయినా జుట్టుపట్టి లాక్కొస్తాను రాస్కెల్' దూకుడుగా అన్న తరువాత ప్రక్కకు చూశాడు నిరంజనం. ప్రిన్సిపల్ తనవైపే చూస్తూ ఉండటం కనిపెట్టి గోపీ కోటు వదిలి పెట్టాడు.

'ఇతడిమీద రెండు రకాల నేరాలున్నాయి సర్. మీరు ఇతడిని దూరదేశాలకు పంపాలని చూస్తున్నారు. ఇది అన్యాయం' జేవురించి భీకరంగా ఉన్న ముఖాన్ని జేబురుమాలతో తుడుచుకుంటూ ప్రక్కకు నిలబడ్డాడు నిరంజనం.

రైలువచ్చి ప్లాట్‌ఫారమ్‌మీద ఆగింది. దిగేవారు దిగుతున్నారు. ఎక్కేవారు సామాన్లతో ఎక్కటానికి తొందరపడుతున్నారు. కూలీలు గోపీ సామాన్లు ఒకపెట్టెలో పెట్టారు. ఒకరినొకరు తోసుకునే జనం మధ్యలో గోపీ ఎప్పుడు కలిసిపోయాడో నిరంజనం చూడలేదు. ప్రిన్సిపల్, రఘురామయ్య జనం మధ్య చేతులతో తోవ చేసుకుంటూ గోపీ ఎక్కిన రైలుపెట్టె కొరకు వెతకటం మొదలుపెట్టారు.

నిరంజనం వాళ్లవెనకనే పరుగెత్తాడు. ప్రతిపెట్టెలోకీ తొంగిచూస్తూ వెతుకుతూ నడిచాడు. చివరకు రైలు కదిలిన తరువాత ప్రిన్సిపల్‌కూ, రఘురామయ్యకూ నమస్కరించి సెలవు తీసుకుంటున్న గోపీ కనబడ్డాడు.

అప్పటికి రైలు వేగాన్ని అందుకున్నది.

* * *

'ఏమిట్రా శంకరం? పొద్దుటినుంచీ తిండీ తిప్పలూ లేకుండా అర్ధరాత్రి యింటికి రావటం — ఇది నాలుగోసారి. ఏమి తిరుగుళ్లురా యివి?' తనను తప్పు

కుని లోపలికి పోబోతున్న శంకరాన్ని అటకాయించింది సావిత్రమ్మ.

'లోపలికి వచ్చి అన్నం పెట్టమ్మా. నెమ్మదిగా చెబుతాను' కాళ్లు కడుక్కుని వచ్చాడు శంకరం.

'ఏం చెబుతావురా నువ్వు? ఎక్కడికో వెళ్లాను అందుకని ఆలస్యమయిందంటావు అంతేనా?' అతడికి అన్నం వడ్డించి ఎదురుగా కూర్చుంది.

'నేను ఊరికే తిరగటంలేదమ్మా. బెజవాడ వెళ్లి రక్తదానం చేసి వస్తున్నాను ఇప్పటికి నాలుగుసార్లు ఇచ్చాను.'

'ఎందుకురా రక్త మివ్వటం? నీకేమయినా పిచ్చి ఎక్కలేదుకదా?' సావిత్రమ్మకు అతడి మాటలకు కంగారు పుట్టింది.

'ఎందుకా? ఎందుకో రేపు చెప్తాను' చెయ్యి కడుక్కుని లేచాడు శంకరం.

ప్రొద్దునే స్నానంచేసి వస్తున్న శంకరానికి రామనరసయ్య పెరట్లోకి వెళ్తూ దొడ్డి గడపదగ్గర తారసిల్లాడు.

'రాత్రి బాగా పొద్దుపోయిందేంరా? సినిమాలా? నాటకాలా?'

'రెండూ కాదు మీరు కాఫీ తాగండి. అంతా చెబుతా' పాయజామా దానిపైన కుడతా వేసుకుని శంకరం తల దువ్వుకుంటూ తండ్రిదగ్గర కూర్చుని మొదలు పెట్టాడు.

'నేను మిలిటరీలో చేరిపోతున్నా నాన్నా. ఎల్లుండి బెంగుళూరు ప్రయాణం. ఆ ఏర్పాట్లతోనే రాత్రిళ్లు ఆలస్యమవుతోంది.'

'మిలిట్రీలో చేర్తావా?' అదిరిపడ్డారు రామనరసయ్యా, సావిత్రమ్మా.

'అవును. నేను ఎన్నిసార్లు పరీక్షకు కూర్చున్నా ప్యాసు కాలేనని మొన్నటితో ఋజువయింది. నాకు కావలసిన డబ్బు రక్తదానంచేసి సంపాయించాను. నాఖర్చులకు పోను వోవది ఎక్కువే సంపాదించాను. మిలిటరీలో చేరితే ప్రతినెలా మీకు కొంత డబ్బు పంపగలను. ఇక్కడుంటే నన్ను చూసి మీరు—మిమ్మల్ని చూసి నేను నిరుత్సాహపడటం తప్ప మరేమీలేదు. నన్ను సంతోషంతో పంపండి' లేచాడు కూర్చున్న చోటినుండి.

'ఆ మాత్రం ఉద్యోగం యిక్కడ దొరకదుట్రా? దానికి అంతదూరం పోవాలా' సావిత్రమ్మ ముఖం అప్పుడే దిగులుతో చిన్నబోయింది.

'దొరకదు. దొరికినా జీతం చాలా తక్కువ. నన్ను పోనీయండి' విసురుగా లేచి బయటికి వెళ్లాడు. నాలుగు అడుగులు వేసి మళ్లీ వెనక్కు తిరిగి 'నన్ను గురించి ఏమాలోచిస్తారు ? ఆ విమల కమలలను గురించి ఆలోచించండి. వాళ్లకు సర్రై చదువులు లేవు. పెళ్లి సంబంధాలను గురించి అనుకోవటంలేదు. అయినా నేను చెప్పేదేముంది? చిన్నవాడిని' పెద్ద పెద్ద అంగలు వేస్తూ వెళ్లాడు.

శంకరం వెళ్లేవరకూ ఆగి 'అవునే. చిన్నవాడయినా పెద్దమాట చెప్పాడు. వాడి



# జీవితవలయాలు

చదువుకు తగిన పథకాన్ని వాడు తయారు చేసుకున్నాడు. ఇకనుంచీ వాడి బ్రతుకు వాడు బ్రతుకుతాడు. ఇదీ మంచిదే' అని లేచాడు రామనరసయ్య.

'ఎంతపని చేశావురా శంకరం' సావిత్రమ్మ చిత్తరువులో బొమ్మలా నిలబడిపోయింది.

'వాడికేమే — వాడిని గురించి దిగులు పడతావు? లేలే. నాకాఫీసు వేళవుతోంది' రామనరసయ్య తొందరపెట్టాడు వంటకు.

తల్లి వెనకనే వంటయింట్లోకి వెళ్ళి 'అమ్మా — శంకరం చేసినపని మంచిది కాదనుకుంటున్నావా?' అన్నాడు శేషగిరి.

కనుబొమలు పైకెత్తి, తడిగా ఉన్న కళ్ళను విప్పిచూస్తూ 'నీకెలా ఉంది?' అన్నది.

'నాకా?' శేషగిరి కళ్ళు చక్రాలలా తిప్పుతూ 'వాడు చాలా మంచిపని చేశాడు. ఇక్కడి ఉద్యోగాలకంటె మిలిట్రీ ఉద్యోగం దర్జాగా ఉంటుంది. ఇప్పుడు యుద్ధాలు లేవు. వాడిని సంతోషంగా వెళ్ళనీయండి. వాడు చెప్పినటు కమల సంగతీ విమల సంగతీ ఆలోచించండి' తేల్చి చెప్పాడు శేషగిరి.

* * *

సావిత్రమ్మ మనసంతా అయోమయంగా ఉంది. అందరూ తలా ఒక మాటా చెప్పి ఆమెను సమాధాన పరచటానికి ప్రయత్నించారు; కాని ఆమె మనసు కుదుట పడలేదు.

శంకరం వెళ్ళేటప్పుడు అందరూ వాకిలి వరకూ సాగనంపారు. తన కాళ్ళకు దణ్ణం పెడుతున్న శంకరాన్ని పట్టుకుని గుండె పగిలేలా ఏడ్చింది సావిత్రమ్మ. అక్కడి నుంచి లేవలేక పోయింది. శంకరం వెళ్ళుతుంటే మృత్యు దేవతకు ఆహారంగా పంపుతున్నట్టనిపించిందామెకు. అంతే. మరి కన్నెత్తి అతడిని చూడలేక పోయింది.

శంకరం చాలా ఉత్సాహంగా ఉన్నాడు. జీవితంలో ఘనవిజయాన్ని సాధించినట్లుగా అందరికీ వీడ్కోలు చెప్పి ఠీవిగా నడుస్తూ స్టేషను చేరుకున్నాడు సూట్ కేసుతో.

* * *

రామనరసయ్య ఆఫీసు నుంచి త్వరగా వచ్చాడు. విసురుగా గదిలోకి వెళ్ళి కోటు, ఉత్తరీయం గోడకు తగిలిస్తూ 'ఇదిగో' భార్యను కేక వేశాడు.

ఆ ఇదిగో అన్నమాట ఎంత మెల్లగా అన్నా సరే — ఆమె ఎంత దూరము నుంచైనా వినగలదు. పెరట్లో అంట్లు తోముకుంటున్నదల్లా చెయ్యి కడుక్కొని, కొంగుతో తుడుచుకుంటూ ఏమిటంటూ వచ్చింది. వస్తూ గ్లాసెడు వేడివేడి కాఫీ తెచ్చి స్టూలు మీద పెట్టింది.

'ఏమాలోచించారని ఇవాళ రమాకాంత రావు మళ్ళీ అడిగాడు. ఇంకేమయినా సంబంధం ఉంటే చెప్పమన్నాను. ఒక కొత్త సంబంధాన్ని గురించి చెప్పాడు. అతడిని మన యింటికి తీసుకు రమ్మంటే తీసుకు వస్తానన్నాడు. రెక్కలే అతడికి ఆస్తి. నూరు రూపాయల జీతం ఉద్యోగం యింకా పర్మనెంటు కాలేదు.' కాళ్ళూ చేతులూ కడుక్కొని వచ్చి కాఫీ గ్లాసు అందుకున్నాడు రామనరసయ్య.

సావిత్రమ్మ తల వంచుకుని వింటున్నది.

'రమాకాంతరావుకు ఈ సంగతి ఒక రోజు ముందుగా చెబితే చాలు. అతడిని వెంట తీసుకు వస్తాడు.'

విమల పెరడంతా కలియ తిరిగి గోంగూర కోసుకు వచ్చింది. తల్లీ తండ్రీ మాట్లాడుతుంటే పొయ్యదగ్గర చేరింది. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నారంటే తన పెళ్ళిసంగతేనని ఆమెకు తెలుసు. తన పెళ్ళివిషయంలో వాళ్ళుపడుతున్న ఆదుర్దా అంతా ఆమె కనిపెడుతునే ఉంది. వాళ్ళ బాధను అర్థము చేసుకుంది. కాని—తను వాళ్ళకు ఏవిధంగా సహాయపడుతుంది ?

వాళ్ళు తీసుకువచ్చిన సంబంధం ఎటువంటిదయినా తలవంచుకుని చేసుకుంటే సహాయపడినట్లవుతుందా? ఈ ఆలోచన రాగానే ఆమెకు 'లవిటివాడు అయినా అందగాడు. కావలసినంత ఐశ్వర్యం ఉన్నది' అని తండ్రి తల్లితో చెబుతున్న మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. వెంటనే మనసంతా అల్లకల్లోలమయిపోయింది.

గోంగూర బాగుచేసి పప్పులోవేసి అన్నం వండింది. ముగ్గుపెట్టి లాంతర్లు తుడిచి వెలిగించింది. వాకిట్లో ఒకటి, హాల్లో ఒకటి తగిలించింది.



ఎనిమిదిగంటలకు ఎర్రబడిన ముక్కు తుడుచుకుంటూ సావిత్రమ్మ లేచి బయటకివచ్చి వంట ఇంట్లోకి తొంగి చూసింది. వంటంతా పొయ్యిమీద మూత పెట్టి ఉంది. మురళి భోజనం చేసిన పళ్లెం కడిగి గోడవారగా పెట్టిఉంది.

'మనసులో మాట మనసులో ఉండగానే అన్నిపనులూ చేస్తుంది. ఎవరో నేర్పినట్టు వంటచెయ్యటం— అనుభవం ఉన్నట్టుగా ఇంటిపనులు చేసుకుపోవటం— మనసెరిగి మాట్లాడటం బాగా నేర్చిన ఈ తల్లికి ద్రోహం చెయ్యటానికి మనసు రావటంలేదు' గాఢంగా నిట్టూర్చింది సావిత్రమ్మ.

పంచమి బుధవారంనాడు సావిత్రమ్మ ఇల్లంతా బూజు దులిపింది ఇల్లు నాలుగుమూలలా కడిగి ముగ్గు వేసింది. కాళ్లు విరిగిన కుర్చీ, కోళ్లు ఊడిపోయిన మంచం పెరట్లో పడేసింది. చినిగినకొసలు పైకి కనబడనీయకుండా సర్ది రెండు ఈతాకుల చాపలు హాల్లో పరచింది. గోడకు తగిలించిన పటాలు తుడిచి మళ్లీ తగిలించింది. ఇంకా నాలుగు మేకులు ఖాళీగా ఉంటే విమల కుట్టిన ఊలుపటాలతో ఆ హాలు అలంకరించింది.

సాయంకాలము నాలుగు గంటలకు సావిత్రమ్మ పాత మరచెంబులో పోసిన అటుకులు నూనెలో పోసి దేని ఉప్పూ కారం చల్లింది. రెండుగ్లాసుల కాఫీ ఎక్కువ చేసి మూత పెట్టింది.

పావు తక్కువ ఆరింటికి వర్షం పోయిం తరువాత రామనరసయ్య రమాకాంతరావును వెంబడి పెట్టుకుని వచ్చాడు. వాళ్ళ వెనకాలే మరో కొత్తమనిషి వాకిట్లో చెప్పులు విడిచి లోపల అడుగుపెట్టాడు.

రామనరసయ్య వాళ్ళిద్దరినీ చాపమీద కూర్చోబెట్టి—చెరొక విసనక్ర చేతికిచ్చి లోపలికి వెళ్ళాడు.

'అటుకులు బాదమాకుల్లో పెట్టి అమ్మాయిచేత పంపిస్తావేమిటి?' అన్నాడు ఉత్తరీయం సవరించుకుంటూ.

సావిత్రమ్మ బాదమాకుల్లో అటుకులు సర్ది విమలకోసం గదిలోకి వెళ్ళింది. విమల యింకా చీరె మార్చలేదు. తల మాత్రం దువ్వుకుని బొట్టు పెట్టుకుంది. కిటికీలో నుంచి బయటికి చూస్తోంది.

'ఏమిటి విమలా జాగు చేస్తున్నావు ? నాన్నా వాళ్ళూ ఎదురు చూస్తున్నారు. త్వరగా తెములు' సావిత్రమ్మ విమల కెదురుగా ముక్కుమీద వేలు వేసుకుని నిలబడి పోయింది.

కనుబొమలు ముడుచుకుంటూ విమల పెట్టెలోనుంచి ఇస్త్రీ చీరెతీసి కట్టింది. కుచ్చెళ్లు సరిచేసుకుంటూ వంటయింట్లోకి వెళ్లి ఒక్కొక్క బాదమాకు తెచ్చి వాళ్ల ముందు ఉంచింది.

'అమ్మా మంచినీళ్లు' రామనరసయ్య ఆమెను పలకరించాలని అన్నాడు.

కాఫీ మంచినీళ్లు నాలుగు విడతలలో విమల అందించింది.

'విమలా—ఇలా కూర్చో.'

ప్రాణంపులా నిలబడిపోయిన విమల వెళ్లి తండ్రి కెదురుగా కూర్చుంది. ఆమె కళ్లు అప్రయత్నంగా రమాకాంతరావు ప్రక్కగా కూర్చున్న ఆయన మీద పడ్డాయి.

ముఖం ఎండిపోయి పీక్కుపోయింది. నలుపూ తెలుపూ కలగలుపుగా వున్న క్రాపు — ఎండిపోయిన దవడలు—కాయకాసిన కన్నూ విమలను కన్నార్పకుండా చేశాయి. అతడు మాట్లాడుతున్నప్పుడు మాట తొస్సిపోయింది. ఒకటో రెండో పళ్లు రాలి వుంటాయని విమల ఊహించింది.

పావుగంటసేపు కూర్చున్నారు వాళ్లు. ఏవేవో ప్రశ్నలు అడిగారు. విమల వంచిన తల ఎత్తలేదు. రామనరసయ్యే సమాధానాలు చెప్పాడు. తరువాత ఆఫీసు రాజకీయాలు మాట్లాడుకోవటం మొదలు పెట్టారు. విమల మెల్లగా లేచి బయటికి వస్తుంటే గుమ్మంలో నిలబడ్డ సావిత్రమ్మ ఎదురుపడ్డది.

తొమ్మిదిగంటలు కాగానే విమల అందరికీ పక్కలు పరచింది. మురళి కమల పడుకున్నారు. ఆమె వాళ్ళదగ్గర చోటు చేసుకుని పడుకున్నది. ఎంతకూ నిద్ర రాలేదు. ఆ పెళ్లికొడుకే కళ్లకు కట్టినట్టు కనబడుతున్నాడు పక్కమీదదొర్లుతూ పదకొండుగంటలు కొట్టటం విన్నది.

'నాకు అతడేం నచ్చలేదండి.'

'నాకూ అలాగే అనిపించిందే.'

'అయితే ఏం చేద్దాం?'

'చూడుమరి మన కళ్లయెదుట ఉన్న సంబంధాలు రెండు. వాటిలో ఒకటి బొత్తిగా హీనంగా వుంది. మరొకటి అంతా బాగుంది కాని అవిటివాడు. ఏం చేద్దాం చెప్పు!'

'దీనికంటె అదే నయంగా ఉండేటట్లుంది' సన్నగా మూలిగింది సావిత్రమ్మ.

'అయితే మాట్లాడమంటావా?' సంతోషంకొద్దీ కంఠధ్వని హెచ్చించాడు రామనరసయ్య లేచికూర్చుంటూ.

తల్లిదండ్రుల మాటలు స్పష్టంగా విన్నది విమల. ఈ రెండు సంబంధాలలో ఒకటి తనపాలపడటం తథ్యం. భయంతో విమల దేహం జలదరించింది. తెల్లవారు ఝామువరకూ అలా పక్కమీద దొర్లిన విమలకు నిద్ర ముంచుకు వచ్చింది. కరకర ప్రొద్దు ఎక్కుతుండగా దిగ్గున లేచింది.

* * *

రఘురామయ్య దగ్గరనుండి అనిత గోపీ ఎడ్రసు సేకరించింది. ప్రతిరోజూ రాత్రి ఎనిమిది గంటలకు గోపీకి ఉత్తరం వ్రాయాలని బల్లముందు కూర్చుంటుంది. ఎన్నో కాగితాలు చింపుతుంది. పదకొండు గంటలవరకూ అలా ప్రయత్నించి, ప్రయత్నించి విసుగుపుట్టి చేతులు పిసుక్కుంటూ వెళ్లి పడుకుంటుంది.

రోజులను వారాలుగా—వారాలను నెలలుగా కాలచక్రం మార్చివేస్తున్నది.

సాయంకాలము ఆరుగంటలయినా వడగాడ్పు కొడుతూనే ఉన్నది. ఇంటిముందు లానులో కూర్చుని సిగరెట్టు కాల్చి పారేస్తున్న ప్రొఫెసరు నిరంజనానికి కారు దిగి విసురుగా లోపలికి పోతున్న అనిత కనబడ్డది. తండ్రి ఒంటరిగా కూర్చుని ఉండటం చూసి ఆమె తన వేగాన్ని మరింత హెచ్చించిదింది.

'అనితా' దిక్కులదిరేటట్టు కేక పెట్టాడు.

చీరె మార్చుకుని అరగంట తరువాత మెల్లగా కిందికి దిగి వచ్చింది. అపరాధిలా అడుగులో అడుగువేసుకుంటూ వెళ్లి ఆయన ప్రక్కన ఉన్న కుర్చీలో కూర్చున్నది.

'ఈ సెప్టెంబరులోనయినా ఆ సబ్జక్టు పూర్తిచెయ్యాలమ్మా'

పిడుగులు రాల్తాయని ఎదురుచూసిన అనిత ఆయన మాటలలోని మార్దవానికి ఆశ్చర్యపడ్డది. సమాధానమివ్వకుండా తల

వంచుకున్నది:

'ఎంతమోసం చేశాడు— ఎంత మోసం చేశాడు ? నాలుగు వేలరూపాయలు నేరక జేబులో పెట్టుకున్నాను. తెల్లవారితే బ్యాంకులో జమ కట్టాలనుకున్నాను. దొంగ—ద్రోహి—పరారి అయ్యాడు. అతడికి ప్రిన్సిపలూ, రఘురామయ్యా సహాయం చేశారు' నిప్పులు కక్కాడు.

అనిత తలవంచుకుంది. ఉండి ఉండి తండ్రి ముఖంలోకి చూస్తున్నది. ఆమె గుండె గబగబ కొట్టుకోవటం మొదలు పెట్టింది.

'నాలుగువేలది ఒక సమస్యకాదు. కాని ఇదెట్లా? నా పరువంతా మంట కలుస్తున్నది కాలేజీలో'

'పాటివాళ్లలో తలెత్తుకుని తిరగకుండా అయింది.'

అనిత దిగ్గునలేచి లోపలికి వెళ్లింది. ప్రొఫెసరు నీరవుడై కూర్చుండిపోయాడు.

ఆర్రాత్రి భోజనాలదగ్గర ఇద్దరూ మాట్లాడుకోలేదు. ఆమెలేచి తన గదిలోకి వెళ్లిపోయిన తరువాత ఆయనకు తటాలున ఒక ఆలోచన మెదడులో పరుగు తీసింది. అనిత ఆత్మహత్య చేసుకుంటుందేమోనని రెండు ప్రాణాలను నిలుపునా తీసిన పాపం తనకు చుట్టుకుంటుంది. ఆయనకు కలవరపాటు అధికమై ఆగదిలో అటూ ఇటూ పచారు చెయ్యటం మొదలుపెట్టాడు.

అనిత గదిలో మంచంమీద దొర్ల నారంభించింది. ఆమె ఆలోచనలు ఒకరికి చేరుకోలేదు. చదవటానికి ప్రయత్నించింది. సాగలేదు. గోపీకి ఉత్తరం వ్రాయటానికి పూనుకున్నది. రెండుసార్లు కాగితాలు చింపింది.

ప్రియమైన గోపాల్

ఆనాడు నీతో మాట్లాడటానికి అయిదు నిమిషాలటైము అడిగితే ఇవ్వలేకపోయావు. నాగాలి సోకితేనే మైలపడతానని దూర దూరంగా వెళ్లావు. అప్పటి నీముఖం చూస్తే నన్నెంత అసహ్యించుకుంటున్నావో తెలుస్తుంది.

అయినా నీదేం తప్పు? మా యింట్లో ఎంతో సభ్యతతో వినమ్రతతో మెలిగావు. నీ పుస్తకం చదువుతూ ఉంటే పరధ్యానంగా ఉన్న నన్ను పలకరిస్తూ నూరిపోశావు.



నా తప్పులనూ నా చిలిపితనాన్ని మానాన్న కంటపడకుండా కప్పిపుచ్చావు. నామీద నీకు సహజంగా ఉన్న జాలివల్ల, నేను ఎలాగయినా పరీక్ష ప్యాసయ్యేటట్టు చూడమని మానాన్న నీమీదపెట్టిన భారం వల్ల నీ బాధ్యతలను నీవు నిర్వహించటానికి ప్రయత్నించావు.

కాని — నా బుద్ధిలోపానికి నీవేం చేస్తావు? కామేశం పన్నిన వలలోనుంచి నేను బయటపడలేక పోయాను. సర్వనాశనమయి భ్రష్టనై బయటికి వచ్చాను. కొంత కాలానికిగాని నా పరిస్థితి నాకు అవగాహన కాలేదు.

అయినా ఈ స్థితిలో కూడా నేను కామేశాన్ని నిందించను. నన్ను మొదట పెళ్లి చేసుకుంటానని, తరువాత చేసుకోనని కామేశం మోసగించలేదు. అతడు నాతో మాట్లాడితేనే చాలు— స్నేహం చేస్తేనే చాలు నా జన్మ పావనమవుతుందని నేనే వ్యామోహానికి లోనైనాను. నేనే అతడిని కవ్వించాను. కవ్వించి కవ్వించి లొంగిపోయాను.

కాని—ప్రకృతి స్త్రీపైన మోపిన గురుతర బాధ్యతనుండి తప్పించుకోవటానికి నాకేం శక్తి ఉన్నది ?

నాన్న కెవరో ఆకాశరామన్న ఉత్తరం నీమీద వ్రాసి పంపారు. బహుశః కామేశమే అయి ఉంటాడు. ఆనాడే నాన్న నాలుగువేలు తెచ్చి యింట్లో పెట్టారు. నాకు కనువిప్పయినా కామేశంమీద వ్యామోహం పోలేదు. కామేశం అడగగానే నాన్నకు తెలియకుండా ఆ నాలుగువేలూ తీసియిచ్చాను. ఈ రెండు నేరాలూ నీమీదికి వచ్చాయి. నీవు వెళ్ళేనాడు స్టేషనులో నాన్న గొడవచేశారని విన్నాను. ఆ ప్రిన్సిపల్‌గారు కనుక ఎదురుగా లేకపోతే నీ పని ఆ వేళ ఏమయ్యేదో ?



నిరపరాధివి—రాజమార్గము తప్ప గొందులెరుగని పరమ పవిత్రమూర్తివి—నీకు నావలన కలిగిన కష్టనష్టాలకు నా మనసు ఎంత బాధ పడుతున్నదో చెప్పనలవికాదు.

అయితే ఈ అపవాదులూ ఈ కష్టాలూ నీకు తాత్కాలికమయినవి. మబ్బులు విచ్చిపోగానే నిండు చంద్రుడిలా ప్రకాశిస్తావు.

నీవు నిరపరాధివనీ—నిష్కల్మష హృదయుడవనీ నాన్నతో చెప్పాలని ఎన్నిమార్లో ఆయన గదివరకూ వెళ్లి వెనక్కి తిరిగాను. నిజం చెప్పటానికి నా గొంతులో ఏదో అడ్డం పడుతున్నది.

ఇంత జరిగినా నీవు అదృష్టవంతుడవు. నీ అదృష్టానికి నా అభినందనలు. ఇది జరిగిన వెంటనే విదేశాలలో విద్యాభ్యాసము నీకు లభించింది. నీవు తిరిగి వచ్చే సరికి ఎక్కడి వక్కడ సర్దుకుంటాయి.

నేను నా జీవితాన్ని ఎలా సరిదిద్దుకుంటానో—ఏం చెయ్యగలనో—ఇంకా నేను ఒక నిర్ణయానికి రాలేదు. ఇదంతా నీకు చెప్పాలనే ఆనాడు నిన్ను టైము అడిగాను. నీవు ఇవ్వక పోవటమే మంచిదయింది. ఎందుకంటే నేను ఇన్ని విషయాలు ఇంత విపులంగా నీతో ముఖాముఖి చెప్పలేక పోయేదాన్ని.

నీవు నా సహాధ్యాయివయినా నా గురుపీఠాన్ని ఆక్రమించావు. నీ పాదాలను నా కళ్లకు అద్దుకోవాలని అనిపిస్తోంది. నేను నీపట్ల చేసిన అపరాధాలకు నన్ను మనసారా క్షమించు. నీ చదువు నిరాటకంగా సాగిపోవాలనీ నీవు గొప్ప సర్జన్‌వు కావాలనీ నా ఆకాంక్ష.

అభాగ్యురాలు

అనిత'

ఉత్తరం చదువుకుని తన మీద పడిన పర్వతమంత బరువును ఎవరో దించినట్లుగా తేలిక పడిన మనసుతో బరువుగా గాలి పీల్చుకున్నాడు గోపీ.

(ఇంకా ఉంది)




యస్. పి. హైదరాబాదు

కొత్తపెన్ను కొన్నాము దానితో మీకే మొదటిఉత్తరం రాస్తున్నాము. మీరు నెలకు ఎన్నిసినిమాలు చూస్తారు? శ్రీవారితో కలిసి వెడతారా? లేక?...

కొత్త పెన్నుకి శుభాకాంక్షలు!! నెలకెన్ని అవి సినిమాలు చూడ్డం మధ్య తరగతివారికి కుదరని పని. అడపా తడపా వెడతాను. శ్రీ వారితో వెడితే పిల్లల్ని వెంట పెట్టుకు వెళ్లను. పిల్లల్ని తీసుకు వెడితే శ్రీవారిని వద్దంటాను— అది నా పద్ధతి! ఒక్కర్తైనీ సినిమాకి వెళ్లి ఎంజాయి చేసే అల వాటు లేదు.

లక్ష్మి, కాకినాడ

ఆంధ్రపత్రిక ద్వారా పరిచయంచేసిన శ్రీమతి విద్యా కనకతంగంగారి చిరునామా తెలుప కోరుతాను...

ఇదివరకు 'విద్యాస్ బ్యూటీ క్లినిక్' రాయ పేటా హైరోడ్డు, మద్రాసు 14. ఆమె చిరు నామా ఏదైనా మారిందేమో తెలియదు మరి.

పి. హెచ్. పి, గుంటూరు

పార్టీలుమారే నేటి రాజకీయ నాయ కులను ఏమనాలి?

ఏ ఎండ కా గొడుగు పట్టే నేర్పరులు అనేనా అనవచ్చు. స్వార్థమే కాని పదార్థం ఎరుగని అమా యకులు అనేనా అనవచ్చు. కాదంటే వ్యక్తిత్వం లేని ఆదర్శానికి నిలబడలేని నినాయకులనేనా అన వచ్చును. మీ ఇష్టం.

కె. ఎస్, హైదరాబాదు

ఎవరినీ ఎక్కువగా ప్రేమించ వద్దం టారు. అయితే భగవంతునికూడా?

ఆహా. భగవంతుని సహితం. అతని ఎక్కడైనా వదలి పెట్టాల్సిందే.

ఎన్. జె. కర్నూలు.

శరత్ బాబు 'దేవదాసు'పై మీ అభి ప్రాయం ఏమిటి?

శరత్ సాహిత్యం వంగీయుల రసగుల్లా లాగే చప్పగానూ తీయగానూ ఉంటుంది. ఆ రుచులు ఇష్టమైతే అమోఘంగా ఉంటాయి. లేకపోతే దిగమింగడం కష్టం. శరత్ సృష్టించిన వెన్నె ముకల్లేని హీరోలలో పెద్దపీట దేవదాసుకే వేయాలి. అసలు దేవదాసు పార్వతిని ఎందుకు పెళ్లాడలేదు? మళ్లీ ఎందు కంత కుంగిపోయాడు — అర్థం ఉందా?!

యస్. ఇ. బి, గుంతకల్లు

భార్య తనభర్తకంటె ఒక సంవత్సర మైనా చిన్నది అయిఉండాలంటారు. కార ణం ఏమై ఉంటుందో?

ఏముందీ సాధారణంగా భార్యలు బాధ్యతలవల్ల నైతేనేం,త్వరగా వయస్సు మీరినట్లు అయిపోతారు. అందుకే నలభై ఏళ్ల పురుషుడికీ అదే వయస్సు కల స్త్రీకి అంత తేడా! అందుకే భర్త కంటే భార్య చిన్నదైతే బాగుంటుందని. నిజానికి తమ కంటే వయస్సులో చాలా పెద్దవారైన స్త్రీలని ప్రేమించి పెళ్లి చేసుకున్న పురుషులు లేకపోలేదు.

ఎల్. ఎన్. ఆర్. అనంతపురం

భార్యాభర్తలమధ్య రహస్యా లుండకూడ దన్నారే మీరు. భర్త తనుచేసిన పాడు పనులన్నీ భార్యతోచెప్తే ఆమె కతడిపై ఎటువంటి అభిప్రాయం ఉంటుందంటారు?

బాగుంది— నిజాన్ని మరీ అలా సూటిగా 'కదుళ్లు వెదుళ్లు గరుడస్తంభా'లన్నట్టు చెప్తే ఎలా— డిప్లమెసీ ఉండకపోతే వచ్చే చిక్కు అది. పాడు పనులు చేసినట్లు అతగాడు చెప్పినా ఆమెగారు తనకి తానై గ్రహించినా— ఆ అభిప్రాయం ఏలాం టిది ఉంటుందో వూహించ వచ్చు. కాని ఆడది కనుక, ఓర్పు ఎక్కువ కనక, అతని అండన బతక్క తప్పదు కనక — క్షమించుతుంది, పట్టించుకోదు. మరిచి పోదామని అనుకుంటుంది.

వి. ఆర్. ఎస్. చేబ్రోలు

చాలామంది సెక్సు పుస్తకాలు చూడ్డం వల్ల చెడిపోతున్నారా?

చెడిపోయే వాళ్ళు— పుస్తకాలు చదవకుం డానూ, సినిమాలు చూడకుండానూ కూడా చెడి పోతారు— ఇదో వంక అంతే.

బి. ఎన్. అర్, కాకినాడ

నాకు నత్తి ఉంది......

మాట్లాడే టప్పుడు స్పీడు తగ్గించి మాట్లా డ్డం అలవాటు చేసుకోండి. బుగ్గలో చిన్నసైజ గోళీలు పెట్టుకుని మాట్లాడ్డం ప్రాక్టీసు చేయండి— నత్తి కంట్రోల్ అవుతుందంటారు. అనవసరమైన భయాలు, ఆత్మ విశ్వాసం లేక పోవడం కూడా నత్తికి దారి తీస్తాయి. ధైర్యంగా, నిర్భయంగా నలుగురిలో కలిసి తిరగండి.





యఱ్ఱంశెట్టిశాయి

కొంపలు మునుచుకుపోయినట్లు బాజాలు మ్రోగుతున్నాయి పెళ్ళిపందిట్లో. ఆ మోతకి కొంచెం ఎక్కువ స్థాయిలోనే మంత్రాలు వల్లించేస్తున్నాడు పురోహితుడు. పెళ్ళికూతురు మెడలో మంగళసూత్రం ముడిపడింది, ఎవరో 'అక్షింతలు' అంటూ పిట్టలాకూశాడు. చూడ్డానికి బావుందా దృశ్యం. కాని తనకి అంతకంటె బావున్న దృశ్యం మరోటివుంది. వివాహమండపం వెనకాల పందిరిగుంజ కానుకుని అందంగా నుంచున్న ఓ రెండు జెడలమ్మాయి. గాడెస్ ఆఫ్ బ్యూటీ! ఆ అమ్మాయి తెల్లగా ప్రాలాయిలాలేదు. లెట్ ది ప్రాలాయ్ గో టూ హెల్! నల్లని ఆ కాటుక కళ్ళు— బహుశా ఈ టైపులో బ్రహ్మదిదే మొదటి సృష్టి. తను ఆరేళ్ళ హైస్కూల్లో, అయిదేళ్ళ కాలేజీలో చదివేడు. మామయ్యల పెళ్ళిళ్ళు, పిన్నమ్మల పెళ్ళిళ్ళు అక్కయ్యల పెళ్ళిళ్ళు అన్నీ చూశేడు కాని ఇంత అందమయిన దేవత ఇంతవరకూ ఎక్కడా కన్పించలేదు. 'లవ్వెట్ ఫస్ట్ సైట్' అని అతగాడెవరో అన్నారంటే అనరూ మరి! చచ్చినట్లు అని తీరాలి. హాయ్...హాయ్... ఆ అమ్మాయి తనవంకే చూస్తోంది.

'ఓ, స్వీట్‌గాల్! ప్లీజ్, అలాగే చూస్తూండు. ఇప్పుడు ఆ యముడుగాడు నా ప్రాణం తీసుకెళ్తే నేనబ్జెక్ట్ చెయ్యను. పైపెచ్చు అతగాడికో 'బీర్' బాటిల్ ఆఫర్ చేస్తాను. తెలుసామ్మయ్? గ్రహించావా? దీనర్థం నీ చూపులకోసం నా ప్రాణాన్నే లెక్కచెయ్యనని అంతే! అంతేగాని నా ప్రాణం తీసుకుపొమ్మని యమునికిది స్వాగత పత్రంకాదు...అరెరె! చూపులువాల్చేశావేం? దారితప్పిన లేడిపిల్లలా ఖంగారుగా అటూ ఇటూ చూస్తావెందుకు? మనిద్దరినీ ఎవరయినా చూస్తున్నారేమోననా! డియర్ పిచ్చమ్మాయ్! భయమెందుకు? 'టీన్స్'లో ఉన్న అమ్మాయిలకి కొన్ని అధికారాలున్నాయి. అందులో ఇలా చూచుకోడం కూడా ఒకటి. ఏం? అంచేత భయపడకు. నువ్వెన్నో 'టీన్స్'లో ఉన్నావో నాకు తెలీదు పోనీలే! లేకపోయినా ఫర్లేదు. ఇంకొక్కసారి నావంక చూడవూ? ... ఊఁ! అదీ! అప్పుడే వాల్చెయ్యకు మరి. అబ్బ! ఇప్పుడెంత అందంగాఉన్నావోతెలుసా? ఊహుఁ! నీకు తెలిసుండదు. తెలిసుంటే వాటిని ఇంత విరివిగా ఈ దీనుడిమీద ఖర్చుపెట్టెయ్యవు. అదిగో! మళ్ళీ తల దించేశావ్! భూమిలో ఏముందనమ్మా అలా క్రిందికి చూస్తావ్? అది సరే! రెండు జడల్లోనూ ఒహటి ముందు కేసుకొన్నావ్? అది ఎంత అందంగా అమిరిందో నీకు తెలుసా? అసలీ అయిడియా ఎవరిచ్చారు నీకు? ఫూలిష్‌నెస్! ఒకళ్ళివ్వడమేమిటి? అందమైన అమ్మాయిలకి అయిడియాలు కూడా అందమైనవే వస్తూంటాయి. ఈ ఐడియా నీదే కదూ? నాకు తెలుసు మేడమ్! ఇక 'టీన్స్' ఏజ వాళ్ళ రెండో హక్కేమిటో తెలుసా? చిరునవ్వులు చిందించడం! నిజం! అయామ్ నాట్ జోకింగ్! ఏం తప్పులేదు. నేను మన హక్కుల్ని గురించి చెప్తున్నాను. మన డ్యూటీలు కూడా కొన్ని ఉన్నాయనుకో! కాని వాటికీ, వీటికీ పడిచావదు. ఏదో ఒహటే ఫాలో అవాలి. అంచేత మనం హక్కులే ఫాలో అవుదాం! నువ్వు నవ్వితే వో వింత అందంతో మెరిసిపోతావు. నాకు తెలుసు. కాని ఆ నవ్వులు నా కోసం చిందిస్తే నేనెంత ఆనందంలో మునిగిపోతానో నీకు తెలీదు. ప్లీజ్! ఒక్క చిరునవ్వు నరికెయ్! అదిగో! నావంక చూసి మళ్ళీ అటూ ఇటూ చూస్తున్నావ్! ఆల్‌రైట్! నీకు భయంగా వుంటే నేనే నీకో చిరునవ్వు విసుర్తాను! కానీ కండిషనల్! తరువాత నువ్వు నవ్వాలి. ఏం?...హాయ్ హాయ్! అద్భుతంగా నవ్వేవ్ లిటిల్‌గాల్! నీ పేరేంటో నాకు తెలీదు. నీతో కొంచెం మాట్లాడాలి ఎప్పుడు? ఎక్కడ? అయ్ లైక్ ప్రైవేసీ! ఏం? ట్రై చేస్తావా?'

'ప్రజంటేషన్లు చదివించండి...' వో దురాత్ముడు అరచాడు. చాలామంది అల్లకల్లోలంగా మండపం వేపు పరుగెత్తి చుట్టూ గుంపుగా మూగేశారు. ఆ అమ్మాయి అసలు కనపడ్డంలేదు, ఒరే రాక్షసాస్! తప్పుకోండి! నా దేవత కనపడ్డంలేదు. ఆల్‌రైట్! నేనే ఆవిడ దగ్గరగా వెళ్తాను—వెధవకుర్చీలు...మరీ దగ్గర దగ్గరగా అఘోరించేరు. వీటన్నిటినీ దాటుకొంటూ వచ్చేసరికి అయిదు నిమిషాలు పడుతుంది. అరె! ఆ అమ్మాయేదీ? ఎటు పోతివో సఖీ! ఇంత న్యాయం చేయడం బావుందీ? నీదింత రాతిగుండెనుకోలేదే! ఇప్పుడు నీకోసం ఈ బిల్డింగంతా వెదకాలి. మేడమీద వెతకాలి. పెరట్లోని పూలతోటంతా కలియతిరగాలి. సరేకానీ! వెదుకుతాను. హాల్లో నువ్వులేవు. ఉంటే ఈ హాలు ఇంత చీకటిగా ఉండివుండదు. వెలిగిపోతూండేది. అందులో నువ్వు దీపానివి మేడమ్! నిన్ను పెళ్ళాడినవాడికి ఎలక్ట్రిసిటీ ఖర్చుండదు: పవర్‌హౌస్‌లా ఇంట్లో వెల్తురు నింపుతుంటావు ... అరెరె! మా అమ్మ ఎదురొచ్చేసింది. డేంజర్! ఛంపేస్తున్నావ్ మమ్మీ! నీ కొక్కడినే కొడుకునవటం నా ప్రాణానికొచ్చింది. అక్కయ్యల్లాగా నేనూ ఆడపిల్లనయి పుట్టినా బాగుండేది. కానీ పుట్టలేదు. ఎలా ఛావను? ఎప్పుడూ నీకొంగుపట్టుకొనే తిరుగుతుండాలంటావ్! ఎలాగోలా ప్రొద్దుట్నుంచీ నీక్కనబడకుండా తప్పించుకు తిరిగాను. అందుకు ఇప్పుడు లక్ష ప్రశ్న లేస్తావ్!

'ప్రొద్దుట్నుంచీ ఎక్కడా కనబడవేంరా! ఫ్లాస్కులో వోవల్టిన్ త్రాగవేం! ఆరోగ్యం దెబ్బతినేస్తుం'దంటవ్! డబ్బున్నవాళ్ళింట్లో ఛస్తే ఒక్కడే కొడుకయి పుట్టగూడదు.

ఓ వేళ ఖర్మగాలి పుట్టాడా చచ్చాడన్నమాటే! వాడికేమీ స్వాతంత్ర్యం వుండదు. అన్నిటికీ అడ్డుగోడలు. ఎండల్లో తిరగ్గూడదు. ఎండాకాలం వడగొడుతుంది. వానలో తడవకూడదు. వానాకాలం జలుబు చేస్తుంది. చలిలో వణకకూడదు. చలికాలం చలిజ్వరం వస్తుంది. కారులో కాలేజికెళ్ళి మళ్ళీ కారులో ఇంటికొచ్చెయ్! ఆటలాడొద్దు. అలిస్తే జ్వరం వచ్చేస్తుంది. రాత్రిళ్ళు ఎక్కువసేపు చదవొద్దు. సినిమాలు చూడొద్దు. కళ్ళు గోవిందా! చదువయింతర్వాత ఉద్యోగం చేయొద్దు. ఉద్యోగాలు మనకెందుకు? జీవితమంతా ఎక్కడికీ కదలకుండా, ఏమీ చెయ్యకుండా, ఇంట్లోనే ఉరేసుకు ఛావు! నాన్సెన్స్! బ్రతకడంకోసం బ్రతకడమయి పోయింది.

'ప్రొద్దున్నుంచీ కనబడవేంరా? నీ కోసం వెదకలేక ఛస్తున్నాను. ఇట్రా! స్వరాజ్యం పిన్ని నిన్ను చూడాలంటోంది...'

'అహా! ఏమీ నీ మాయా! తన ప్రాణానికి ఎవరో స్వరాజ్యం పిన్నిట. ఆ పేరే ఇంతవరకూ విన్లేదు తను...'

'ఇడిగోనే స్వరాజ్యం మావాడు! కలవరిస్తున్నావుగా! ఎప్పుడో చిన్నప్పుడు చూశాననీ!' ఆవిడేగాబోలు స్వరాజ్యం పిన్ని. నవ్వుతూ వచ్చింది. ఆవిడ జుట్టు అక్కడక్కడ తమాషాగా నెరిసింది. అందంగానే వుంది స్వరాజ్యంపిన్ని. తనని చిన్నప్పుడు చూసిందట. అసలు గుర్తే లేదుమరి.

'ఏమోయ్! నేనేమయినా గుర్తున్నానా? కొంచెమయినా? వోరెణ్ణెల్లపాటు నిన్ను ఆటలాడించి జోలపాటలు పాడి నిద్రపుచ్చానోయ్ చిట్టీ! ఎప్పట్నుంచో నిన్ను చూడాలని పీకేస్తోంది మనసు. తెలుసుటోయ్! నవ్వుతావేం? ఆడదానికి పిల్లల మీద ప్రేమ అలాంటిది బాబూ! అయిదేళ్ళ క్రితం వోసారి వచ్చాను. కానీ దొరగారు అప్పుడు ఇంట్లోలేరు. మీక్లాసు పిల్లలందరూ కలసి సౌత్‌టూర్ వెళ్ళార్టగా! అమ్మ చెప్పిందిలే! పోనీ! ఇప్పటికయినా చూశాను. చాలా పెద్దాడి వయిపోయావ్! మరి త్వరగా పెళ్ళిచేసుకోరాజా! అమ్మ చెపోతోంది. పెళ్ళివద్దని గొడవ చేస్తున్నావటగా! ఏం? ఎందుకని? కాలేజిలో ఎవరయినా వో చిన్నదాన్ని చూసుకోలేదు కదా? అలాంటి దేమయినాఉంటే చెప్పెయ్! మీ అమ్మకి రికమెండ్ చేస్తాను...'

'స్వరాజ్యం!...' ఎవరో పిలచారావిడని. నవ్వుతూ వెళ్ళిపోయిందావిడ.

'అబ్బ! ఈ ఆడాళ్ళ వాగ్ధాటే వాగ్ధాటిరా దేముడా! తాము గుక్క త్రిప్పుకోరు. ఎదుటి వాళ్ళని త్రిప్పుకోనీరు!...అది సరే! ఈ స్వరాజ్యం పిన్నెవరు మమ్మీ! ఎప్పుడూ కనబళ్లేదే...'

'అవునురా! వాళ్ళు బొంబాయిలో వుంటున్నారు. మేమిద్దరం అప్పాచెల్లెళ్ళ కూతుళ్ళం. ఇప్పుడు వల్లి మామ్మ, రంగమ్మ మామ్మా...'

'దట్సాల్‌రైట్ మమ్మీ! స్వరాజ్యం పిన్ని నీకజిన్! అంతే మిగతా ఫ్లాష్‌బాకంతా చెప్పకు. హిందీ సినిమాలాగా!... సరే...కాసేపలా తిరిగొస్తా!...ఏం?...'

హమ్మయ్య! గొడవదిలి పోయింది. ఇంతకూ ఈ బొమ్మ ఎక్కడ దాక్కొన్నట్టు, వోవేళ మేడమీద చెలికత్తెలతో విహరిస్తోందేమో! చూస్తేసరి. ఈ మేడమెట్లిల్లా వంకర్లు తిరిగి పోయినయ్యేమిటి? ఇదేం ఫాషన్‌దేముడా? నాట్యం రానివాళ్ళు రెండుసార్లు ఇవి ఎక్కిదిగి రవీంద్రభారతిలో బ్రహ్మాండమయిన స్నేక్ డాన్స్ ప్రదర్శనం లిచ్చెయొచ్చు. అదిగో స్వీట్‌హార్ట్! గదిలో ఇద్దరు సిసింద్రీ జాతి అమ్మాయిలతో మాట్లాడుతూ కిలకిల నవ్వుతోంది. మరీ అంత అందంగా నవ్వేసి నా ప్రాణం తీసెయ్యకుదేవీ! మేడంతా చిందర వందరగా పరిగెత్తేస్తూన్న ఈ మైనర్ పిల్లకాయలు అల్లరితో ప్రాణాలు తోడేస్తున్నారు. వెధవగొడవ! ఇలాంటి చోట ఎందుకొచ్చావ్ సుందరీ!

'ఒక్కసారి; నీతో మాట్లాడాలి!' ఇలా అని నాకళ్ళు నీకు చెప్పటం లేదూ! దొంగవి. వినేవుంటావ్! కాని విననట్లు నటిస్తున్నావ్! ఈజనాభా అందరినీ అయిదునిమిషాలు ఎక్కడికయినా ఎక్స్‌పోర్ట్ చేద్దా! మన ఆ అయిదునిమిషాల మాటలు తల్చుకొంటూ గుండెలమీద చెయ్యేసుకొని యాభైఏళ్ళు బ్రతికేస్తాను. నిజం! నీ మాటల్లో ఆక్సిజన్ వుంది. త్వరగా రాణీ! షోకేసుల్లా ఉన్నవాళ్ళిద్దరితో ఏం జత నీకు? నాకేం నచ్చలేదు. మళ్ళా మనకి ట్రైంగూడాలేదు. సాయింత్రం ఏడింటికల్లా మాఅమ్మ నన్ను ఇంటికి తీసుకెళ్ళిపోయి' ఎయిర్‌కండిషన్డ్ గదిలో, వాబెడ్‌మీద పడుకోబెట్టేసి, జోలపాడేస్తుంది. ఇది హాస్యంకాదు. మా అమ్మప్రేమ. ఇంకా చెప్పాలంటే ఒక్కడే కొడుకు నవడం మూలాన నాకొచ్చినచావు. లయ్యో! వెళ్ళిపోతున్నావేం? చూపులలా నామీద గుచ్చుతావెందుకూ? నిన్ను నేనేం వెళ్ళమనలేదే? నీకూ వెళ్ళాలనిలేదు. నీనడకే చెపుతోందా సంగతి. జాలిలేని ఆ శూర్పణఖ మార్కు

# ఇది కన్నీరు

పిన్నర్పు నిన్ను లాక్కెళ్ళిపోతున్నారుకదూ! దానిక్కారణముంది. నీభుజంమీాద చేయివేసి నడుస్తున్న ఆపాలరాయి రంగుపిల్ల లేదూ! ఆపిల్లని పెళ్ళాడమని, వాళ్ళ తల్లిదండ్రులూ మాఅమ్మా కలిసి కొన్ని రోజులు నన్ను పోరేశారు. కానీ నేను ఒప్పుకోలేదు. ఎందుకని అడక్కు! ఆదంతే! నేనో పెక్యూలియర్ వెధవాయిని. తెల్లగా, ఎర్రగాఉన్న అమ్మాయిలు నాకునచ్చరు. ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ అనుకోకు! అదేం కాదు. కానీ, చెప్పానుగదా! పెక్యూలియర్ మెంటాలిటీ! నాకు చాలా సాధారణమయిన మామూలు అమ్మాయి కావాలి ఆ అమ్మాయి అచ్చం నీలాఉండాలి. ఇదే! ఇదే నేను కోరుకొంటూవచ్చాను. అంచేత ఆ అమ్మాయికి నిర్దాక్షిణ్యంగా 'గుడ్‌బై' చెప్పేశాను. ఈఒక్క అమ్మాయేకాదు సీనస్! వోపాతిక మంది 'మిస్ ఇండియా'లాంటి వాళ్ళని తీసుకొచ్చి చూపించింది మా అమ్మ! ఛస్తే ఒప్పుకోలేదు. ఎందుకు ఒప్పుకొంటాను. అసలెందుకు ఒప్పుకోవాలి. నాక్కావల్సిన అమ్మాయిని చేసుకొనే స్వాతంత్ర్యం నాకుండాలి. పెద్దాళ్ళన్నారు గదా! పెళ్ళి వందేళ్ళ పంటని. అవునా? అలాంటప్పుడు ఒకళ్ళ మాటెందుకు వినాలి? అంచేతే విన్లేదు. స సే మి రా వీల్లేదు పొమ్మన్నాను. మా 'అమ్మ యించుమించుగా ఏడ్చేసిందనుకో! ఆ మెప్పుడూ అంతేలే! ఆ సంగతలా వదిలెయ్! నిజం చెబుతున్నాను. నేను కలలు కంటూన్న నీలాంటి హంసమార్క్ పిల్ల లభించకపోతే అసలు పెళ్ళే చేసుకొనే వాణ్ణికాదు. నా కాంషస్‌కి వ్యతిరేకంగా ఎందుకు చేసుకోవాలి. సరే! వెళ్ళిపోయావ్ గదూ! కానీ, సాయంత్రం లోపల ఎలాగోలా మాట్లాడలేక పోను.

'అందరూ భోజనానికి లేవండర్రా?' దక్షిణం మామయ్యగొంతు బాకాలా ఊదింది.

'మా అమ్మాయిని చేసుకోపోతే చేసుకోపోయావ్! నా ప్రక్కన కూచొని భోజనం చెయ్‌వోయ్ అల్లుడూ!' చిన్న మామయ్య తను మెట్టు దిగుతోంటే చూసి అరుస్తున్నాడు. అందరూ నవ్వుతున్నారు.

'డర్టీ ట్రిక్! మామయ్యకి ఉక్రోషం ఎక్కువ. వాళ్ళమ్మాయికికూడా అదేగుణం వచ్చింది. అప్పట్నుంచీ అసలు తనతో మాట్లాడ్డమే మానేసింది. మనమనుషుల్లో స్పోర్టివ్‌నెస్ లేదు. అదికూడా ఫారిన్‌నుంచి ఇంపోర్టు చేసుకొంటే బావుంటుంది. ఎప్పుడయినా ఎలక్షన్లలో నుంచుని గెలుస్తే పార్లమెంటులో దీన్ని గురించి గొడవ చెయ్యాలి. ఏమేమో మాట్లాడు తున్నాడు మామయ్య ప్రక్కన కూర్చున్న సీతాపతితో. థాంక్ గాడ్! మామయ్య ప్రక్కన కూర్చోకపోవడం మంచిదయింది. ఇంకాసేపట్లో సీతాపతి చచ్చిపోతాడు. ఘోర్! ఆయన 'బోర్' అలాంటిది. అందులో స్పెషలైజ్ చేశాడు పైగా. అరె! ఆ అమ్మాయి! హల్లో చంద్రవదనా! నువ్వు వడ్డనలోకి దిగావా? అంటే భగవంతుడు ఇంకా నాయందు ఉన్నాడన్నమాట. నీతోమాటలు కలిపేందుకు అవకాశం దొరికిందోహో! హోయ్! వచ్చేసింది దగ్గరకి. నాకోసమయితే ఫర్లేదు. కానీ అందరికోసం ఇలా కూరల గుత్తి పట్టుకోడం నాకు నచ్చలేదుపాపా!

'ఏం కావాలండీ?'

మైగాడ్! మాట్లాడింది నువ్వా? ఆర్కెస్ట్రా వచ్చిందేమో అనుకొంటున్నాను. అరె! అలా నవ్వుకొంటా వెందుకు? నేనేం చెప్పటంలేదనా? ఏం చెప్పగలను సార్! నిన్నుచూస్తూ అన్నీ మర్చిపోతున్నాను ఏంకావాలేమిటి? నాకేం కావాలో నీకు తెలీదా? సరే అడుగున్నా! నాకు నువ్వేకావాలి! నా జీవితంలో గడవబోయే ప్రతిక్షణమూ నువ్వు నాదగ్గరే వుండాలి ఆనక ఇండియాఅంతా వరదల్లో కొట్టుకుపోయినా ఐడోంట్‌మైండ్! అంతే!

తనీమెకళ్ళల్లోకి చూసేసరికి సిగ్గుపడిపోయింది! ఆహా! ఆడపిల్లలు అందంగా సిగ్గుపడతారనిచెప్తే వినడమేగాని ఇప్పుడు పత్యక్షంగా చూస్తున్నాడు.

'చెప్పండి!...'

'మీ ఇష్టం! ఏదోహటి...'

'ఇదిగో! మీాఇద్దరూ తరువాత ముచ్చట్లాడు కొందురుగాని. ఇట్రావమ్మా! నాకు వంకాయ కూర వడ్డించు...' కొంచెం దూరంలో కూర్చున్న వోబట్టతల వెధవ అరచాడు. ఒరేయ్ బట్టతలవెధవా! గోటు హెల్‌విత్ యువర్‌బ్లడీ వంకాయ్! పాపాత్ముడా! నీకు తప్పక ఈపాపం చుట్టుకొంటుంది. ప్రేమికులు మూగగా సంభాషించుకొంటూన్న మధురక్షణాల్ని మధ్యలో విరగొట్టేశావ్! రాస్కెల్! నీవెధవ డైలాగుకి ఆపిల్ల 'హర్ట్' అయిందిరా! కూరల గుత్తి అక్కడపడేసి లోపల కెళ్ళిపోయింది. చూశావా? చూళ్ళేదు. నువ్వెందుకు చూస్తావురా? నువ్వూ నీ వంకాయకూరా క్షేమంగా ఉంటే, ఆనక ప్రపంచమంతా ధర్డు

JOY TAILORS

గుడ్డ మిగిలిపోకుండా కుట్టమన్నారు కదా...!

వరల్డ్‌వార్‌తో నాశనమయిపోయినా నీకేం పట్టదు. నిన్న నల్లులకి కారుపెవగ్గా అమ్మి పారేయాలి. అవి గోల్డ్‌స్పాట్‌లా నీరక్తాన్ని పీల్చేస్తున్నాంటే, అదే నీకు సరయినశిక్ష. వారాణి ఎదురుగ్గా లేపోతే నేనింకేం తినగలను? నావల్లకాదు. వోహో! ఆడాళ్లగదిలో కూర్చుండి పోయావా డార్లింగ్ ఆవెధవాయ్ అన్నమాటకు నేను నీకు క్షమార్పణ చెప్పుకొంటాను సుకుమారీ! ప్లీజ్! ఏమీ బాధపడకు బాధ పడితే నామీదపట్టే! హాల్లో పేకాట రంజుగా సాగుతోంది నేను వాళ్లదగ్గరే కూచొని నీకోసం ఎదురు చూస్తుంటాను ఏం?...

'ఏరోయ్! నీకూ వెయ్యమంటావా?' గుంపులో ఒహడడిగాడు.

'వద్దు'

అప్పుడప్పుడు బయటికొచ్చి తనవంక చిరునవ్వు విసిరి వెళ్తోందా అమ్మాయి. గంటలు సెకండ్లలా గడచినయి. అయిదు న్నరయింది టైము. మసకచీకటి అలుము కొంటోంది ఇంకోగంటలో అమ్మ తనని తిరుగుప్రయాణం కట్టించేస్తుంది. ఈ లోపలే తన ప్రాణానితో మాట్లాడాలి. అదిగో! టాయిలెట్ అవుతొన్నట్లుంది. చేతిలో దువ్వెనా, పౌడరుడబ్బా! త్వరగా కానీ రాణీ! టైము ఆరయిపోయింది. ఎవరిగొడవల్లో వాళ్లున్నారు. మనం మాట్లాడుకోడాని కిదేసమయం! హాయ్ హాయ్! వచ్చేశావా ?...

వెనుక పిల్లల బెటాలియన్ వీళ్లందరికీ నాయకురాలిలా ఉందే! అందరూ పోలో మని మేడ ఎక్కేస్తున్నారు. తనవంక మళ్లీ అవే చూపులు. అదే నవ్వు. మేడ మీద ఇంకెవ్వరూలేరు. ఇదే సమయం. పిల్ల కాయ అందరినీ తరిమేస్తే బాగుండు. ఇంకాలస్యం చేస్తే లాభంలేదు. తనూ మేడెక్కేయాలి. పిల్లలందరిని ఏదో ఆట లాడిస్తోంది వరండాలో. తనని చూసి కూర్చుందల్లా లేచి నుంచుంది బాగా సిగ్గుపడి పోతోంది పాపం! తనిక ధైర్యం చేసేయాలి.

'ఏమండీ!'

తలెత్తి చూసింది.

'ఒక్కసారిలా ఏస్తారా! కొంచెం మాట్లాడాలి...'

వచ్చి కొంచెందూరంలో నుంచుంది తల వంచేసుకొంది. తనకి మాటలు దొరకడం లేదు. తనేం మాట్లాడదల్చు కొన్నాడో గూడా గుర్తులేదు.

'ఏమండీ! మిమ్మల్ని వో దేవతలా పూజించుకొంటాను. అంతగా మిమ్మల్ని ప్రేమించేను. చెప్పండి, మన వివాహానికి మీకేమయినా అభ్యంతరమా ?...'

'నా కభ్యంతరమా ? ఎందుకంత పరి హాసం చేస్తారు ?...

మై గుడ్ గాడ్! దేముడున్నాడండి! అతనే మిమ్మల్ని నాకిచ్చేడు. చాలా మంచా డండి!'

కిల కిల నవ్విందామె.

'మీ పేరు ?'

'జ్యోతి!'

అవును. నా తెలివితక్కువ. పేరడగడ మేమిటి ? మిమ్మల్ని చూస్తే చాలు మీ పేరెవరికయినా తెలిసిపోతుంది.

పిల్లకాయ అందరూ హోరున అరచు కొంటూ వచ్చేశారు.

'అక్కా సోంబాబు! దొరికిపోయాడు ...వీడే దొంగ...'

'నాకేం వే నొప్పుకోను. ముందు శంకరం గాడే బయటికొచ్చేడు...'

ఎవరో మెట్లెక్కుతున్న చప్పుడు.

'నేను వస్తానండి! మిమ్మల్ని మా అమ్మకు చూపిస్తాను...ఏం ?...'

కొంచెంగా వెక్కిరించిందా అమ్మాయి. అప్పుడే ఇంత చనువా జ్యోతీ! కొన్నా ళ్లాగు నీపనిచెప్తాను. టా...టా...

ఏడయి పోతోంది టైము. తన వెనుకే మేడదిగి వచ్చేసింది జ్యోతి. చూపులు కలుసుకోటంలో ఎంత తియ్యదన ముందని: అనుభవం అవాల్సిందే!

'పదరా! వెళ్దాం! కారు వచ్చేసింది...' అమ్మ బయటకు నడుస్తోంది. కారుడోర్ తెరచి పట్టుకొన్నాడు డ్రయివర్. ఇప్పుడు చెప్పెయ్యాలి అమ్మకి.

'మమ్మీ! ఇన్నాళ్లనుంచి నా ప్రాణం తీస్తున్నావ్! పెళ్లాడమని' ఇప్పుడు నాకు నచ్చినపిల్ల దొరికిందమ్మా! ఆ పిల్లని చూపిస్తాను. మిగతాదంతా నువ్వే చూసుకో!...'

అమ్మ సంతోషంతో ఉప్పొంగి పోతోంది.

'ఎవ్రరా ? ఏది ఆ అమ్మాయి...'

ఆడాళ్లందరూ కారుదగ్గర కొచ్చారు. స్వరాజ్యం పిన్నికూడా హడావుడిగా వచ్చింది.

ఏమోయ్! బొంబాయ్ ఎప్పుడేనావస్తే తప్పకుండా మాయింటికిరా ఏం!...'

పరుగుతో వచ్చి నుంచుంది జ్యోతి.

'థాంక్యూ జ్యోతీ! సమయానికి వచ్చావ్!...'

'అమ్మా!...'

అమ్మ జ్యోతితో మాట్లాడుతోంది.

'ఏమే జ్యోతి! వెళ్లిపోతున్నాము. అన్న ట్లారేయ్! నీకు జ్యోతి తెలీదుకదూ! స్వరాజ్యం పిన్ని కూతురు. నీకంటె వో సంవత్సరం చిన్నదే అనుకొంటాను. అంటే చెల్లాయ్ అన్నమాట...బి. యెస్సీ చదువు తోందిట బొంబేలో...'

జ్యోతి మెల్లగా వెనక్కువెళ్లిపోయింది. ఆ అమ్మాయి మొఖం తను చూడలేదు.

'అవునా! నీకు నచ్చిన పిల్లన్నావ్! ఎవరూ ?...'

'హహహ్హా! భలేదానివే మమ్మీ! సరదాగా అన్నాను. నాకు నచ్చడమేమిటీ?...నీయిష్ట మొచ్చిన పిల్లన్జెయ్యవే! నేను మంచాణ్నయి పోయాను. నిజం! నమ్మలేవా?...డ్రైవర్ స్టార్ట్‌చెయ్...త్వరగాపోనీ!

జ్యోతి మేడమీద కిటికిలో నుంచి చూస్తోంది. ఆ అమ్మాయికళ్ల వెంబడి నీళ్లు కారుతున్నాయి. సారీ జ్యోతీ! తప్పంతానాదే! ఒకోవెధవకి ఇలాంటి వెధవ జీవితమే ప్రసాదిస్తాడు దేముడు. సారీ! నిన్ను 'చెల్లాయ్'అనలేను. మనం ఆ అర్థంలో కలుసుకోలేదు. అంచేత కలుసుకొన్నట్లు గానే విడిపోదాం! ఇంకా వేగంగా డ్రైవ్ చెయ్‌రాజా! చేతగాపోతే నువ్ తప్పుకో నేన్నడుపుతాను. ఏమిటమ్మా కన్నీళ్లం టావా?...చఛ...కాదుమమ్మీ కంట్లో నలు కలుసడినయి నిజం. కావాలంటే నవ్వు తను...సరా!...... ●



# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు




## అమర ప్రేమికుల ఆత్మహత్య

17 ఏళ్ళ రాజీవి అనే ఆమె 29 ఏళ్ళ వైద్యనాథన్ అనే అతన్ని ప్రేమించి, అతన్నే పెళ్ళి చేసుకోవాలని తీర్మానించుకుందట. కానీ ఆమె తలిదండ్రులు ఆమెకు మరొకతనితో ఆగష్టు నెలలో వివాహం జరిపేశారట. అయినా రాజీవి మాత్రం వైద్యనాథాన్ని రహస్యంగా కలుసుకుంటూనే వుందట. మొన్న 5వ తేదీ యిద్దరూ తిరుపాపులియూరులో భారతీ లాడ్జిలో ఒక రూమ్ తీసుకున్నారుట. 8వ తేదీ వరకూ ఏ గొడవా లేదు. 8వ తేదీన రాత్రి వేసుకున్న తలుపులు తొమ్మిదిన కూడా తెరవకపోయేసరికి అనుమానం వచ్చి లాడ్జి యజమానులు పోలీసు రిపోర్టిస్తే, వారొచ్చి తలుపు ఉతక ఎత్తి లోపలకు ప్రవేశించారట. లోపల రాజీవి, వైద్యనాథన్ చనిపోయి వున్నారట. వారి పక్కనే నల్లుల మందు సీసా వుందట— ఖాళిగా.. విషయాన్ని అర్థమయ్యేలా విప్పి చెప్పడానికా అన్నట్టు. లైలామజ్నూలు, రోమియో జూలియట్లు యీ కాలంలో లేరని మనం గుండె బాదుకో నక్కరలేదు...




## అదృశ్యమైన అమ్మాయి ప్రత్యక్షం

కొచ్చిన్ (కేరళ) లో ఓ అద్భుతం జరిగింది. బెట్టి అనే 24 ఏళ్ళ అమ్మాయి అదృశ్యమై, తిరిగి ప్రత్యక్ష మయిందట. ఆమె తన సోదరుని యింటిలో బాత్‌రూములో స్పృహలేని స్థితిలో కనబడిందట. ఆమె ఆ బాత్‌రూములోకి ఎలా వచ్చిందో మాత్రం ఎవరికీ అంతుపట్టలేదట.

## ఒకే కాన్పులో ఆరుగురు పిల్లలు

ఇంగ్లండులోని బర్మింగ్‌హామ్ నగరంలో నివసించే షీలా అనే అమ్మాయి అమాంతం ఆరుగురు పిల్లల్ని కనిందట. ఈ పిల్లలో నలుగురు ఆడవారు ఇద్దరు మగపిల్లలూట. ఆఖరి ఆడపిల్ల మరణించిందట. ఐదుగురూ క్షేమంగా వున్నారట. 'మా అమ్మాయి కవలల్ని కంటుందేమో ననుకున్నాను. తీరా ఆరుగుర్ని కన్నది' అందటామె తల్లి.

* * *

'నిశ్శబ్దం' అని గోలచేసే చోటల్లా అరుస్తాం— కానీ నిశ్శబ్దం ఎంత భయంకరమైనదో, ఎంత భరించరానిదో మాత్రం ఎవరికీ అర్థం కాదు. జర్మనీలో కొలోన్ నగరంలో 20 లక్షలు ఖర్చుచేసి ఓ భవనం ఆధునిక పద్ధతిలో కట్టారట. అయితే యీ భవనంలో నివసించేవారంతా లోపలి నిశ్శబ్దాన్ని భరించలేక మొర్రోమని "ఈ నిశ్శబ్దాన్ని మేము భరించలేము. మాకు కనీసం శబ్దాలు కావాలి" అని గోలచేశారట. ఇప్పుడు ఆ భవనం కట్టినవారు గోడలకుకన్నాలు పెట్టి లోపలి యంత్రాలను అమర్చుతున్నారు. ఆ యంత్రాలద్వారా కార్లు వెళుతున్నప్పటి శబ్దాలు, హారను శబ్దాలు, మనుష్యులు నడుస్తున్న శబ్దాలు—యివే గాక టెలిఫోన్ మ్రోగుతున్న శబ్దాలు వంటివి కూడా వినిపిస్తుంటాయట.

* * *

నాగలాపురం గ్రామ ఉపసర్పంచి శవం కర్నూలుకు వెళ్ళే మెయిన్ రోడ్డుపక్కగా పడి వుందట. ఈయనను ఎవరు, ఎందుకు ఎప్పుడు చంపారో యింకా తేలలేదు. పీపుల్ ఆర్ బిజీ...

* * *

## టిక్కెట్టు లేకపోతే అరణ్యవాసం!

రైళ్ళల్లో ప్రయాణాలు చేసేవారికి యీమధ్య టిక్కెట్టు కొనుక్కోవాలన్న వాంఛ బొత్తిగా పోయిందనీ యీ టిక్కెట్టు లేని ప్రయాణీకుల వల్ల ఆ శాఖకు కోట్ల కొద్దీ నష్టం వస్తోందనీ, కనుక వాళ్ళకు కేవలం అపరాధం విధించడమే గాక అట్టివారిని వూరూవాడా లేనిచోట నట్టడవిలో దింపి పారెయ్యాలని శ్రీ మొరార్జీ దేశాయ్ అన్నారట. టిక్కెట్టు కొనలేదని నట్టడవిలో




దింపి పారేస్తే ఏ పులులో, సింహాలో, లేక ఎలుకలో ఆ టిక్కెట్టు లేని ప్రయాణీకులను చంపేస్తే— మళ్ళా ఆ కేసు పరిశోధనకు పోలీసుశాఖ బయలుదేరవద్దా—అయ్యో యిదో అదనపు ఖర్చుతో కూడుకున్న శ్రమకాదూ—పైగా మనింట్లో పడ్డ దొంగను మనం కొట్టరాదు. చట్టానికి వప్పజెప్పాలి అని రూల్సులున్న యీ స్వతంత్ర భారతదేశంలో యిలాటి విడ్డూరం జరగవచ్చా! ఇది పౌరహక్కుల భంగం కాదూ! టిక్కెట్టు లేకపోతే డబ్బు వసూలు చెయ్యాలి. లేకపోతే కోర్టు ద్వారా శిక్ష వేయాలి. కాదూ—యు ఆల్సో థింకిట్!

## అజాగ్రత్త!

అజాగ్రత్త అకాల మృత్యువుకి తల్లి అని ఆర్యులు అననే అన్నారు. ఆరణికి సమీపంలో వున్న కణ్ణా మంగళం అనే వూళ్లో 15 ఏళ్ళ పళని అనే కుర్రాడు పిండిమరలో పడి నలిగి చనిపోయాడట. మిషను వేసి, అది తిరుగుతుండగా, చక్రానికి బెల్టు తగిలించబోయే సరికి, బెల్టు వూపుకు తట్టుకోలేక గిర్రున తిరిగి చక్రంలో కాలుపడి, చూడిపోయిందట. మిగిలిన మనిషంతా వుండవుండగా అయిపోయి, అక్కడి కక్కడే చనిపోయాడట—పాపం!

*                *                *

కట్టెలు కొట్టడానికి అడవికి తనతో రమ్మంటే రాలేదన్న కోపంతో మునుస్వామి అనే అతను తన భార్యను కొడవలితో నరికి చంపేశాడట. ఇది ఆరూర్ తాలూకా కటవ్ఁపరపల్లి అనే గ్రామంలో జరిగింది. తన కోపమే తనకు శత్రువు అని వృత్తినే అన్నారా!

## వ్యక్తిగత వైరాలు

చిన రామయ్య అనే హరిజనుడు అక్టోబరు 2వ తేదీన పొలంనుంచి తిరిగి యింటికి వెళ్తుండగా వో ముగ్గురు హరిజనులు యీటెలతో, గొడ్డళ్లతో అతనిని గాయపరచారట. ఆసుపత్రికి తీసుకువెళ్తే దారిలో అతను చనిపోయాడట. ఇది కంచికచర్లలో జరిగింది. ఈ హరిజన యువకుని హత్య కేవలం వ్యక్తిగత వైరాలతో జరిగినదేగాని, హరిజన ద్వేషులు చేసినది కాదు అని శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు.




మధురలో ప్రసూతి కేంద్రంలో చనిపోయిన ఒక శిశువు కళేబరాన్ని కుక్క కరుచుకుపోయిందట. గేటు దగ్గర కాసిన కుక్కలతో పోట్లాడడానికి నేల మీద పెడితే, ఆలోగా అసలు వాళ్లొచ్చి ఆ శిశువు శవాన్ని తీసేసుకున్నారట. ముఖమంతా కొరికేసిందట. పొట్ట వద్ద బొక్క పెట్టిందట. అయ్యో శిశువు మరణించినా, యీ రకమైన చిత్రహింసాకాండ జరిగితే ఆ తలిదండ్రులు ఎంత విలపిస్తారు! ఈ తప్పెవరిది? ఆసుపత్రివారిది కాదూ! లోగడ కొన్నేళ్ళ క్రితం బ్రతికున్న శిశువునే చంపి నోట కరుచుకు పారిపోయిందో కుక్క గుంటూరు ఆసుపత్రిలోంచి—మీకూ జ్ఞాపకం వుండి వుండాలి—కాదూ!

## కన్యాశుల్కం-నిర్బంధ వివాహం!

బల్‌బీర్‌ధాక్ అనే 19 ఏళ్ళ అమ్మాయిని మంచానికి గొలుసులతో కట్టేసి "మేం చెప్పినతన్ని పెళ్ళి చేసుకోడానికి వొప్పుకుంటావా? లేక ప్రాణాల మీద ఆశ వదులుకుంటావా." అని ఆమె తండ్రి తార్‌లోక్‌ధాక్ కత్తితో బెదిరించాడట. అతనికి యీ క్రియలో 17 ఏళ్ళ కొడుకు, 18 ఏళ్ళ కూతురూ కూడా సహాయం చేశారట. పెళ్ళికొడుకు వద్ద నుంచి కట్నంగా రెండు వేలు తీసుకున్నాననీ, కనుక పరువు పోకుండా అతన్నే పెళ్ళి చేసుకు తీరాలనీ, లేకపోతే చంపేసి అయినా తన పరువు కాపాడుకుంటాననీ తార్‌లోక్‌ధాక్ ఆమెను బెదిరించాడట. ఇది జరిగింది భారతదేశంలో కాదు, లండన్‌లో. ఈ విషయం మీద కేసు కోర్టులో నడుస్తోంది— మన్లో మనమాట.. ఆడపిల్లలకు కట్నం యిస్తారా? తీసుకుంటారా? కులాలను బట్టి మారుతుందేమో—మేబీ!

# నటి సంధ్యారాణి



'క్రికెట్ మాచ్ అంటే యిష్టం'

ఇటీవల విడుదలయిన 'జరేమొనగాడు'లో ఆటపాటల్లో ఓలలాడించిన అందగత్తెగానూ,—'సుడిగుండాలు'లో వయసుమళ్లిన మహిళగాను నటించిన కుమారి సంధ్యారాణి; ఒకదానికొకటి సంబంధంలేని ఆ రెండు భూమికల్నీ ఎంతో నేర్పుతో ఒప్పించి రసజ్ఞులయిన ఆంధ్రప్రేక్షకుల ప్రశంసల్ని అందుకున్నది.

అంతకుముందు విడుదలయిన లేతమనసులు, కన్నెమనసులు, ఇద్దరు మొనగాళ్లు, మరపురానికథ, అసాధ్యుడు మొదలైన తెలుగు చిత్రాలలోనేగాక 'ముహూర్తనాళ్' అన్న ఒక తమిళచిత్రంలోనూ నటించి యిక్కడివారి అభిమానాన్నికూడా సంపాయించుకున్నది.

ఫొటోలు: ప్రభాకర్
ఇంటర్వ్యూ: మోహన్ కుమార్

'ఇద్దరు ముగ్గురు మళయాళ చిత్రాలవాళ్లు అడుగుతున్నారు. ఆ భాషా చిత్రాలలో నటించమని...ఇంకా ఏ విషయమూ నిర్ణయించుకోలేదు.' అన్నది సంధ్యారాణి.

* * *

'అమధ్య డార్జిలింగ్, 'కాలింపాంగ్ వెళ్లానండీ! అక్కడి పరిసరాలు ఎంత బావున్నాయనుకున్నారు. బ్యాటిఫుల్ అట్మాస్ఫియర్'. ఎంతో ఉత్సాహంతో చెప్పింది సంధ్య.

'డార్జిలింగ్ ఎందుకు వెళ్లారు, వేసవి విహారానికా ?' అడిగాను.

'ఇంకా నయం! షికారుకా ? అని అడిగారు కాదు...సునీల్‌దత్‌గారు హిందీలో రంగుల్లో తీస్తున్న 'మన్‌కేమీత్'లో నటిస్తున్నానుకదూ. ఆ చిత్రం అవుట్‌డోర్ షూటింగ్ అక్కడ జరిగింది. అందుకని వెళ్లాను. ఇంకా అందులో ముఖ్య పాత్రధారులుకూడా వచ్చారు. అక్కడ నాకొక లాడ్జిలో విడిది యిచ్చారు. ఆ పరిసరాలు, ఊరు చూడాలని ఎంత కుతూహల పడే



'ఉత్కృష్టమైన పాత్రలు పోషించి ఉత్తమనటిగా రాణించాలని కోరిక'

వాళ్ళమో—షూటింగ్" అంటే అంత విడుపొచ్చేసేది. తెల్లవారుఝామున 3-30 గం॥ లకు లేపేసేవారు. వేళ్ళుకొంకర్లు పోయే చలి. ఆ చలిలో మేకప్‌లూ, డ్రెస్ ఛేంజిలూ చేసుకుంటూ వొణికిపోయే వాళ్ళం. అంతటి చలిలో కదులుతున్న రైలుమీద పాట చిత్రీకరణ — డాన్స్ మూవ్‌మెంట్సు యివ్వాలి. వొణికిపోయే ఆ చలిలో మూవ్‌మెంట్స్ వచ్చేవి కావు, ఎలా ?... అలాగే నిలదొక్కుకుని చక్కగానే పూర్తి చేశామనుకోండి...అంతచలి అన్న మాట ! డార్జిలింగ్‌కన్న కాలింపాంగ్ యింకా బాగుంటుంది. అక్కణ్నించి కాలింపాంగ్‌కి రెండున్నరగంటల ప్రయాణం ! ఆ షూటింగ్‌గురించి నెల్లాళ్ళు ఉన్నాం అక్కడ !'

'ఈమధ్య ఆ పిక్చర్ ఇన్‌డోర్‌షూటింగ్‌కి బొంబాయి వెళ్ళాను. నేను మకాం చేసిన లాడ్జిలో నాడైరీ మరచిపోయి వచ్చేశాను. రోజూ డైరీ రాసే అలవాటు. అది (లేక)పోవటం కొంత దిగులుగానే ఉంది. ఆ హోటలువాళ్ళకీ, ప్రొడక్షన్ వాళ్ళకీ కూడా ఉత్తరాలు రాశాను, చూసి పంపించమని. వాళ్ళనుంచి అసలు జవాబే లేదు' అన్నది సంధ్య. ఈమాటలంటు న్నపుడు ఆమె వదనంలో నిజంగానే దిగులు ద్యోతకం అయింది.

*　　*　　*

'పెళ్ళి చేసుకోవాలను కుంటున్నారా ?' అని నేనడిగిన మరో ప్రశ్నకు సమాధానం చెబుతూ 'నో ! ఇప్పట్లో ఆ ప్రసక్తే లేదు. నటిగా ఇంకా ఉత్కృష్టమైన పాత్రలు పోషించి ఉత్తమనటిగా రాణించాలనేది నా ప్రస్తుతపు కోరిక. ఆతర్వాత వివాహసమస్య' అన్నది.

సహజమయిన అందమూ, ఆకర్షణా కలిగిన కుమారి సంధ్యారాణిలో అల్లరీ, చిలిపితనమూ, మూర్తీభవించి ఉన్నవి. సెట్స్‌లో ఉన్నప్పుడుగానీ, ఇంట్లో ఉన్నపుడుగానీ—తనచుట్టూ వున్నవాళ్ళని నవ్విస్తూ; తను నవ్వుతూ ఎంతోసందడి చేస్తుంది సంధ్య. ప్రస్తుతం కలిసొచ్చిన అదృష్టం, నేనంటే నేనే ! చింతకాపురం, ప్రతీకారం, ప్రతిమా ఫిలిమ్స్ చిత్రాలలో నటిస్తున్నది.

'క్రికెట్‌మాచ్ అంటే నాకు చాలా యిష్టమండీ! ఇక్కడ మాయింట్లో తీరికగా వున్నపుడల్లా ఆడుతూ వుంటాను. చిన్నప్పుడు 'త్రీలెగ్‌డ్ రేస్' అని ఒక ఆటవుండి. ఆ ఆటంటే అప్పట్లో ఎంతో లైకింగ్.'

స్వయంగా వంటచేయటం, పాటలు పాడుకోవటం, మంచి మంచి పాటలు వినటం సంధ్యారాణి సరదాలు.

అందచందాలు, చదువు, సంస్కారంతో నటనలో కృషి, నాట్యంలో నేర్పు ఉన్న కుమారి సంధ్యారాణికి మన నిర్మాతలు కథానాయకి వేషాలిచ్చి ఎందుకు ప్రోత్సహించడం లేదన్నది ప్రశ్న ! ●



మూర్తీభవించిన అల్లరీ—చిలిపితనమూ...



సహజమైన అందమూ—ఆకర్షణా...

కె. జానకిరాణి, బాపట్ల.

ప్ర: మనిషికి జీవితంలో యెప్పుడు సుఖశాంతులు లభిస్తాయి ?

**జ: అనుకున్నవి జరిగినప్పుడు; అందరికీ మంచిగా వున్నప్పుడు.**

మచ్చా వెంకట రమణయ్య, ఉరవకొండ.

ప్ర: విద్యావంతులయినవారు, ఉన్నత భావాలు గలవారు సినిమాల్లో చేరడం గురించి మీ అభిప్రాయం ?

**జ: ఇప్పుడు సినిమాల్లో వున్న వాళ్లల్లో చాలామంది విద్యావంతులే వున్నారు; ప్రతివారికి ఉన్నతభావాలు వున్నాయి.**

ఎం. ఇందిర, బరంపురం.

ప్ర: మీరు వేసుకుంటున్న డ్రెస్‌కాదు గాని ఆడవాళ్ల పరువు తీస్తున్నారండి ? నేను ఒక స్త్రీ అని ఎందుకనుకోరు మీరు?

## బహుమతి పొందిన ప్రశ్న

జి. భోగేశ్వరం, కోట.

ప్ర: అద్దంలో మీ ముఖం చూసుకుంటున్నప్పుడు మీ మనోభావాలు యెలా వుంటాయి ?




**జ: అద్దంలో చూస్తున్నంతసేపు నేను మీ అభిమానాన్ని యింతగా చూరగొన్నందుకు నాపై నాకే ఈర్ష్య పుడ్తుంది.**

# విజయ లలిత



# లేఖావళి

**జ: అంటే మీ వుద్దేశ్యంలో డ్రెస్ వేసుకోడం తప్పా? మీరు యిలాంటి ప్రశ్నవేసి 'స్త్రీ' అనేడి పదాన్ని చులకన చేస్తున్నారని యెందు కనుకోరు.**

ఎన్. ఆనంద్, గుంటూరు.

ప్ర: ముద్దులగురించి మీ అభిప్రాయం అన్న ప్రశ్నకు బహుమతి యిచ్చారే? ముద్దులంటే మీ కంత యిష్టమా ? పైగా పసిదాన్ని అని బుకాయిస్తారే ?

**జ: ముద్దులపై నాకుగల అభిప్రాయాన్ని వెలిబుచ్చాను. బహుమతి నిచ్చింది పత్రికా సంపాదకులు. అవును! ముద్దు అంటే నాకు చాలా యిష్టం. ప్రతిరోజు ~~బుజ్జిబుజ్జి పాపాయిల్ని~~ ఒక్కొక్క రసికుణ్ణి తనివితీరా ముద్దు పెట్టుకోవడం నాకు సరదా; పసిదాన్ని అన్నందువల్ల మీ వయస్సేమయినా పెరిగిందా? లేక మనస్సేమయినా విరిగిందా ?**

వై. రామకృష్ణ, హైద్రాబాదు.

ప్ర: ఎవరయినా మన విషయంలో ఒక తప్పుడుపని చేస్తే వారిని మింగేద్దామన్నంత కోపం వస్తుంది ? మరి అదేపని మనకు మనమై చేసుకుంటే మనపై మనకు అలాంటి కోపం రాదెందుకని ?

**జ: మనంచేసేతప్పుల్ని యింకొకరు వేలెత్తి చూపిస్తే మనస్సు వేడెక్కి కోపాన్ని రప్పిస్తుంది. మనకు మనంగా తప్పుచేస్తే మనస్సులోనే కుమిలి కుమిలి మనిషిని కృంగదీస్తుంది.**

కె. రవికుమార్, బాపట్ల.

ప్ర: మీరు సెన్సారు బోర్డు మెంబరయితే తెలుగుచిత్రాల స్థాయి పెరుగుతుందంటాను ? మీరేమంటారు ?

**జ: ప్రేక్షకుల అభిరుచుల్ని బట్టి చిత్రాలస్థాయి అటు, యిటుగా వుంటుంది. ఎవరు సెన్సారుబోర్డు మెంబరయినా చేసేవరకే చెయ్యగలరు.**

ఎం. ఉదయకాంత్, హైద్రాబాద్.

ప్ర: మీ దృష్టిలో మనిషికి విలువనిచ్చేదేది ?

**జ: మంచి మనస్సు.**

చికుమళ్ల కృష్ణమూర్తి, హైద్రాబాద్

ప్ర: మీ కంటె బాగా నటించగల ఓ నటి కనక మీ చిత్ర పరిశ్రమలో ప్రవేశిస్తే మీరు ఆమె నట్ల ద్వేషము, అసూయ కనుబరుస్తారా ? లేక అభిమానము, ఆప్యాయత చూపుతారా ?

**జ: నాకంటె బాగా నటిస్తే ఆమె నటనపట్ల ద్వేషము, అసూయ వుంటేనేగానీ వృత్తిలో రాణింపు రాదు; ఉత్తమనటిగా ఆమెను మనస్ఫూర్తిగా అభిమానిస్తాను.**

కె. సంగన్న, కూడేరు.

ప్ర: ప్రేమ అంటే ఏమి ? ఎన్ని విధాలు ? ప్రేమకు అందరూ పాత్రులేనా ?

**జ: ప్రేమ అంటే పవిత్రతతో కూడిన అభిమానం అని నా అభిప్రాయం. దాన్ని యెన్నివిధాలుగా నయినా మనం ఆచరణలో పెట్టవచ్చు. ప్రేమకు తర, తమ భేదాలు లేవు.**

ఎం. వి. రమణ, గూడూరు.

ప్ర: ప్రస్తుతం వెలువడుతున్న చిత్రాలపై మీ అభిప్రాయం ?

**జ: నా అభిప్రాయంకన్నా మీ నిర్ణయమే మాకు ముఖ్యం.**



'పేదరాశి పెద్దమ్మ'లో కాంతారావు, పద్మ.

# సినిమా

ప్రభాకరరెడ్డి, హేమలత ఆదర్శ దంపతులు. వారి కుమార్తె విజయలలిత; ఆమె కాంతారావును ప్రేమిస్తుంది; కాంతారావు ధూళిపాళ కుమారుడు; ధూళిపాళ వద్ద సత్యనారాయణ వుంటాడు; సత్యనారాయణ కొడుకే రాజబాబు.

విజయలలితకు పుట్టినరోజు; ఆరోజంతా హాయిగా వుండాలి; అందుకే ఆమె గజ్జె కట్టింది; చెంగు చెంగున నాట్యం చేసి కాంతారావును మురిపించింది; ఆటతోనే గాక కమ్మటిపాటతో కాంతారావు హృదయాన్ని పులకింపచేసింది. విజయలలిత కాంతారావును ప్రేమించిందని వ్రాశాను. ఆమెను కాంతారావు వరిస్తాడా? వీళ్ల ప్రణయం వర్ధిల్లుతుందా? ధూళిపాళకు వీళ్ల పెళ్లి యిష్టమేనా? ఈ ప్రశ్నలకు సమాధానం సురేష్ పిక్చర్స్ నిర్మిస్తున్న జానపద చిత్రం విడుదలైతే తెలుస్తుంది. బి. విశ్వనాదం దర్శకత్వం వహించే యీ జానపదంలో కథకు ప్రాముఖ్యత యెక్కువ. ఒకే వ్యక్తిని యిద్దరు ప్రేమించడం, తెలిసిన తర్వాత ఒకరికోరకు మరొకరు ప్రాణత్యాగం చెయ్యడంలాంటి సెంటిమెంట్స్ గల చిత్రంగా కె. వి. శ్రీనివాసన్‌చే కథ వ్రాయబడింది. కథాబలానికి జూనియర్ సముద్రాల సంభాషణలు మరింత బలాన్నిస్తున్నాయి. వేణు సంగీతాన్ని విన్పిస్తున్నాడు; కె. ఎస్. రెడ్డి నృత్య దర్శకత్వంతో యీ చిత్రంలోని నాట్యాలు మన హృదయానికి అనిర్వచనీయమయిన ఆనందానుభూతిని యేర్పరుస్తాయి. ఈ చిత్రంలో విజయనిర్మల, కృష్ణ ప్రేమికులుగా నటించకపోవడం ఒక విశేషం. కృష్ణ గెటప్, ఆగెటప్‌లో అతడు చేస్తున్న నటనా పటిమ మీ మనస్సుల్లో అతని స్థాయిని మరింత పెంచేలా చేస్తాయి కృష్ణకుజోడి గీతాంజలి. కొడైకెనాల్‌లో రెండు పాటలను చిత్రీకరించి యిప్పుడు వాహిని మొదటిఫ్లోర్‌లో పక్షం రోజులు ఇన్‌డోర్ షూటింగును జరిపిస్తున్నాడు నిర్మాత రామానాయుడు. ఈ చిత్రం నవయుగద్వారా విశాలాంధ్ర అంతటా విడుదలౌతుంది.

**దివ్యశక్తులుగల వజ్రాలు**

యుక్తి పరుడు కృష్ణ; ఆయుక్తితోనే శక్తివంతుడౌతాడు; అనితరం సాధ్యమయిన వజ్రాలను సంపాయిస్తాడు. మహిమాన్వితమయిన యీ వజ్రాలను లోక కళ్యాణానికై వినియోగించాలనుకుంటాడు కృష్ణ; ఈ వస్తువులను తస్కరించదల్చుకుంటాడు రావి కొండలరావు; అందుకే తన రూపాన్ని మార్చుకుంటాడు; యేదో మంత్రం జపించి వాణిశ్రీగా మారిపోతాడు; కృష్ణకు మధుపానం యిచ్చి అతనికి మత్తెక్కించి అతని వద్ద నున్న దివ్యశక్తుల మహిమను నశింపచేస్తాడు; మైకంలోవున్న కృష్ణను బంధిస్తాడు. ఈ వజ్రాలేమిటి? కృష్ణ యెలా వాటిని సాధించగల్గాడు? వాటితో రావి కొండలరావుకు పనేమిటి? బంధించబడిన కృష్ణ తప్పించుకుంటాడా? దివ్యశక్తులను కోల్పోయిన కృష్ణ తిరిగి వాటిని పొందగలడా? అన్న సందేహాలకు భారతి పిక్చర్స్ నిర్మిస్తున్న మహోజ్వల జానపద చిత్రం సమాధానం యిస్తుంది. రవికాంత్ నగాయిచ్ దర్శకత్వంలో యీచిత్రం సర్వాంగ సుందరంగా తయారౌతూంది. మల్లికార్జునరావు నిర్మిస్తున్న యీచిత్రం వాహిని స్టుడియోలో నిర్విరామంగా షూటింగు జరుపుకుంటూంది. అప్పుడా



'వింతకాపురం'లో కృష్ణ, కాంచన.



'కుంకుమ భరిణె'లో గీతాంజలి, రాజశ్రీ, శోభన్‌బాబు, పద్మనాభం.

చార్య సంభాషణలు మీకు ఒక మహాకవిని జ్ఞాపకం చేస్తాయి. ఆ మహాకవి యెవరో చిత్రం విడుదలయినప్పుడు మీకే తెలుస్తుంది; పాటలనుగూర్చి నేను పొగిడితే కోదండపాణిని చిన్నబుచ్చి నట్టవుతుంది. మీకు విభిన్న రాగాల్లో మధురాతి మధురమయిన పాటలను వినిపిస్తున్న కోందడపాణికి ప్రత్యేక ప్రశంస నాకు వృథా ప్రయాస.

సినిషహా



'దేవుడుయిచ్చిన భర్త'లో విజయలలిత, జయంతి.

## మీకు తెలుసా?

ప్రముఖ గుణచిత్ర కథానాయకుడు నాగేశ్వరరావు నిర్మించిన 'సుడిగుండాలు' చిత్రాన్ని మెచ్చుకుంటూ ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ కేంద్రాల తల్లి, దండ్రులు ప్రతిరోజు అసంఖ్యాకంగా ఉత్తరాలు వ్రాస్తున్నారు.

బ్రిటన్‌లో కొన్ని థియేటర్లలో హుండీలు పెట్టారు. ఆ హుండీలలో పడే డబ్బు ఆయా నిర్మాతలకే చేరుతుంది.

ఎ. వి. ఎం. హిందీలో నిర్మించిన 'దో కలియాఁ'(లేతమనసులు) గుజరాత్ రాష్ట్రంలో మూడు కేంద్రాలలో రజతోత్సవం జరుపుకుంది.

ప్రఖ్యాత హిందీ హాస్యనటుడు మహమూద్ 'ఈద్' పండుగనాడు మహమ్మదీయ సాంప్రదాయాన్ననుసరించి చెయ్యిచాపడం అలవాటు. అలా వచ్చిన డబ్బును తన తల్లిదగ్గర యిచ్చి, ఆమె దగ్గర్నుండి ఒకే ఒకరూపాయి పుచ్చుకుంటాడు.

వంగభాష చిత్ర నిర్మాతలు కథకు ప్రాముఖ్యతను యిస్తారేగాని పెద్ద తారాగణానికి కాదు. అందుకే కొత్త నటీనటులు బెంగాలీ చిత్రాల్లో యెక్కువగా పరిచితవౌతుంటారు

### మాయమైన వజ్రాలహారం వీపుమీద మచ్చ

మిక్కిలినేని గారాలకూతురు జయంతి; ఆమెను ప్రాణప్రదంగా చూసుకునే సన్నియ సత్యనారాయణ; జయంతికి యిష్టసఖి విజయలలిత; జయంతి మెడలోని వజ్రాలహారం మాయమైంది; ఆమె వీపుపై ముద్రపడింది; మిక్కిలినేని, సత్యనారాయణ జయంతిని నిండుకొలువులో అవమాన పరిచారు. దాన్ని జయంతి భరించలేక పోయింది; తన చెలియ విజయలలిత

ఒడిలో వాలిపోయింది; తన ప్రియ స్నేహితురాలిని విజయలలిత ఓదార్చింది; మనం యిక్కడ్నించి బయటపడి నిష్కారణంగా మోపబడ్డ అపవాదును తొలగించడానికి ప్రయత్నించి తీరాలి, అని జయంతితో చెప్పింది; ఇద్దరూ అర్ధరాత్రివేళ అందరూ గాఢంగా నిద్రపోతున్న అదను చూసి పురుష వేషాల్లో బయటపడ్డారు; జయంతి చేసిన అపరాధమేమిటి? కన్నతండ్రే మిక్కిలినేని అనహ్యించుకోడానికి కారణమేమిటి? విజయలలిత యెక్కడ్నించి వచ్చింది? వీరిద్దరికీ గల అనుబంధం యెలాంటిది? బయటపడ్డ అబలలిద్దరూ ఏం చేస్తారు? ఈ ప్రశ్నలకు సమాధానం గౌరి ప్రొడక్షన్స్ 'దేవుడిచ్చిన భర్త' యిస్తుంది. స్త్రీలకు వుండవలసిన లక్షణాలను చక్కగా తెలిపే విధంగా యీ చిత్రం నిర్మించబడింది; పాలగుమ్మి పద్మరాజు రచన ప్రతివారికి సులభంగా అర్థమయ్యేట్టు సాగింది; భావనారాయణ, పద్మరాజు సంయుక్తంగా దర్శకత్వ భారాన్ని నిర్వహించిన యీ చిత్రం పూర్ణాపిక్చర్స్ ద్వారా విడుదలౌతుంది. ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలను కాంతారావు,

## సినికళా

రాజశ్రీ, సత్యనారాయణ, విజయలలిత, జయంతి, రాజబాబు, మిక్కిలినేని పోషించారు. ఈ చిత్రం గోల్డెన్ స్టూడియోలో తయారైంది.

### మగ దయ్యాలు

చలం పరుగెత్తుకుంటూ శోభన్‌దగ్గరికి వస్తాడు; అతని వాలకాన్ని చూసి శోభన్ బాబుకు కంగారెత్తింది; 'ఏమిట్రా ? ఏం జరిగింది' అని ప్రశ్నిస్తాడు.

'అదేరా వాడులేడు, వాడు దేహాంతకుడురా. ఆ కొండ దగ్గర్నుండి సరాసరి పోలీసుస్టేషన్‌కి వెళ్ళాడురా' అని సమాధాన మిస్తాడు చలం;

శోభన్ : అక్కడ యింకెవరయినా వున్నారా ?

చలం : ఆ, వున్నారు.

శోభన్ : ఎవరు ?;

చలం : రెండు మగదయ్యాలు.

శోభన్ : అయితే యిందులో యేదో కిటుకు వుంది; వెళ్దాం పద అని చలాన్ని పిలుస్తాడు. అమ్మబాబోయ్ నేనేం రానురా,



'నేనే మొనగాణ్ణి'లో రామారావు, షీలా

అంటాడు చలం. ఈ సన్నివేశం పి. మల్లికార్జునరావు నిర్మిస్తున్న మధుపిక్చర్స్ లోనిది. ఆ కొండనుండి బంగళాలోనికి వెళ్ళినవాడెవడు? వాణ్ణి దేహాంతకుడు అని చలం యెందుకన్నాడు? అందులో వుండే కిటుకేమిటి? ఇది తెల్సుకోవాలంటే చిత్రం చూడాల్సిందే; యువదర్శకుడు తాతినేని రామారావు యీ పౌరాణిక చిత్రాన్ని చక్కటి భావాలతో మేళవించి, తన ప్రత్యేకతను కనబర్చి మీ అభిమానాన్ని సంపాదించ చేసుకోగలడని నమ్ముచున్నాను. తమిళంలో విజయవంతంగా ప్రయోగించిన 'పందయం' యీ చిత్రానికి ఆధారం. ముఖ్యపాత్రలను శోభన్, కృష్ణ, విజయనిర్మల, నాగభూషణం, చలం, గీతాంజలి, త్యాగరాజు పోషిస్తున్నారు. కోదండపాణి సంగీతాన్ని, వెంకటరత్నం కెమెరాను నిర్వహించే యీ చిత్రానికి కె. వి. రావ్ దర్శకునికి కుడిభుజంగా వుంటూ వేసుకున్న ప్లాన్ ప్రకారం షూటింగు పూర్తయ్యేందుకు

## సినిమా డైరీ

● విజయ, సురేష్ కంబైన్స్ తురయూర్ మూర్తి వ్రాసిన కథను తమిళంలో నిర్మిస్తున్నారు. మాధవన్ దర్శకత్వం వహించే యీ చిత్రంలో నాయిక కె. ఆర్. విజయ. జెమినీ గణేష్ ద్విపాత్రాభినయం చేసే యీ చిత్రాన్ని రామానాయుడు నిర్మిస్తున్నాడు.

● నవశక్తి "నిండుసంసారం" షూటింగు అక్టోబరు 16న రాత్రి తొమ్మిది గంటలనుండి తెల్లవారు ఝామువరకు జరిగింది. ఎన్. టి. రామారావు, ప్రభాకరరెడ్డి, పద్మనాభం పాల్గొన్నారు. గంగాధర రావు నిర్మిస్తున్న యీ చిత్రానికి సి. ఎస్. రావ్ దర్శకులు.

● జయశ్రీలక్ష్మి పిక్చర్స్ "చెల్లెలికోసం" అక్టోబరు31న విడుదలవుతుంది. మొదట్లో అక్టోబరు 24న రిలీజు అవుతుందని ప్రకటించడం జరిగింది

● ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు సమర్పించు మాధవి పిక్చర్స్ "బందిపోటు దొంగలు" షూటింగు హైద్రాబాదు సారథి స్టూడియోలో శరవేగంగా తయారవుతుంది. పేరుమోసిన తారాగణంతో భారీ యెత్తున నిర్మితమయ్యే యీ చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య, రంగారావు, గుమ్మడి, జమున, కాంచన, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రుక్మిణి, కె. వి. చలం మరియు నాగభూషణం ముఖ్య పాత్రధారులు. ఈచిత్రాన్ని సుబ్బారావు, రాజేంద్రప్రసాద్ నిర్మిస్తున్నారు.

● ప్రముఖ తమిళ నటుడు ఎం జి. రాంచంద్రన్‌కు ప్రసిద్ధ నేపధ్యగాయకుడు పి. బి. శ్రీనివాస్ "ఇంగేవా—యింగేవా ఒరురగసియం" అనెడి పాటను "కాదల్ వాగనం" చిత్రానికిగాను కె. వి. మహదేవన్ సంగీత సారధ్యంతో పాడారు.

బోధ్యుడయ్యాడు. ఈ చిత్రం యొక్క షూటింగు వాహిని స్టుడియోలో రాకెట్ వేగంతో సాగిపోతుంది.

**మాయలక్కి మారని చిలుక**

రాజనాల సర్వశక్తి సంపన్నుడు; అజరామరుడు; అక్నిని పిశాచిని తన వశం చేసుకున్న ఘనుడు; తన జీవితాన్ని అందచందాలొలికే భామలతోనూ, మత్తెక్కించే మధువుతోను సార్థకం చేస్తుంటాడు. గూటిలోని చిలుకతో సరసం మొదలెడ్తాడు రాజనాల.

రాజనాల : సూర్యుడు కృంగిపోవు చున్నాడే. నీ అందాల రూపుతో నా ముందు చిందుకట్టి మాకు కను విందు సెయ్యవే! 'అయం కీలామయం బీజా'; ఊఁ మారలేదే;' నా మంత్రశక్తి నశించెనా లేక నా కళ్లు మైకం గప్పెనా; చిలుక మారలేదే,

అని మండి పడ్డాడు. ఈ భీకర సన్నివేశంలో రాజనాల నటించిన పద్ధతి మనల్ని స్తంభీభూతుల్ని చేస్తుంది. ఈ దృశ్యం యెందులో దనుకుంటున్నారు? పింజల సుబ్బారావు నిర్మిస్తున్న 'పేదరాశి పెద్దమ్మ'లోది. రాజనాల మరణాన్ని యెలా జయించగల్గాడు? గూటిలో వున్నది చిలుక గదా! మరి చిలుక మారలేదేమే అని



"బంగారు సంకెళ్లు" లో జమున

రాజనాల అన్నాడే! అని మీకు సందేహం కల్గుతుందని నాకు తెలుసు, కానీ యేం చెయ్యడం చెప్పండి, చిత్రం విడుదలయ్యేంత వరకు రహస్యాన్ని బయట పెట్టడం సబబుకాదని భావిస్తున్నాను. ఈ చిత్రానికి గిడుతూరి సూర్యం దర్శకుడు; చిల్లర భావ నారాయణ వెండితెరకు కొత్తవాడే అయినా, అతని రచన మెరపుతీగ లాంటిది; ఈ భావం చిత్రం విడుదలయినప్పుడు మీకు కూడా కల్గి తీరుతుంది. ముఖ్య పాత్రలను కాంతారావు, కృష్ణకుమారి, రామకృష్ణ, విజయలలిత, ప్రభాకరరెడ్డి, రాజసులోచన, మిక్కిలినేని, బాలకృష్ణ, బలిరెడ్డి సుబ్బారావు ధరిస్తున్నారు; సంగీతాన్ని కోదండపాణి, ఆర్టును వాగేశ్వరరావు, ప్రొడక్షన్‌ను కృష్ణమూర్తి, మేకప్‌ను సాంబయ్య, దుస్తులను రామారావు నిర్వహిస్తున్న యీ చిత్రం అతి త్వరలో మీ ముందు వుంటుంది.

* * *

అన్యోన్యంగా దాంపత్య జీవితాన్ని సాగించే వాణిశ్రీ, శోభన్‌బాబుల మధ్య అనుకోకుండా

పరిచయం



## దర్శకుడు
## మల్లికార్జునరావు

ఒక వ్యక్తిలోని అర్హతను గుర్తించి, దానికి ఒక స్వరూపాన్ని యివ్వడం శ్రీ డూండీశ్వరరావుకు అలవాటు. అతని నమ్మకం యిప్పటివరకు వమ్ముకాలేదు. "గూఢచారి 116" చిత్రాన్ని ఎం. మల్లికార్జునరావుచేత డైరెక్టు చేయించి, అతనికి చిత్రపరిశ్రమలో సముచిత స్థానాన్ని యేర్పరచారు. మల్లికార్జునరావు కూడ తన శక్తివంచన లేకుండా యిచ్చిన బాధ్యతను సక్రమంగా నెరవేర్చి గట్టివాడు అని మొదటి చిత్రంలోనే నిరూపించుకున్నాడు.

"ప్రమీలార్జునీయం" పౌరాణిక చిత్రాన్ని, "పట్టుకుంటే పదివేలు" హాస్య చిత్రాన్ని, "చెల్లెలికోసం" సెంటిమెంటల్ చిత్రాన్ని' చక్కగా డైరెక్టు చేసి దర్శకుడిగా నిలబడగల్గాడు.

'కథను ఆద్యంతం అర్థంచేసుకుని, మూలానికి దెబ్బతగలకుండా స్క్రీన్‌ప్లేను తయారు చేసుకుని, ప్రతి సీనుకు కావలసిన షాట్లను తయారు చేసుకుని, ఒక ప్లానింగ్‌తో చిత్రాన్ని నడిపిస్తే దర్శకుడు రాణించగలడు' అంటాడు మల్లికార్జునరావు. తీసిన షాట్ల రష్‌ను యెప్పటికప్పుడు చూసుకుని, అవసరమయిన మార్పులను చేర్పులను చేసుకుంటే సన్నివేశం రక్తి కడుతుంది అంటాడు యీ యువదర్శకుడు.

ముందు చూపు వుండి, ముందుకు పోవాలనే ఆసక్తి వుండి, ముందంజ వెయ్యగలడనే ఆశాభావం పొడసూపుతుంది. ముమ్ముందు మంచి చిత్రాలను డైరెక్టు చేసి ముందడుగు వెయ్యగల దర్శకుడు అని, అతని వాలకం ప్రస్ఫుటం చేస్తుంది.

# సినిమా

మనస్పర్థలు మొలకెత్తాయి; అది తీవ్ర రూపం పొంది ఒకర్నొకరు విడచిపోవాల్సిన అగత్యం యేర్పడింది; శోభన్‌బాబు మనస్సు కలత చెందింది; వీరిద్దరికీ భేదాభిప్రాయాన్ని కల్గించింది వాళ్లింట్లో పనిమనిషి లక్ష్మి అని తేలిపోతుంది. భగవంతుడియెదట తన తప్పును ఒప్పుకుంటుంది లక్ష్మి; విడిపోయిన భార్యా, భర్తలు కల్సుకుంటారా, లేదా అన్న ప్రశ్నకు సమాధానం వాహిని వారి 'బంగారు పంజరమే'. ప్రముఖ దర్శకుడు బి. ఎన్. రెడ్డి మీకేం కొత్త కాదు; 'మల్లీశ్వరి', 'బంగారుపాప', 'రంగులరాట్నం'లాంటి వుత్తమ చిత్రాల్ని కళాత్మకంగా నిర్మించిన బి. ఎన్. రెడ్డి యీ చిత్రాన్నికూడ ఆస్థాయిలోనే నిర్మిస్తున్నారు. ఈ చిత్రంయొక్క షూటింగు వాహినిస్టుడియోలో ప్రతినెలా జరుగుతుంది.

## దుష్టశిక్షణ కార్యక్రమం

నాగభూషణం, శోభన్‌బాబు అన్నదమ్ములు; శోభన్ ఎన్. టి. రామారావు యింట్లో పెరుగుతాడు; విదేశాలకు వెళ్లినప్పుడు షీలాతో పరిచయంయేర్పడుతుంది; షీలా రష్యన్ కన్య; ఆమెను శోభన్ పెళ్లి చేసుకుంటాడు; భార్యతో యింటికి వస్తాడు; ఇంటికి వచ్చిన తమ్ముడ్ని, అతని యిల్లాలిని హనీమూన్‌కు వెళ్లిరమ్మంటాడు నాగభూషణం; అన్నయ్య ఆజ్ఞ ప్రకారం యిద్దరూ హనీమూన్ గడిపి తిరిగి యింటికి వస్తారు; వారినిచూచి నాగభూషణం యిలా అడుగుతాడు.

నాగభూషణం : హల్లో, శోభన్, హనీమూన్ యెలా గడచింది?

శోభన్ : ఆనందంగానే గడిచింది అన్నయ్యా.

నాగ : వెరీగుడ్, ఏ ఏ వూళ్లు తిరిగొచ్చావ్!

శోభన్ : ఊటీ, కొడైకెనాల్, కాశ్మీర్, డార్జిలింగ్.

షీలా : (అందుకొని) మైసూర్.

నాగభూషణం : అబ్బో! చాలు, చాలు దేశం అంతా చూసేశా రన్నమాట.

ఇద్దరూ : మొత్తం చుట్టేశాం.

నాగ : అయితే మీ రిద్దరూ కలసి ఆనందించ వలసిందింకేముంది.

శోభన్ : లేదన్నయ్యా!

నాగ : బాగా అలసిపోయి వుంటారు; మేడపైకి వెళ్లి రెస్టు తీసుకోండి—అని వెళ్లిపోతాడు.



'శ్రీరామకథ'లో గీతాంజలి, పద్మనాభం.

ఈ సన్నివేశం యెందులోదని తెలుసా ? శ్రీరాజా ఆర్ట్సు ఫిలింస్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలోనిది. తమిళదేశంలో తనకొక ప్రత్యేకతను సంపాదించుకున్న ప్రముఖ రచయిత, నిర్మాత, దర్శకుడు అయిన కె. ఎస్. గోపాలక్రిష్ణన్ తెలుగులో మొట్టమొదటి సారిగా దర్శకత్వాన్ని నెరపుతున్న చిత్రం యిది; ఒక కుటుంబంలో యేర్పడే కలతలు; సమాజంలోని దుష్టశక్తులను శిక్షించేందుకు చెయ్యాల్సిన కార్యక్రమం, న్యాయం, ధర్మం వ్యక్తి యొక్క ఔన్నత్యానికి యెలా సహకరించేది యీ చిత్రం చూస్తే కళ్ళకు కట్టినట్లు బోధపడుతుంది.

ఈ చిత్రానికి భమిడిపాటి రాధాక్రిష్ణ సంభాషణలను, నారాయణరెడ్డి పాటలను వ్రాసారు; ఛాయాగ్రహణాన్ని సంపత్, ఎడిటింగును దేవరాజన్ నిర్వహిస్తున్నారు. సుంకువల్లి నిర్మించే యీ చిత్రం స్వర్గం స్టుడియోలో తయారవుతుంది. ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను ఎన్. టి. రామారావు, సావిత్రి, కృష్ణ, విజయనిర్మల, రాజబాబు, మీనాకుమారి, షీలా, నాగభూషణం, కె. వి. చలం ధరిస్తున్నారు. చిత్రానికి అయువుపట్టయిన ఒక పాత్రలో శోభన్‌బాబు కన్పడ్తాడు.

* * *

మానవుడు నైతికంగా దిన, దినానికీ దిగజారి పోతున్నాడు; సంఘంలో అందరికీ సమాన ప్రతిపత్తి లభించడం లేదు; ధనవంతుడు మరీ ధనవంతు డౌతున్నాడు; బీదవాడు యింకా బీదస్థితికి వెళ్తున్నాడు; న్యాయం, ధర్మం కరువైంది; మంచికి విలువ తగ్గింది; అమాయకుడ్ని కల్లబొల్లి మాటలతో మెప్పించి అతన్ని మోసగించి, అతని ఆస్తి పాస్తులను అపహరించడం నేటిసమాజంలో అధికంగా వున్నట్లు అనిపిస్తుంది. ఈ అన్యాయాలు, అక్రమాలు యిలా కొనసాగవలసిందేనా ? నీతికి, నిజాయితీకి స్థానం లేదా ? న్యాయం, ధర్మం మంచిని చెయ్యలేదా ? అన్నది నేడు పెద్ద సమస్యగా వుంది. ఎన్. టి. రామారావు నీతిగా, న్యాయంగా, నిజాయితీగా, సత్యసంధుడిగా వుండేవాడు; అంతవరకు మంచి దొరకడం దుర్లభమైంది; వేషం మార్చి, భాషమార్చి, మనస్సు మారినట్లు నటించేసరికి సంఘం స్వాగతం పల్కింది; ఈ సంఘాన్ని కలుషితంచేసే దురాశా



'భలేరాజా'లో మీనాకుమారి, రాజశ్రీ.

పరుల్ని, దురహంకారుల్ని ఎన్. టి. ఆర్. యెలా సన్మార్గానికి తీసుకొస్తాడో గోపాల క్రిష్ణా పిక్చర్స్ 'కథా నాయకుడు' వస్తే మీకు తెలిసి వస్తుంది. ముళ్ళపూడి వ్రాసిన చిక్కటి కథకు, భమిడిపాటి చక్కటి సంభాషణలు వ్రాస్తే, టి. వి. రాజు కమ్మటి పాటల్ని వినిపిస్తున్నారు. గోపాల క్రిష్ణ నిర్మించే యీ చిత్రానికి కె.



మద్రాసు ఫిలిం ఫాన్సు అసోసియేషన్ వారిచే ఉత్తమ బాలనటిగా ఎన్నికైన బేబి రోజారమణి, బహుమతి ప్రదానంచేసిన మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ అన్నాదురై.



# పాత బొమ్మలు - కొత్త కబుర్లు

ఈ బొమ్మలో వున్న అమ్మాయి ఎవరో, ఇది ఏ చిత్రంలోనిదో చెప్పుకోగలరా? జ్ఞాపకానికి వస్తున్నట్లే వుంది కాని, ఎవరో చెప్పుకోలేకపోతున్నారు కదూ?..... పోనీ సినిమా పేరైనా గుర్తుకు వొస్తోందేమో, ఆలోచించండి.

*　　　*　　　*

పైనున్న అమ్మాయి పేరు మాలతి. సినిమా పేరు 'సుమంగళి'. సుమంగళి చిత్రంలో నటించే దాకా మాలతిపేరు అసలు ఏమిటో మీకు తెలుసా?... సూర్య కుమారి. ఈ చిత్రంలో నటించేముందు ఈ చిత్ర దర్శకుడు అయిన శ్రీ బి. యన్. రెడ్డి ఆమెపేరున్న మాల తి'గా మార్చారు.

'సుమంగళి' చిత్రంలోని థీమ్‌సాంగ్ 'వస్తాడే మా బావ' ఆంధ్రదేశంలోని ప్రతియింటా ఆరోజుల్లో మార్మోగింది. ఆ పాటను తన స్వయంగా పాడారు మాలతి. అదేకాదు, ఆ చిత్రంలోని తన పాటలన్నీ తనే పాడారు.

*　　　*　　　*

''సుమంగళి' నా మొదటి చిత్రం. న్యూటోన్ స్టూడియోలో తీశారీ చిత్రం. అప్పుడు పరిశ్రమ ఎంతో బాగుండేది. ఏ పాత్రకు ఎవరు సరిపోతారో నిర్ణయించి మరీ యిచ్చేవారు వేషాలు. మేకప్ టెస్ట్, ఆ తర్వాత సాంగ్ టెస్ట్ చేసేవారు. ఆ సెలక్షన్‌లో నెగ్గితే తీసుకునేవారు. బి. యన్. గారే నన్ను తారగా—పరిశ్రమకీ, ప్రేక్షకులకీ పరిచయం చేశారు" అన్నారు శ్రీమతి మాలతి.

—మోహన్ కుమార్

## సినివా

హేమాంబరధరరావు దర్శకుడు; వి. ఎస్. ఆర్ స్వామి కెమరాను, బి.ఎస్. కృష్ణ ఆర్టును, గమనిస్తున్న యీ చిత్రంలో జయలలిత నాయిక; ముఖ్యపాత్రలను ఎన్. టి. రామారావు, నాగభూషణం, పద్మనాభం, రాజబాబు, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, టి. జి. కమలాదేవి, రమాప్రభ ధరిస్తున్నారు. ఈ చిత్రాన్ని మీకు చూపే బాధ్యతని పూర్ణాపిక్చర్స్ తీసుకున్నారు.

### తప్పిపోయిన ప్రమాదం

ప్రముఖ హాస్యనటుడు రాజబాబు నిజాం షుగర్‌వద్ద గుర్రం మీదనుండి కింద పడ్డాడు. గంటసేపటివరకు స్పృహ రాలేదు; రాజబాబు చచ్చిపోయాడని అందరూ అనుకున్నారు. భగవంతుడి దయవల్ల బతికి బయటపడ్డాడు; ఇది యే చిత్రంలోనిదీ కాదు; నిజంగా జరిగిన సంఘటనే. గత వారం హైద్రాబాదుకు వెళ్లిన రాజబాబు మాధవిపిక్చర్స్ షూటింగులో పాల్గొన్నప్పుడు యీ విపత్తు జరిగింది; 'నాకు పునర్జన్మ లభించింది' అని ముగించాడు రాజబాబు యిటీవల వాహినిలో నన్ను కలిసినప్పుడు; 'దిష్టి తీయించుకో' అని సలహా యిచ్చి వచ్చాను.

### డిసెంబర్‌నించి మూడు చిత్రాలు

ప్రముఖ దర్శకుడు, నిర్మాత, విఠలాచార్య ఇటీవల ఫ్లూ జ్వరం వచ్చి, మనిషి సగం అయ్యాడు; 'ప్రతిరోజూ మూడు యింజక్షన్ల చొప్పున తీసుకుంటున్నా, ఇప్పుడు కొస్త మెరుగ్గా వుందండీ' అన్నాడు విఠలాచార్య; 'డిసెంబరునుండి మూడు చిత్రాల షూటింగులు జరుగనున్నాయి; అందుకే ప్రతిరోజూ డాక్టర్ని పిలిపించి, టెస్టు చేయించుకుంటున్నా' అన్నాడు;

డిసెంబరు 8 నుండి 12 వరకు డి. వి. ఎస్. రాజు నిర్మించే జానపదాన్ని, 13 నుండి 21 వరకు లక్ష్మీనారాయణ పిక్చర్స్ రామస్వామి నిర్మించే జానపదాన్ని, 22 నుండి తన స్వంత చిత్రాన్ని విఠలాచార్య డైరెక్టు చెయ్యాల్సి వుంది. మూడు చిత్రాల్లో జయలలిత, రామారావులే నాయికీ, నాయకులు.

—శ్రీనివాస్

# పుస్తకాలు

## నారాయణీయము

ఆంధ్ర నలంద ప్రచురణము—ఏకాదశ గుచ్ఛము. కృతికర్త: డాక్టరు అడుసుమల్లి నారాయణరావుగారు, ఎం.బి.బి.యస్., గుడివాడ. క్రౌను 16+174+122. వెల 6 రూ. ప్రతులకు: కృతికర్తకు వ్రాయవలెను.

డాక్టరు నారాయణరావుగారు వైద్యవృత్తిలో ఎంత నిపుణులో, ఆంధ్ర వాఙ్మయంలోని వివిధ శాఖల్లోనూ అంత నైపుణ్యం కలవారు. ఆయనకున్న భాషా వాఙ్మయాభిమానం అపారం. త్యాగమూర్తులైన ఆయన ఆంధ్రనలందను స్థాపించి తన్మూలంగా గొప్ప భాషాసేవ చేస్తున్నారు. సరస కవితా ధురీణులు, కావ్యనాటకాలనే కాకుండా శాస్త్రీయ గ్రంథాలను కూడా రచించి ప్రకటిస్తున్నారు.

వేరే వృత్తిలో వున్నవారికి భాషా వాఙ్మయాలపై అభిమానం వుండవచ్చు. రసవంతంగా కవిత్వం చెప్పవచ్చు. కాని శాస్త్రగ్రంథాలు వ్రాయడం, అందులోనూ సులభ గ్రాహ్యంగా రచించడం చాలా అరుదు. సర్వసమర్థులైన నారాయణరావుగారు 'నారాయణీయం' అనే పేరుతో అలంకార గ్రంథాన్ని లక్ష్యలక్షణాలతో సులభమైన శైలిలో పద్యరూపంగా రచించడం విశేషం. ఆయన లక్షణాలకు తగిన లక్ష్యాలను వైద్యశాస్త్రానుగుణంగా, కూర్చడం, అది సుగమంగా వుండడం ఒక ప్రత్యేకత అని చెప్పాలి.

డాక్టరు నారాయణరావుగారు మొదట్లో గ్రంథాన్ని ముద్రించి తెలుగు దేశంలోని ప్రసిద్ధ విద్వత్కవుల ప్రశంసాపూర్వకాభిప్రాయములను స్వీకరించి గ్రంథంలో చేర్చారు. గ్రంథంకంటే విద్వదభిప్రాయాలున్న భాగమే పెద్దదిగా ఉంది. ఆ అభిప్రాయాలు కేవలం ప్రశస్తిని తెలిపేవి మాత్రమే కావు. అలంకార శాస్త్ర విషయాలను తెలుసుకునే వారికి అవి ఎంతో ఉపయుక్తమైనవి. వాటిని కూడా మూలంతో చేర్చి గ్రంథకర్త వాఙ్మయానికి మహోపకారం చేశారు.

ఇందులో అలంకారాలకు అనుబంధంగా డాక్టరుగారి చిత్రకవిత్వం కూడా చేర్చబడింది. కొమ్ములు తిరిగిన వారికే సాధ్యం కాని వివిధ ఖడ్గబంధాలు, చతురంగ, చక్ర, పద్మ, నాగ, రథాదిబంధాలూ, నిరోష్ఠ్యాదులూ రచయిత ప్రతిభకూ, కవిత్వ పరిశ్రమకూ మచ్చుతునకలు. ఆంధ్రానీకానికి మహోపకారంగా ఇట్టి గ్రంథాన్ని రచించి ప్రకటించిన డాక్టరు నారాయణరావుగారి సాహిత్యకృషి సాటిలేనిది. సాహిత్యాభిమానులందరూ ఆదరించవలసిన గ్రంథమిది.

—ఆంగీరస.

ఆటలు

# మధ్యవర్తిత్వం?



మెక్సికోసిటీలోని ఆటలపోటీలలో తన వొలింపిక్ హాకీచాంపియన్‌షిప్‌నినిలబెట్టుకోడంలో భారతదేశం అమంగళ కరమైన ప్రారంభం చేసింది అశుభదాయకమైన అక్టోబరు 13న మొట్టమొదటి టెస్ట్‌లో చిన్న బృందంగా ఎంచబడుతున్నన్యూజిలాండ్‌తో 2—1కిభారతదేశం వోడిపోయింది. 1928 నుంచీ ప్రపంచ చాంపియన్‌లుగా మన బృందం పేరుపొందింది. మన పేరు నిలబెట్టడంలో మన బృందం వోడిపోలేదు కానీ పరువుప్రతిష్ఠలకి భంగం వాటిల్లనీకుండా ఉండాల్సింది. కానీ నామటుకు నేను దీన్నొక అదృశ్యమైన ఆశీస్సుగా భావిస్తున్నాను. ఎక్కడికక్కడ సంతృప్తిపడటం అన్నది గతంలో జరిగిన అంతర్జాతీయ పోటీలలో మనకి శత్రువు అయింది. కానీ యిప్పటి ఈ గుణపాఠం మన ఆటగాళ్ళ యింకా మెరుగవడానికి తోడ్పడుతుందని ఆశించవచ్చు. మన జట్టు నాయకుడు ప్రీతిపాల్‌సింగ్, చెడ్డ అంపైరింగ్‌తో విసిగిపోయాడు. తన ఉద్దేశాలని గుప్తంగా ఉంచలేకపోయాడు.

మ్యాచ్ ముగిసింతర్వాత ఇండియా మానేజర్ మేజర్ జనరల్ కాల్‌హో ఆటలో మొదటి సగభాగం తక్కువగా ఉందనీ, డచ్ అంపైర్ నిర్ణయాలని ప్రశ్నిస్తూ ఒక అధిక్షేపణని చేశారు. కానీ ఆ అధిక్షేపణ సమూలంగా తోసి వేయబడింది. ఇక్కడ, ఇండియాలో దానిపై పెద్ద గందరగోళం బయల్దేరింది. 'మనవాళ్ళు వోటమిని హుందాగా అంగీకరించి ఉండాల్సింద'ని, అధిక్షేపణని చేసి ఉండి ఉండకూడదని. కానీ ఇక్కడ ఉండి మనం నీతులు చెప్పడం మంచిదే, కానీ మన మేనేజర్ ఎవరో సంబంధంలేని వ్యక్తి కాదని, అధిక్షేపణని, అధికారయుతంగా చేయడం విషయంలో ఆయన సంతృప్తి పడింతర్వాతనే చేయడం జరిగి ఉంటుందని తెలుసుకోవాలి. ఉన్నత హోదా కల ఒక మిలిటరీ వ్యక్తి ఆయన. చెడ్డ అంపైరింగ్ వల్ల భారతీయుడు నష్టపోవడం అన్నది యిదే మొదటిసారి కాదు. ముఖ్యంగా హాకీ ఆటలో 'స్టిక్'ని తప్పుగా ఉపయోగించడం, 'ఆఫ్‌సైడ్', 'ఎడ్వాన్‌టేజ్' నిబంధనలు అంపైర్ల నిర్ణయాలకే వదిలివేయబడ్డాయి. ఈ నిబంధనలు పేరుపొందిన బృందాల నెన్నిటినో నాశనం చేశాయని ఎన్నో సందర్భాలలో చూసిన నేను గట్టిగా చెప్పగలను. దాన్ని గురించి ఆటల గురించిన నా పత్రికా రచనలో ఎన్నోసార్లు అస్తవ్యస్తమైన అంపయిరింగ్‌ని గూర్చి, ముఖ్యంగా హాకీ విషయంలో కొన్ని సందర్భాలలో ఆటలో జయాపజయాలు అంపయిర్ల, నిర్వాహకుల దయాధర్మాలపై ఆధారపడి ఉండడం విషయంపై గట్టిగా రాశాను.

అంపయిరింగ్ అవకతవకగా ఉండి ఉండకపోతే ఇండియన్ మానేజర్ తన అధిక్షేపణని వెలిబుచ్చి ఉండి ఉండడు. ఇంత దూరం నించి మనం ఆయనని చిన్న బుచ్చటం అన్నది మంచిదికాదు. ఇండియా చివరికి ఎలాంటి ఫలితాన్ని సాధించినా మన బృందం, మొట్టమొదటగా తగిలిన ఈ షాక్‌వల్ల, కృషిలో లోపం రానీయదని ఆశిస్తాను. ఇంతకి ముందు కూడా వొలింపిక్ హాకీలో అంపైరింగ్ తరచు భారతదేశానికి వ్యతిరేకంగా ఉన్నా దురదృష్టకరమైన అక్టోబరు 13న జరిగిందే ఈ సంవత్సరంలో మొదటిదీ, చివరిదీ అవుతుందని ఆశిద్దాం.

—కె. ఎస్. నరసింహన్

# పుస్తకాలు

## కందరామాయణము

కృతి కర్తలు: శ్రీ అనపర్తి సుబ్బరామిరెడ్డి, శ్రీ వావూరు—రామయ్య, క్రౌను 18+114 పుటలు వెల 2 రూ. ప్రతులకు నెల్లూరు జిల్లా గూడూరులో ఉన్న అనపర్తి సుబ్బరామిరెడ్డి గారికి వ్రాయాలి.

ఇప్పటివరకూ రామాయణం నిర్వచనంగానూ, వచనంగానూ, గద్య పద్యాత్మకంగానూ, దృశ్యరూపంగానూ, దండకరూపంగానూ, కీర్తనల రూపంగానూ ఎన్నోవిధాలుగా తెలుగులో ఎన్నోవందల రచనలుగా వెలువడింది. అలాంటి రచనల్లో ఈ నిర్వచన కంద పద్యాల రామాయణం ఒకటి. కందపద్య రచనలో నియమాలు అధికంగా ఉన్నా, రచన సులభంగా సాగుతుంది. అందులోనూ సహజకవితాధార ఉన్న వారి రచన హృదయంగమంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. ఈ పుస్తకంలో రమారమి ఎనిమిది వందల పద్యాల్లో శ్రీరాముని పట్టాభిషేకాంత కథ రసవంతంగా కూర్చబడింది. పద్యాలన్నీ హృద్యాలుగా ఉన్నవి. రచయితలు ఉభయులూ ఉద్దండ విద్వత్కవులు. ధారావాహికంగా జరిగిన యీ రచన వాల్మీకి రామాయణాన్ని అనుసరించినది. ఇందులోని తళుకు బెళుకులనూ విశేషాలనూ, రామాయణ పరిశోధనలో సిద్ధహస్తులూ, విద్వత్కవులూ అయిన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారు తమ 'పరిచయవాక్యం' లో వివరించారు.

ప్రసిద్ధ విద్వత్కవుల ప్రశంసలను అందుకొన్న కావ్యం యిది. పసితనంలోనే నూరేళ్లు నిండిన ప్రతిభశాలి, శ్రీ సుబ్బరామిరెడ్డిగారి దత్తపుత్రుడు బండి—గిరిధరరెడ్డికి యిది అంకితం కావడం కూడా ఒక విశేషమే! సులభ శైలిలో రసవంతంగా సాగిన యీ రచన అందరికీ సులభగ్రాహ్యంగా ఉన్నది.

—అంగీరస.

## దరిచేరిన ప్రాణులు

రచన— ఇల్లిందల సరస్వతీదేవి, ఎమెస్కో పాకెట్ బుక్స్, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాద్.

(183 పేజీలు: వెల రూ 2.)

ప్రపంచంలో స్త్రీ స్థానం ఎక్కువా, పురుష స్థానం ఎక్కువా అని తర్కించుకోడం యీనాడు పరిపాటి అయ్యింది. విశ్వమానవ కళ్యాణానికి ప్రకృతీ, పురుషు లిద్దరూ ముఖ్యమే.

కథానాయకి నిర్మల తన పేరులాగే చాలా నిర్మల స్వభావం కలది. ఏ దుర్ముహూర్తాన పెళ్లి చేసుకుందో పసుపు బట్టల పెళ్ళికొడుకు అత్తగారి చేత అవమానింపబడి, వెళ్ళిపోతాడు. అలా వెళ్ళినవాడు తిరిగి నవలాంతంలో కనుపిస్తాడు. తల్లిదండ్రులు వదలి వెళ్ళిన డబ్బుతో నిర్మల ఓ ప్రసూతి వైద్యశాల, ఓ అనాథ శరణాలయం స్థాపించి, మనశ్శాంతిని వాటిలో వెతుక్కుంటుంది. మనశ్శాంతి దొరక్కపోగా ప్రసూతి వైద్యశాల చాటున అత్యాచారాలు, అనాథ శరణాలయం మాటున దురాచారాలను చూస్తుంది.

పెళ్ళిపీటల మీంచి వెళ్ళిపోయిన నాయకుడు రమణ మిలిటరీలో చేరి, తన స్నేహితుడు కరుణాకర్ నిర్మల స్నేహితురాలు కాంతిని వివాహం చేసుకోడం ద్వారా నాయకికి దగ్గరగా వస్తాడు. కానీ అజ్ఞాతంలో వుంటాడు. నిర్మలకు బాసటగా నిలచిన వెంకట్రామయ్యగారు అనే వృద్ధుడు భార్యాభర్తలను జేరుద్దామని అష్టకష్టాలూ పడతాడు. శ్రేయోభిలాషులంతా చేరి నాయకుణ్ణి ఒప్పించబోతారు, కుదరదు. చివరికి ఆర్మీలో తనకు సేవ చేసిన యోటేల్లా అనే నర్సు ఒప్పించబోయేసరికి తనకో చేయీ, కన్నూ లేవన్న భయంకర సత్యాన్ని బయటపెట్టి, గాజు కన్ను తీసి, చూపిస్తాడు. చిట్టచివరికి నాయకి తాను అతిపదిలంగా దాచుకున్న హృదయ కుసుమాన్ని అతని కర్పించి, అక్కున చేరుతుంది.

కథ, కథాగమనం అతి చక్కగా, చురుగ్గా వున్నాయి. నిర్మల చుట్టూ తిరిగిన కొన్ని పాత్రలు అతి సహజంగానూ, వైద్యశాలలోని దురాచారాలు అతి వాస్తవికంగానూ హృదయాన్ని కదిల్చేవిగానూ వున్నాయి.

పసుపు బట్టలతో యింట్లోంచి పారిపోయి, తాళిగట్టిన భార్యను ఒక్కసారయినా మనసా స్మరించని రమణ పాత్ర— అతను యింట్లోంచి వెళ్ళిపోయే కారణం— మరింత బలంగా చూపించి వుంటే కథకు మరింత బిగి వచ్చేది. మొత్తం మీద నవల చివరి వరకూ చదివితేగాని, చదువరిని వదలదు. ఆంధ్ర నవలా ప్రపంచానికి ఇల్లిందల సరస్వతి దేవిగారు వ్రాసిచ్చిన యీ 'దరి జేరిన ప్రాణులు' ఎమెస్కో వారి కానుక. కనుక వారూ అభినందనీయులే!'

— ఫాలాక్షుడు

## కలకత్తా ఆంధ్ర సంఘం 15 వ వార్షిక సంచిక

కలకత్తా ఆంధ్రసంఘం వారు ప్రచురించిన పదిహేనవ వార్షికసంచిక మా కార్యాలయంచేరింది. శ్రీయుతులు పి. హెచ్. ఎస్. ప్రకాశరావు, కె. సి. శేషగిరిరావు, ఎస్. వి. సుబ్బారావుల సంపాదకత్వంలో వెలువడిన ఈ వార్షిక సంచికలో పలువురు ప్రముఖులు వ్రాసిన వ్యాసాలు, కవితలు, కథలు, నాటిక ఉన్నాయి. చక్కని ముద్రణ సంచికకి మరింత ఆకర్షణని తెచ్చింది.



డస్సెల్ డార్ఫ్‌లోని వార్‌స్టీన్ అంధుల సంస్థ ఇటీవల ఏర్పాటుచేసిన ప్రదర్శనలో స్విస్ చిత్రకారుడు మాక్స్ బుచరర్ రూపొందించిన 37 ప్లాస్టిక్ పెయింటింగ్ చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. అంధులు తమ చేతివేళ్లతో తడిమి తెల్సుకోడానికి అనువుగా చిత్రకారుడు ఈ చిత్రాలని రూపొందించడానికి తీగె, మేకులు, సాక్ తదితరములైన వాటిని ఉపయోగించారు. అంధులకూడా అన్నిరంగాల్లో పాల్గొనడానికి వీలుగా ఈ సంస్థ యింతకుముందే అంధులకి ఫాషన్ ప్రదర్శనలని, నాట్యం, సంగీతం, అలంకరణ మొదలగు విషయాలతో తర్ఫీదు కార్యక్రమాలని విజయవంతంగా నిర్వహించింది.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor; S. Sambhu Prasad.

# పాండ్స్ ఫేస్ పౌడర్‌తో వనితల ముఖము
# గంటల కొలది మనోహరమైన వర్ఛస్సుతో వుంటుంది

## అందు వలననే చాలమంది స్త్రీలు ఏ యితర పౌడర్ కంటే
## పాండ్స్ ఫేస్ పౌడర్‌నే వాడుతున్నారు

పాండ్స్ ఫేస్ పౌడర్, దాని ప్రత్యేక ఫార్ములా వలన యితర ఫేస్ పౌడర్‌ల కన్నా చాలా సేపు చర్మము మీద నిలిచి వుంటుంది. అతి మెత్తటి పాండ్స్ ఫేస్ పౌడర్ చర్మము మీద సునాయాసంగా సరిసమానంగా అంటి మీ ముఖమునకు మెరుగులు దిద్దుతుంది.



పాండ్స్ ఫేస్ పౌడర్ అందరి చర్మకాంతితో చక్కగా కలిసిపోయేలా వివిధ రంగులలో లభిస్తుంది: నేచురల్, రాషెల్, గోల్డెన్ రాషెల్, పీచ్ మరియు తెలుపు అది అనువైన మూడు సైజులలో లభిస్తుంది— చిన్నది, మధ్య సైజు, పెద్దది.

పాండ్స్ ఫేస్ పౌడరు—ప్రపంచమంతటా అందకత్తెలు వాడే ఫేస్ పౌడర్!

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)